"మీరా?" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును. నేనే—ఆశ్చర్యంగా వుందా?" అన్నాడు వీర్రాజు. అతడి కళ్ళు చుట్టూ దేనికోసమో వెదుకుతున్నాయి.

"ఏం కావాలి మీకు? ఎన్నడూ లేనిది ఇలా వచ్చారేమిటి?" అన్నాను.

"నాకు పని వుంది..." అంటూ అతను పడకగదిలోకి నడుస్తున్నాడు. అతనా గదిలోకి వెళ్ళడం నా కిష్టంలేదు. అడ్డంగా నిలబడి—"ఏంకావాలో చెప్పండి!" అన్నాను.

అతను విసురుగా నన్ను పక్కకు తోసేసి—"నీకిచ్చిన స్వేచ్ఛను ఎంత చక్కగా వినియోగించుకుంటున్నావో చూస్తాను..." అంటూ ముందుకువెళ్ళి రెండు తలుపులూ తోసి అక్కడ కనబడ్డ దృశ్యంచూసి స్తబ్దుడైపోయాడు.

అతనేదో అడిగేలోగా నేను రెండుచేతులతో ముఖం కప్పుకుని ఏడవసాగాను. అప్పుడు నా కళ్ళలోకి ఆగకుండా నీళ్ళు వస్తున్నాయి. అంత ఏడుపును ఒక్కసారిగా బయటపెట్టలేక మధ్య మధ్య వెక్కుతున్నాను.

"మోహనా! ఎందుకు తలపెట్టావీ దారుణానికి!" అన్నాడు వీర్రాజు. అతని కంఠం ఇదివరకటిలా లేదు. చాలా సౌమ్యంగా లాలనగా వుంది. ఆ కంఠంలోని ధ్వనికి నా ఏడుపు పెరిగిపోయింది.

వీర్రాజు నన్ను సమీపించాడు. అప్రయత్నంగా నా తల అతని గుండెలమీద వాలిపోయింది. అతను ప్రేమగా నా ముంగురులు, చెక్కిళ్ళు నిమురుతూ—"చెప్పు—ఈ దారుణానికి ఎందుకు తలపెట్టావు?" అన్నాడు.

"నాకు జీవించడానికి అర్హత లేదు!" అన్నాను ఇంకా ఏడుస్తూనే.

"అసలేం జరిగింది?"

"నా నోటితో చెప్పలేను..."

"నువ్వు చెప్పక్కర్లేదు. అంతా రాజశేఖరం చెప్పాడు" అన్నాడు వీర్రాజు.

"ఎప్పుడు?" అన్నాను అప్రయత్నంగా.

"నిన్న మధ్యాహ్నం" అన్నాడు వీర్రాజు.

వీర్రాజు చెప్పిన కథ వింటే నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

వీర్రాజుపై రాజశేఖరానికి రెండువిధాల పగ వుంది. నన్ను వీర్రాజు పెళ్ళిచేసుకోవడం మొదటిది. రాజశేఖరం భార్య నాగదేవి వీర్రాజు పాత ప్రియురాలు కావడం రెండవది. పెళ్ళి సమయానికి ఈ కథ రాజశేఖరానికి తెలియదు. పెళ్ళయ్యాక తన భార్య అప్పుడప్పుడు వీర్రాజును కలుసుకుంటున్నట్లు అతను గ్రహించాడు. వాళ్ళిద్దర్నీ ఓ పర్యాయం రెడ్‌హేండెడ్‌గా పట్టుకున్నాడు రాజశేఖరం.

నాగదేవి బరితెగించిన ఆడది. నేను వీర్రాజును ప్రేమించాను, మీ కిష్టం లేకపోతే విడాకులివ్వండి అనేసిందిట. రాజశేఖరం వంశప్రతిష్ఠకు అది చాలా అవమానం.

వీర్రాజును రాజశేఖరం ఎన్నోమార్లు రిక్వెస్టు చేశాడు. కానీ కోరివచ్చినఆడదాన్ని వదులుకోలేనన్నాడు వీర్రాజు. దానిమీద రాజశేఖరం వీర్రాజుపై పగబట్టాడు. నిన్ననే అతను వీర్రాజుకు తెలియజేశాడు—"నీ భార్యను నేను వచ్చి వ్యభిచారిణిని చేశానని" అందుకు ఋజువుగా అతను చాలా ఫోటోలు చూపించాడు.

అమాయకంగా కనబడే తన భార్య ఇలా ప్రవర్తించిందని వీర్రాజు నమ్మలేదు. ఈ రోజు అందుకే ఇంటికి వచ్చి చూశాడు.

"నీ తరఫున నీ కథకూడా చెప్పు. అంతా నిజమే చెప్పు. అసలేం జరిగింది?"

నాకు నిజం దాచాలనిపించలేదు. అంతవరకూ జరిగిందంతా వివరంగా వీర్రాజుకు చెప్పేశాను. ఆఖరుకు గోవిందరావు సంగతికూడా వదలలేదు. అన్నీ వింటున్నప్పుడు వీర్రాజు ముఖం బాగా ఎర్రబడిపోయింది. ఆవేశాన్ని అతి కష్టంమీద అణచుకుంటున్నాడని గ్రహించాను.

అంతా అయిపోయేక "చూడు మోహనా! నేనోసారి బయటకు వెళ్ళిరావాలి. అంతవరకూ ఏ అఘాయిత్యమూ తలపెట్టకు. నీ సమస్యకు మంచి పరిష్కారాన్ని నేను సూచిస్తాను" అంటూ అతను గదిలో ఉరితాడు తీసేసి— "నా మాట విని నేను వచ్చేదాకా ఎదురుచూస్తావని ఆశిస్తున్నాను" అంటూ ఇంట్లోంచి బయటకు వెళ్ళిపోయాడు.

ఆ క్షణంలో నాకు ఆత్మహత్యా ప్రయత్నాన్ని కొనసాగించే మనోధైర్యం లేదు. వరండాలో సోఫాలో చతికిలబడిపోయాను.

వీర్రాజు వెళ్ళిన అర్ధగంటకు రాజశేఖరం ఇంట్లోకి వచ్చాడు. వరండాలో కూర్చున్న నన్ను చూస్తూ—"మన సమస్యకు మంచి పరిష్కారం సూచించడానికే వచ్చాను" అన్నాడు.

"సమస్యను సృష్టించిన వాడివి నువ్వు. నీ స్వార్థం కోసం ఓ ఆడదాని నిండు జీవితాన్ని బలిచేశావు. నిండు హృదయంతో నీమీద ప్రేమను ప్రకటిస్తే—దాన్ని నిలువునా దగ్ధంచేశావు. నీఅంత దుర్మార్గుడు వేరే ఎక్కడా వుండడు" అన్నాను కోపంగా.

రాజశేఖరం నా ఎదురుగా కుర్చీలో కూర్చుని—

"వీర్రాజులాంటి వాడికి నేను చేసినశా స్తి తప్పంటావా?" అన్నాడు.

"నువ్వు నీ గురించీ వీర్రాజుగురించే ఆలోచిస్తున్నావు కానీ ఈ పగలమధ్య ఒక ఆడదాని నిండుబ్రతుకు..." అని నేనేదో అనబోతూంటే—

"అలా ఎందుకు జరగనిస్తాను? నిన్ను నా దాన్ని చేసుకుంటాను" అన్నాడు రాజశేఖరం.

"ఇది సంభవమా?" అన్నట్లు ఆశ్చర్యంగా చూశాను.

నా చూపులు అర్థం చేసుకున్నట్లున్నాడు రాజశేఖరం "అది చెప్పడానికే వచ్చాను. నిన్ను నేను వివాహం చేసుకుంటాను. అయితే మనం కొత్తచోట కాపురం ప్రారంభిస్తాం. నీకు తెలియకుండా ఇక్కడ కొంతకాలం నాకు వ్యాపారంలో సహకరించావు. అదేవిధంగా తెలిసీ కూడా ఇకముందు వ్యాపారంలో నాకు సహకరించాలి. నీకు ఏ లోటూ వుండదు. ఒక ప్రముఖుడి పర్సనల్ సెక్రటరీగా నీకు సమాజంలో పలుకుబడి వుంటుంది. ఖరీదైన జీవితం వుంటుంది."

"అంటే నీకు ఉంపుడుకత్తెగా వుంటూ, నువ్వడిగిన వారికి సుఖాన్నిస్తూ — ఓ వ్యభిచారిణి జీవితం గడపమంటావు" అన్నాను కసిగా.

"అలా గేంకాదు...నువ్వేం చేసినా అభ్యంతరం పెట్టని ఓ భర్తకూడా వుంటాడు."

"వుంటాడు. ఆ భర్తమాత్రం నువ్వుకాదు. అవునా?" అన్నాను.

"అవును మోహనా! వీర్రాజు నిన్నెలాగూ ఇక్కడుండనివ్వడు. నువ్వు నిరాశ్రయురాలివైపోకుండా ఆకర్ష

ణీయమైన జీవిత మొకటి నా దగ్గరుందని చెప్పడంకోసమని వచ్చాను. ఆలోచించుకుని నీకు నచ్చుబాటయితే వెంటనే శోభా లాడ్జికి వచ్చి రాజకుమార్ ని కలుసుకో. అతను నిన్ను నా దగ్గరకు చేరుస్తాడు'' అని వెళ్ళిపోయాడు రాజశేఖరం.

''చాలా గొప్ప ఆఫర్!'' అనుకున్నాను మనసులో కసిగా.

రాజశేఖరం వ్యాపారస్థుడి కొడుకు. అతడికి చాలా లోపాయికారీ వ్యవహారాలుంటాయి. వాటికి నన్ను పయోగించుకోవాలనుకుంటున్నాడు. నైతికంగా పతనమైన నన్ను వీర్రాజు గెంటేస్తే నాకు నీడలేకుండా పోతే— తను ఆశ్రయమిచ్చి నా బలహీనతల నాధారంగా చేసుకుని తన వ్యాపారం పనులు చేయించుకోవాలనుకుంటున్నాడు.

ఆ జీవితం తలచుకుంటేనే భయంకరంగా వుంది. ముందు ఏదో పొరపాటు అభిప్రాయాలో వున్నానుకానీ ఇప్పుడు తలచుకుంటూంటే వీర్రాజు క్రమశిక్షణ జీవితమే చాలా చాలా బాగుందనిపిస్తోంది.

సరిగ్గా ఇంకోగంటకు వీర్రాజు వచ్చాడు. ''నువ్విచ్చిన సమాచారం చాలా వుపయోగపడింది మోహనా! రాజశేఖరం భావిస్తున్నట్లు మాది స్మగ్లింగ్ వ్యాపారం కాదు. అలా నటిస్తోన్న ప్రభుత్వోద్యోగులం మేము. మాకు నిర్దుష్టమయిన కొన్ని పథకాలున్నాయి. అప్రకారం దేశంలోని కొందరు వ్యాపారస్థుల్నీ, ప్రముఖుల్నీ నిర్ణయించిన పద్ధతిలో చెకింగ్ చేస్తాం. నీద్వారా ఆ సమాచారం రాజశేఖరం ముఠాకు లీక్ అయింది. పోలీస్ వాళ్లు ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ చెకింగ్ చేస్తారో మాకు

ముందుగానే తెలుస్తోందని రాజశేఖరం అనుకున్నాడు తప్పితే మేము ప్రభుత్వోద్యోగులమనిఅనుకోలేకపోయేడు. నువ్వు చెప్పిన సమాచారం ఆధారంగా రాజశేఖరం, జయదేవ్, రాజకుమార్ వగయిరాలను అరెస్ట్ చేసే ఏర్పాట్లను చేసివచ్చాను. ఏర్పాట్లు చాలా పకడ్బందీగా జరుగుతున్నాయి. ఇందులో నా ప్రసక్తి ఏమీవుండదు..." అంటూ మెరుస్తున్న కళ్ళతో అతను చెబుతూంటే నేను ఆశ్చర్యంగా విన్నాను.

"మనమిక్కడ ఉండం. ఇంకో వూరు వెళ్ళిపోతాం" అన్నాడు వీర్రాజు.

"మనం అంటే!" అన్నాను ఆశ్చర్యంగా.

"మనం అంటే నువ్వూ నేనూ" అన్నాడు వీర్రాజు.

"అదెలా సాధ్యం? నేను... నేను..."

"ఆగు మోహనా!" అన్నాడు వీర్రాజు. "తప్పు చాలావరకు నాదే! ఒక విధమయిన కండకావరంతో రాజశేఖరం భార్యను నేను వదలుకోలేక పోయాను. అందుకేగదా అతను నామీద పగబట్టాడు. ఆ విధంగా చూస్తే అతని పగకు కారణం నేను చేసిన తప్పు! ఆ పగను అతను నీమీదకు మళ్ళించాడు. అదికూడా నా కారణంగానే! ఎటొచ్చీ అతను వ్యాపారస్థుడు కాబట్టి,నీద్వారా తన పగను తీర్చుకుంటూ తన పనులుకూడా చాలావరకూ చేసుకున్నాడు. చివర్లో నాముందు నిర్భయంగా నువ్వు చెప్పిన నిజాలు అతన్ని పట్టిచ్చాయి."

"ఏది ఏమయినా నేను చాలాతప్పులు చేశాను. అందులో నా బాధ్యతలేదని నేననలేదు. తెలిసి చేసిన తప్పులవి" అన్నాను.

"నువ్వు తెలిసికూడా తప్పుచేసే మనస్థితి నీపట్ల నా

ప్రవర్తన కారణంగా నీకు ఏర్పడింది. ఈరోజు ఉదయం నేను విపరీతమైన కోపంతో ఇంటికొచ్చాను. కానీ అక్కడ నీ ఆత్మహత్యా ప్రయత్నం చూసినాక నే మానసికంగా నువ్వెంత క్షోభకు గురవుతున్నావో తెలుసుకోగలిగాను. అప్పుడే నాబుద్ధి పనిచేసింది. నా తప్పులన్నీ తెలిశాయి. నా వివేకం నాకు కర్తవ్యబోధ చేసింది. ఫలితంగా నిన్ను సంతోషపెట్టాలనుకున్నాను.ఇకమీదట మనం గడపబోయే జీవితం కొత్తగా వుంటుంది..." అన్నాడు వీర్రాజు ఉత్సాహంగా.

"కానీ నేను మానసికంగా మామూలు జీవితానికి సిద్ధపడిలేను" అన్నాను నీరసంగా.

"బురదలో పడ్డ పువ్వును కడిగివేస్తే బురదపోయి స్వచ్ఛంగా మెరుస్తుంది. ఆ సంగతి తెలిసిన నేను పువ్వును మళ్ళీ బురదలో పారవేయలేను. ఇది నా నిర్ణయం! నా నిర్ణయం బలవంతంగా నీమీద రుద్దడం యిది ఆఖరుసారి అవుతుంది." అన్నాడు వీర్రాజు.

తప్పుచేయని వాడికంటె తప్పును క్షమించినవాడే గొప్పవాడు. అటువంటి గొప్పతనం ఇదివరలో వున్నా లేకపోయినా ఇప్పుడు వీర్రాజులో వున్నందుకు అతనిపై అంతులేని గౌరవాభిమానాలు కలిగాయి నాకు. ఆనందంతో దుఃఖం ముంచుకురాగా అతని హృదయంపై వాలి తనివితీరా ఏడ్చాను.

—: అయిపోయింది :—

# మదరిండియా ?

## ముద్దా సురేష్

"ఎస్. మైడియర్ ఫ్లాష్! మాతృదేశం పెద్ద ప్రమాదంలో పడింది" అన్నారు పైపుపీలుస్తూ మిలిటరీ ఇంటిలిజెన్స్ బ్యూరో డైరెక్టర్ కురువీర్.

ఆయన ముఖంలో 'వర్రీడ్ ఎక్స్‌ప్రెషన్' క్లియర్‌గా కనబడుతోంది. ఆయన నా ముఖంకేసి చూడకుండా సాలోచనగా సీలింగ్ కేసి చూస్తూ మాట్లాడితే మదర్ ఇండియా నిజంగా ప్రమాదంలో వున్నట్లే.

"పకిస్తాన్??" అన్నాను ప్రశ్నార్థకంగా ముందుకు వంగి.

కురువీర్ నా వేపు దృష్టి మళ్ళించి అన్నారు. "అండ్ చైనా."

ఉలిక్కిపడ్డాను.

పకిస్తాన్, చైనా కలిసి రెండు వేపుల్నుంచీ ఒకేసారి యిండియాపై దాడి ప్రారంభిస్తే...

వెల్! ఇట్స్ రియలీ సీరియస్ ప్రాబ్లమ్.

ప్రాబ్లమ్ కాదు క్రైసిస్...

యుద్ధ సంక్షోభం...

నెహ్రూ టైంలో ఇండియాలో పనిచేసిన అమెరికన్ రాయబారి జాన్ కెన్నత్ గాల్ బ్రెత్ వ్రాసిన పుస్తకం చటుక్కున జ్ఞప్తికొచ్చింది.

భారత్-చైనా యుద్ధం జరుగుతోంది.

"అప్పట్లో" భారత్ నావీ, ఆర్మీ, ఎయిర్ ఫోర్సులు చాల బలహీనంగా వుండేవి. సాంకేతికమయిన అభివృద్ధి ఏమాత్రం లేదు యిండియాకు.

చైనా బార్డర్సులో మన బెటాలియన్లు గల్లంతవుతూ వున్నాయి.

ఉన్న కొద్ది విమానాలు పిట్టల్లా కూలిపోతున్నాయి.

ఎన్నో స్థావరాల్ని సునాయాసంగా కొల్లగొట్టి చైనీస్ ముందుకు చొచ్చుకు వస్తున్నారు.

అదే సమయంలో—రెండో శత్రుదేశం పకిస్తాన్ మరోవేపునుంచి పోటు పొడవడానికి నిశ్చయించుకుంది.

ఇండియా నాయకులు గాభరా పడ్డారు...

అప్పట్లో అమెరికాతో–నెహ్రూ సంబంధాలు బాగా వుండేవి.

అమెరికా సహాయం చేయడానికి నిశ్చయించుకొని మిలిటరీ ఎయిర్ క్రాఫ్ట్స్ భారత రాజధానికి పంపింది. అవసరమయితే భారీయెత్తున అమెరికన్ సైనికులను సైతం పంపడానికి ఆ దేశం వాగ్దానం చేసింది.

పకిస్తాన్ ఎలుకతోక ముడిచి, కన్నంలోకి పరిగెట్టింది.

చైనా రాజీకి వచ్చింది.

ఇప్పుడు పరువీర్ అంటున్నదేమిటి?

అప్పటి ప్రయత్నం ఇప్పుడు కార్యరూపం దాలుస్తూ వుందా?

ఇప్పుడు మన డిఫెన్స్ ఫోర్సెస్ బ్రహ్మాండమయిన అభివృద్ధి చెందాయనడంలో సందేహంలేదు. దానికి నిదర్శనం—బాంగ్లాదేష్!

కాని రెండువేపుల్నించి యెదురయ్యేదైనా, పకిస్తాన్ల డబుల్ ఎటాక్ని తట్టుకొని నిలబడగలమా? దైనా అభివృద్ధిని తక్కువ అంచనా వేయడం ఆత్మహత్యా సదృశం.

"ఫ్లాష్!" కరువీర్ పిలుపుకి ఉలిక్కిపడ్డాను "ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"బాస్! ఒక్కోసారి_నాకీ రాజకీయ నాయకులమీద ఎక్కడలేని చిరాకు పుడుతుంది. బాంగ్లాదేష్ వార్ ఐన తర్వాత ఓ యిండియన్ మేజర్ ఏమన్నాడో తెల్సా?"

"ఏమన్నాడు?"

"జనరల్ నియాజీతో మనం సంధి ఒప్పందం చేసుకోకుండా కేవలం మరో మూడురోజులు ఫైటింగ్ కొనసాగిస్తే ఈపాటికి పకిస్తాన్ పేరు కొత్త మాప్స్లో వుండేదికాదన్నాడు..."

"ఓహ్, స్టాపిట్" అర్చారు కరువీర్ పైకిలేచి. "ఇలాంటి చౌకబారు స్టేట్మెంట్స్ యిక ఎప్పుడూ నా దగ్గర చెప్పక. యిండియాకు మరో దేశాన్ని ఆక్రమించుకొనే ఉద్దేశంలేదు. వుండబోదు. ఈ నాలుగు గోడలు దాటి మరెవరికైనా నీ మాటలు వినబడే అవకాశం వుంటే నిన్ను ఈపాటికి సస్పెండ్ చేసి వుండేవాడ్ని" ఉద్రేకంగా అన్నారు కరువీర్. వెంటనే తేరుకొని "నువ్వు బాధ్యతగల ప్రభుత్వోద్యోగిలా మాట్లాడ్డం

నేర్చుకోవాలి. గూఢచారివి నువ్వు. మూడు పైసల పత్రికా సంపాదకుడివి కాదు'' అన్నారు మందలింపుగా.

"సారీసర్! అసలు ఇలాంటి సునిశితమైన 'పెద్ద' విషయాలకి, మా ఏజంట్స్ అందర్లో అనుభవజ్ఞుడూ, ఎమ్.ఐ.బి. సంస్థకు వెన్నెముకలాంటివాడూ అయిన—టాప్ ఎజంట్ ఉగ్రసేన్‌ని పిలిపించవలసినది మీరు. జూనియర్‌నయిన నేనేం చేయగలను.'' సలహా ఇచ్చాను-ఉగ్రసేన్ గొప్పతనాన్ని, అతనితో నేను గడిపిన సాహసిక క్షణాల్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

కులువీర్ నోట్లోంచి పైపుతీసి, చేత్తో పట్టుకుని యిలా అన్నారు. "ష్లాష్! గూఢచారి ఉగ్రసేన్ ఇప్పుడు భారత దేశ రహస్యాలు అమ్ముకుంటూ పకిస్తాన్ తరఫున వారి జీతంతో పనిచేస్తున్న దేశద్రోహి''—

అదిరిపడ్డాను. "వాట్ డు యూ మీన్?'' అన్నాను సంభ్రమాశ్చర్యాలతో.

"కంగారుపడక! అది ప్రపంచం దృష్టిలో. ష్లాష్! కథ మొదట్నుంచీ చెబుతాను. ఏజంట్ ఉగ్రసేన్ భారతదేశాన్నే వున్న ఏకైక-సాటిలేని మేటి గూఢచారి అన్న విషయం మనకు తెలుసు. మనతోపాటు పకిస్తాన్ కూడా తెల్సు.

అతనికి పూర్వం - పకిస్తాన్ నుండి ఎన్నో ఆఫర్‌లు వచ్చాయి తమలో కల్సిపోమని. ఉగ్రసేన్ నిరాకరిస్తూ వచ్చాడు. గూఢచారి కార్యకలాపాలమీద అతను ఎన్నో సార్లు పకిస్తాన్ వెళ్ళి అక్కడ మాయమై తిరిగి యిక్కడ ప్రత్యక్షమయ్యేవాడు ఇంద్రజాలికుడిలా. ఎన్నిసార్లు ప్రయత్నించినా ప్రత్యర్థులు అతన్ని పట్టుకోలేక పోయారు. పకిస్తాన్ నిద్రలో - పీడకల అయ్యాడు ఉగ్రసేన్!

తర్వాత ఉగ్రసేన్ ఓ 'కౌంటర్ ఎస్పియనేజ్' నాటకమాడడాన్కి నేను అనుమతిచ్చాను.

అదే డబుల్ ఏజంట్ గా పనిచేయడం!

పకిస్తాన్ తరఫున పనిచేస్తూ...కాదు పకిస్తాన్ తరఫున పనిచేస్తున్నట్టు నటిస్తూ ఆ దేశపు కదలికలు మనకు ఎప్పటికప్పుడు పంపడాన్కి నిర్ణయాలు చేయడం జరిగింది.

ఉగ్రసేన్ నిర్ణయాన్ని పకిస్తాన్ ఎగిరి గంతేసింది. ఆ దేశం అతన్కి హారతులుపట్టింది. బ్రహ్మాండమైన వసతి, జీత, సదుపాయాలు కల్పించింది.

ఎలా నమ్మించాడో తెలీదుగానీ—ఉగ్రసేన్ను అమోఘంగా నమ్మింది పకిస్తాన్. ఇదంతా సుమారు ఆరునెలల క్రిందటి కథ.

ఉగ్రసేన్ పకిస్తాన్తో చేతులు కలిపిన మూడునెలల వరకూ ఏ రిపోర్టు రాలేదు. ఒక్కసారిగా బాంబులాంటి వర్తమానం పంపాడు. చైనా, పకిస్తాన్లు కల్సి ఒక్కుమ్మడిగా భారత్ పై దాడి చేయడానికి నిశ్చయించుకున్నాయనీ, ఆ రహస్య ఒప్పంద పత్రాలని తాను దొంగిలించి యిండియాకు చేరవేసే ప్రయత్నంలో వున్నాననీ దాని సారాంశం.

మైడియర్ ఫ్లాష్! ఆ యుద్ధవ్యూహం తాలూకు పత్రాలు మనకు లభిస్తే పకిస్తాన్, చైనాల పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుకలా వుంటుందని నీకు వేరే చెప్పనక్కరలేదు. ఈ కుతంత్ర పత్రాల్ని మనం ఐక్యరాజ్య సమితి ముందు పెడితే సిగ్గుతో ఈ రెండుదేశాలూ తలవంచుకొంటాయ్. నో నేషన్ విల్ కంటిన్యూ టు సపోర్ట్ దెమ్!

మూడు నెలలనుంచీ ఆ రహస్యపత్రాలను వెంటబెట్టు

కాని రాబోయే ఉగ్రసేన్ కొరకు ఎదురుచూస్తోంది భారత్.

కాని ఉగ్రసేన్ ఆచూకీ లేదు!

వర్తమానాలు లేవు!!

ఉగ్రసేన్ ఆ పత్రాల్ని దొంగిలిస్తూ దొరికిపోయేడా?

లేక దొంగిలించిన తర్వాత పారిపోయి రహస్యంగా దాక్కున్నాడా?

దొరికిపోయి - ఉగ్రసేన్ పకిస్తాన్ కారాగారాల్లో మ్రగ్గుతున్నాడా?

అసలు అతను బ్రతికే వున్నాడా?

యిత్యాది ప్రశ్నలు మమ్మల్ని అనుదినం వేధిస్తుండగా-మొన్ననే ఓ లేఖ వచ్చింది - ఉగ్రసేన్ వద్ద నుండి."

ఆసక్తిగా ముందుకు వంగాను.

"ఆ లేఖపై-తన పేరుమార్చి-మేమిచ్చిన చిరునామా కాకుండా — 'టు ఎడ్రెస్' మార్చి రాశాడు. అంటే పకిస్తాన్ నుండి భారత్ వచ్చే ప్రతి వుత్తరం సెన్సార్ అవుతోందన్నమాట! దీన్నిబట్టి ఆ దురాక్రమణ పత్రాల్ని ఉగ్రసేన్ చేజిక్కించుకున్నాడనీ - కాని దారులుమూసి వేయబడ్డంతో యిండియా రాలేక-ఎక్కడో రహస్యంగా దాక్కున్నాడనీ - ఈ డిపార్ట్మెంట్ అభిప్రాయం.

బహుశా ఏర్పోర్టులు, నౌకాశ్రయాలు, రైల్వేస్టేషన్లు మొదలైన అన్నిమార్గాలు ఉగ్రసేన్ కోసం ఎదురు చూస్తూ తీవ్రమైన కాపలా, కట్టుదిట్టాలతో వుండి వుండాలి. లేకపోతే మెరుపుతీగలాంటి ఉగ్రసేన్ ఈ పాటికి యిండియాలో వాలివుండేవాడు.

మిస్టర్ ఫ్లాష్! ఈ పత్రాలు మనకి కావాలి. యివి మనకు లభ్యంకాకపోతే — ఒప్పందంలోకి వ్యూహం

ప్రకారం డబుల్ ఎటాక్ ప్రారంభమౌతుంది. దట్ మీన్స్ మదర్ యిండియా ఈజ్ ఇన్ గ్రేవ్ డేంజర్. సో వుయ్ నీడ్ దోస్ డామ్డ్ డాక్యుమెంట్స్-ఎట్ ఎనీకాస్ట్"

అలసిపోయిన కురువీర్ వూపిరి పీల్చుకుంటూ ఆగి— లాంగ్ కోట్ జేబులోంచి ఓ ఎయిర్ మెయిల్ కవరు ప్రాడ్యూస్ చేసి నాకిచ్చారు.

కవర్ మీది ఎడ్రస్ చదివి—ప్రశ్నార్థకంగా కురువీర్ వేపు చూశాను.

"ఆ అడ్రస్ నా కజిన్ సిస్టర్ది. ఢిల్లీ శివార్లలో వున్న శాస్త్రీపురంలో వుంటూంది. నాకో కజిన్ సిస్టరున్నట్టు నాకు, నా రైట్ హాండ్ ఉగ్రసేన్కూ తప్ప మరెవరికీ తెలియదు. పకిస్తాన్ గూఢచార శాఖకేకాదు భారత ప్రభుత్వానిక్కూడా తెలియదు. ఇప్పుడు నీకు మాత్రం చెప్పాల్సి వచ్చింది. ఇన్ని జాగ్రత్తలు తీసుకోబట్టే ఆ ఉత్తరం పకిస్తాన్ సెన్సార్ బారినుండి తప్పించుకో గలిగింది."

తలవూపి కవర్లోని కాగితం బయటకులాగి, మడత విప్పాను.

జిన్నామాబాద్,
2 సెప్టెంబర్ '78.

అక్కా—

క్షేమమా?

నాకు యిక్కడ వచ్చిన కొత్తలో వ్యాపారం బాగానే సాగింది. కానీ తీవ్రమైన అనారోగ్యం వల్ల బిజినెస్ యిప్పుడు కుంటుబడింది. బయట వాతావరణం ఎంతో వేడిగావుంది. బయట తిరగనివ్వటంలేదు డాక్టర్లు. ఎన్నాళ్ళు మంచంమీద వుండాలో తెలీదు. వంటరితనం

ఫీలవుతున్నాను. దయచేసి తమ్ముడు కిరణ్‌ని వెంటనే పంపించు.

ప్రస్తుత పరిస్థితుల్లో వాడితోడు ఎంతో అవసరం. ఉంటాను మరి.

లవింగ్ బ్రదర్,
S. O. సిన్హా.

క్రింది సంతకం చూసి అదిరిపడ్డాను.

S. O. సిన్హా!

సిన్హాకి ఇనీషియల్ "ఎస్"

అంటే—S. O. S.

పర్వతంలాంటి ఓడ నిస్సహాయంగా సముద్రగర్భంలో మునిగిపోయేముందు పంపుతారు S.O.S. సిగ్నల్.

బ్రహ్మాండమైన విమానం — మట్టిబొమ్మలా నేలకు గుద్దుకోబోయే ముందు పంపుతుంది S.O.S. సిగ్నల్!!

ఆ కోడ్ అర్థం 'వెంటనేవచ్చి ఆదుకోమని!'

సందేహంలేదు. ఉగ్రసేన్ పీకలదాకా ఆపదలో మునిగివున్నాడు. అయితే అతని కాళ్ళక్రింద వున్నది ఊబినేల కాబట్టి నేను మరింత వేగంగా వెళ్ళాలి.

ఫ్రమ్ ఎడ్రస్ లేదు.

రిస్క్ లేకపోతే ఇచ్చివుండేవాడు!

ఎక్కడ వెతకాలి నేను??

శాంత, గంభీర కంఠంతో అన్నారు కురువీర్. "ప్లాష్! ఆ ఉత్తరం చదివిన తర్వాత నీకు అర్థమయ్యేవుంటుంది, నిన్ను సెలక్ట్ చేసుకున్నది నేను కాదనీ, ఉగ్రసేన్ అనీ. నీశక్తి సామర్థ్యాలమీద అతనికి పరిపూర్ణ నమ్మకముంది."

"మరో విషయం. ఇండియన్ హాండిక్రాఫ్ట్సు పకిస్తాన్‌లో అమ్మే పెద్దవ్యాపారం చేసేవాడు ఉగ్రసేన్.

అఫ్‌షోర్స్-ఇక్స్ప్ కవరింగ్ జాబ్! అక్కడి డీలర్ అడ్రస్ యిస్తాను. అక్కడ్నుంచే ప్రారంభించాలి నీ ఇన్వెస్టిగేషన్! అంతకంటే మనవద్ద ఆధారాలు లేవు.”

తల వూపాను ఫ్రెష్ సిగరెట్ వెలిగిస్తూ.

“ఫ్లాష్! ప్రస్తుత పరిస్థితులుబట్టి నువ్వు టూరిస్టుగా వెళ్ళే అవకాశం మాత్రమేవుంది. అంటే పదిహేను రోజులు మాత్రమే నువ్వు వుండగలుగుతావ్. నీ బాధ్యతలు ఆ టైంలోగా పూర్తి చెయ్యగలవా?”

నవ్వి ఊరుకున్నాను.

“ఫ్లాష్! చివరిసారిగా చెబుతున్నాను. నువ్వు చాల జాగ్రత్తగా వ్యవహరించాలి. ఉగ్రసేన్ లేఖనుబట్టి వాతావరణం వేడిగా వున్నట్టు స్పష్టమవుతోంది. వాచ్ యువర్ బాక్-సన్! ఎయిర్‌పోర్టులో దిగిన మరుక్షణం నుండీ నీ ప్రాణాలకి గ్యారంటీ లేదు.”

“చావడమంటూ జరిగితే ఫ్లాష్ భరతమాత ఒళ్ళో నే చస్తాడు” నవ్వుతూ లేచినిలబడ్డాను. “బాస్! అన్నీ సిద్ధంచేయండి” చెప్పి బయటకు నడిచాను.

## 2

పకిస్తాన్ రాజధాని ఇస్లామాబాద్‌లో విమానం దిగేటప్పటికి సాయంత్రం ఐదు గంటలయింది.

ఎయిర్‌పోర్ట్ నుండి టాక్సీలో బయలదేరి, హోటల్ ‘ఖుష్‌బూ’ ముందు దిగాను.

డీలక్స్‌రూమ్ బుక్ చేసుకుని—గదిలో ప్రవేశించాను.

నేను ఆలస్యం చేసేకొలది—ఉగ్రసేన్ మృత్యువుకు దగ్గరవుతుంటాడు.

చకచకా షేవింగ్, స్నానాదులు పూర్తిచేసి డార్క్ షేడ్ లైట్‌బ్లూ సూట్ ధరించాను. సూట్‌కేస్ రహ

స్యూటరలోంచి 'యిటాలియన్ రెబెట్టా' తీసి ఛాతీకెడం వేపు హోల్ స్టెర్‌లో అమర్చాను. పకిస్తాన్ కరెన్సీ పర్సునిండా నింపుకున్నాను.

అద్దంలో నా గెటప్‌ని మరోసారి పరీక్షించుకొని ఈల వేసుకుంటూ లిఫ్ట్ వేపు నడిచాను.

మరో పదినిముషాల్లో నేనెక్కిన టాక్సీ ఓ బ్రహ్మాండ మైన షాప్ ముందు ఆగింది. టాక్సీలోంచి షాప్ వేపు పరి శీలనగా చూసాను.

"అల్లాడిన్ హాండిక్రాఫ్ట్స్ ఎంపోరియం" అన్న నియాన్ లైట్ల బోర్డు ప్రకాశవంతంగా వెలుగుతోంది.

ఉగ్రసేన్ — భారతదేశ కళాకారులు చేతితో మల చిన అపూర్వ వస్తువుల్ని ఈ షాప్‌కు అమ్మేవాడు.

నాకావల్సిన అడ్రస్సు, నా పరిశోధనకు ఉన్న ఏకైక ఆధారం యిదొక్కటే.

టాక్సీ ఫేర్ చెల్లించి యెంపోరియంలోకి నడిచాను, రెండువేపులా చకచకా పరిశీలిస్తూ. వందలాది దేశ, విదేశ హాండిక్రాఫ్ట్ వస్తువులు ఆ షాపులో అందంగా అలంకరించబడ్డాయి. చాల విశాలమైన షాప్ అది.

షాప్ అనేకంటే ఎగ్జిబిషన్ హాల్ అంటే బావుం టుందేమో.

లోపల నలుగురు సేల్స్‌మన్‌లు, ఒక సేల్స్ గర్ల్-కాష్ బాక్స్ దగ్గర మరో అమ్మాయి వున్నారు.

"వెల్‌కమ్ సర్! మా దగ్గర అన్ని ఏషియన్, యూరప్ దేశాల హాండిక్రాఫ్ట్స్ వున్నాయి. మే ఐ నో యువర్ ఛాయిస్ సర్?" అంది చిరునవ్వుతో కాష్‌గర్ల్ లేచి నిలబడుతూ.

కుడివేపు డిస్‌ప్లే కౌంటర్ వెనకగా వున్న ఒకేఒక

సేల్స్‌గర్ల్ నాకేసి తదేకంగా చూడ్డం గమనించి వులిక్కి-పడ్డాను.

ఆమె చాలా అందంగావుంది.

ఆమెనుంచి చటుక్కున దృష్టి మరల్చి శాప్‌గర్ల్‌కేసి చూస్తూ అన్నాను. "మిస్..."

"ఫాతిమా" అందించిందామె.

"లుక్ మిస్ ఫాతిమా! నేను నా ఛాయిస్ చెప్పే ముందు మీ ప్రొప్రయటర్ అల్లాడీన్‌ని ఓసారి చూడ వచ్చా. నేను చాలాదూరంనుండి ఆయన్ను కల్సుకో డానికి వచ్చాను."

"నో ప్రాబ్లెం సర్! ఐవిల్ రైన్‌హిమ్" ఫాతిమా యింటర్ కమ్యూనికేషన్‌లో చకచకా ప్రొప్రయిటర్‌తో మాట్లాడసాగింది.

"మీ పేరు అడుగుతున్నారు" అందామె.

"ఓఝా — ఇంద్రజిత్ ఓఝా-ఫ్రమ్ ఇండియా!" చెప్పాను.

"మిస్టర్ ఓఝా! అల్లాడీన్ మీతో మాట్లాడతారు. ఈ హాల్ చివర అప్‌స్టెయిర్స్‌కి వెళ్ళండి. కుడివేపు మొదటి డోర్ ఆయన ఆఫీస్."

ఆమెకి థాంక్స్ చెప్పి ముందుకు నడిచాను.

యింతకుముందు నాకేసి తదేకంగా చూసిన—డిస్ప్లే కౌంటర్‌కి వెనగ్గా వున్న సేల్స్‌గర్ల్ యింకా నావేపు అలానే చూస్తోంది.

ఆమె నుదుటిమీద చెమటలుపట్టాయి...

ఒక క్షణం ఆమె నవ్వి మళ్ళీ దృష్టి మళ్ళించుకుంది.

నా మెదడులో పెద్ద ప్రశ్నార్థకం వెలిసింది.

ఆమె ఎందుకు కంగారు పడుతోంది?

నిజంగా నవ్విందా?

లేక నా కళ్ళు మాజిక్ చేశాయా?

ఎయిర్ కండిషన్డ్ షాపులో ఆమె నుదుటిమీద చమటలు ఎందుకు పట్టాయి??

తిన్నగా నడుస్తూ, మెన్లెక్కి ప్రొప్రయిటర్ గది ముందాగి మునివేళ్ళతో తలుపుమీద కొట్టాను.

"కమిన్!"...

తలుపు తోసుకొని లోపలికి నడిచాను.

అల్లాడీన్ పెద్ద మహాగని టేబుల్ వెనుక రివాల్వింగ్ ఛేర్‌లో కూర్చొని వున్నాడు. యాభై ఏళ్ళ వయసుంటుం దతనికి.

సూలకాయుడు.

బట్టతల.

కళ్ళజోడు.

తెల్లని పొడవాటి గెడ్డం.

లక్షాధికారైనా, సాదా దుస్తులు ధరించాడు. ఎడం చేతి నాలుగు వ్రేళ్ళకి పెద్దపెద్ద బంగారపుటుంగరాలు.

తెల్లటి అంగీ మెడనుంచీ కాళ్ళదాకా వుంది.

ఆ దుస్తుల్లో అతను మతగురువులా వున్నాడు.

"వెల్‌కమ్ మిస్టర్ ఓఝూ!" అన్నాడతను సాదరంగా లేచి నిలబడి "సిట్ డవున్. హా ఎబౌట్ ఎ డ్రింక్?"

"ష్యూర్. థ్యాంక్ యూ! ఐ ప్రిఫెర్-స్కాచ్ ఆన్ ది రాక్స్" అన్నాను కుషన్డ్ ఛేర్‌లో కూలబడుతూ.

అల్లాడీన్ నవ్వి లిక్కర్ కాబినెట్ వేపు కదిలాడు. "నాకు నిక్కరం రమ్ అంటే ఎంతో ఇష్టం. రెండు పెగ్గులు తాగితే గాలిలో తేలినట్లుంటుంది. యు సీ. నాలాంటి సూలకాయుడికి గాల్లో తేలడం చక్కని అనుభవం."

నవ్వి సిగరెట్ ముట్టిస్తూ అన్నాను. "యిండియన్ స్టఫ్ దొరుకుతుందా ఇక్కడ?"

"ఇట్స్ జోక్ మిస్టర్ ఓర్షా!" ఐస్ క్యూబ్స్ వేయబడ్డ రెండు బెలూన్ గ్లాసులు టేబుల్ మీద పెట్టి ఒకదాంట్లో విస్కీ, మరోదాంట్లో రమ్ పోస్తూ నవ్వాడు అల్లాడీన్. "పకిస్తాన్‌లో దొరకనిదేదీ లేదు. మీ దేశంలో ఓ హిందీ సినిమా విడుదల కాకముందే ఇక్కడి ధనికులు ఆ సినిమా తమ ఇళ్ళల్లో చూస్తారు. మీ కొత్త సినిమా పాటలు–అక్కడ తయారవ్వగానే ఇక్కడికి అతి వేగంగా వస్తాయి కాసెట్ల రూపంలో...యునో...స్మగ్లింగ్"... అన్నాడు బాటిల్స్ కప్‌బోర్డ్‌లో పెట్టి తిరిగి రివాల్వింగ్ ఛేర్‌లో కూర్చుంటూ అల్లాడీన్.

ఇద్దరం ఛీర్స్ చెప్పి డ్రింక్స్ సిప్ చేయసాగాం.

"స్ట్రాంగ్!" అన్నాడు అల్లాడీన్ రెండు గుక్కలు రమ్ము తాగి ఆనందంగా నవ్వుతూ. "యిప్పుడు చెప్పండి మీకే రకం హాండిక్రాఫ్ట్ కావాలి? ఏ దేశంలో తయారైనదైనా ఇక్కడ పబ్లిగ్గా అమ్ముతాం. ఆఫ్‌కోర్స్...విత్ ఆల్ ది టాక్సెస్..."

"మిస్టర్ అల్లాడీన్! ఉగ్రసేన్ ఎక్కడ?" అన్నాను చేతిలోని విస్కీ గ్లాసును వేళ్ళమధ్య తిప్పుతూ.

అల్లాడీన్ చేతిలోని గ్లాసు త్రుళ్ళిపడి రమ్ము టేబుల్ మీదికి ఒలికింది.

"అయామ్ సారీ!" అన్నాడతను తడబాటు కప్పిపుచ్చుకొనే ప్రయత్నంలో తేలిగ్గానవ్వేస్తూ "ఓల్డ్ ఏజ్! —మీరు ఉగ్రసేన్ స్నేహితులా?"

"అవును. ఆరునెల్ల క్రితం ఉగ్రసేన్ పకిస్తాన్

వచ్చాడు. మూడేళ్లనుంచి_అతనివద్ద నుండి వుత్తరాలు లేవు. మీకు తెలిసే వుండాలి. అతనెక్కడ వున్నాడు ప్రస్తుతం?" అడిగాను వేగంగా.

అల్లాడీన్ గ్లాసు ఖాళీచేసి భుజాలెగరేసాడు.

"లుక్ మిస్టర్ ఓఝా! ఉగ్రసేన్, నేనూ ప్రాణ స్నేహితులం. అతను పంపిన వస్తువులవల్లే నా వ్యాపారం యింత బాగా నడుస్తోంది. కొత్తవెరైటీ సాంపిల్స్ పట్టుకొని పకిస్తాన్ వస్తానని ఆర్నెల్ల క్రితం లేఖ రాశాడు సేన్. యిప్పటికీ_అతనికి నెలకో వుత్తరం రాస్తున్నాను. నా దగ్గర స్టాక్ అయిపోయింది. అమెరికన్ టూరిస్టులు యిండియన్ హాండిక్రాఫ్ట్స్‌ని ఎగరేసుకుపోతున్నారు..."

"మిస్టర్ అలాడీన్! ఎగ్జాక్ట్‌గా మీరు చెప్పబోయేదేమిటి?" నా గొంతులో విసుగుదల ధ్వనించింది.

...అలాడీన్ సిగరెట్ ముట్టించుకొని పొగవదుల్తూ అన్నాడు. "నేను చెప్పేది నిజం. ఉగ్రసేన్‌ని నేనుచూసి సంవత్సరమయింది. అతను ఆర్నెల్లక్రితం పకిస్తాన్ వస్తే నన్ను తప్పక కల్సివుండేవాడు. కాని ఉగ్రసేన్ రాలేదు. మీరు పొరబడ్డారు. హి ఈజ్ నాట్ యిన్ పకిస్తాన్."

నా ఒంట్లో నిరుత్సాహం ఒక్కుమ్మడిగా ఆవహించింది. నాకు దొరికిన ఒకే ఒక ఆధారం అల్లాడీన్. అతను నిరాధారమయ్యాడిప్పుడు.

నా యిన్వెస్టిగేషన్ మొదట్లోనే విఫలమయింది.

ఉగ్రసేన్‌ని ఆదుకోడం ఎలా?

తద్వారా భారతదేశాన్ని యుద్ధం బారినుండి ఎలా కాపాడాలి?

మూడు రూపాయల నోటులా, అల్లాడీన్ మాటలు అసహజంగా వున్నాయి.

అల్లాడీన్ అబద్దాల వెనుక పకిస్తాన్ గూఢచారుల ప్రమేయం వుండివుండొచ్చు. అది నిజమైతే అల్లాడీన్ చేత నిజం చెప్పించడం కష్టం!

"ఉగ్రసేన్ ఆర్నెల్లక్రితమే పకిస్తాన్ వచ్చాడన్నది నిజం. జ్ఞాపకం తెచ్చుకోండి మిస్టర్ అల్లాడీన్."

పెదవి విరుస్తూ నిస్సహాయంగా భుజాలెగరేశాడు అల్లాడీన్. "ఉగ్రసేన్ నా స్నేహితుడు మిస్టర్ ఓఝూ! అతను కల్సుకుని వుంటే సరుకులు పంపమని నెలకో వుత్తరం ఇండియాకు రాయను. ఆ లేఖల కాపీలుకూడా నా దగ్గర వున్నాయి."

పైకి లేచాను. "థాంక్యూ ఫర్ ది డ్రింక్" అన్నాను నవ్వేస్తూ.

"బట్ అయామ్ సారీ మిస్టర్ ఒఝూ! మీకు సహాయపడలేక పోయాను. మీకేమైనా ఆర్టికల్ కావలిస్తే సెలెక్ట్ చేసుకోండి. నా స్నేహితుడి స్నేహితుడిగా మీకు పెద్ద డిస్కౌంట్ ఇస్తాను"

"ష్యూర్! పర్షియన్ ఆర్టికిల్ ఒకటి తీసుకుంటాను."

"అయితే యింటర్‌కంలో శాప్‌గర్ల్‌కి చెప్తాను. మీరు వెళ్ళి వస్తువులు చూడండి."

తలుపు మూసి, మెట్లు దిగి హాల్లోకి వచ్చాను.

అంతకు ముందు నాకేసి తదేకంగా చూసిన సేల్స్‌గర్ల్ వేపు నడవసాగాను. ఆమె నాకోసం ఎంతో ఎక్సైట్‌మెంట్‌తో ఎదురుచూస్తోందని గ్రహించాను.

గులాబీరంగు గౌనులో ఆమె సౌందర్యం ముద్దొస్తోంది.

"మిస్..." ఆగిపోయాను పేరు తెల్సుకోవాలని.

"మాయాశ్రేష్ఠ" అందామె.

చక్కని అందంతో — తీయని కంఠంగల స్త్రీలు తక్కువ.

ఆ రెండింటి మేళవం మాయా శ్రేష్ఠ.

ఆమె బెదురుచూపులు, ఆమె అందాన్ని రెట్టింపు చేస్తున్నాయి.

"యూ మీన్ మీరు ఈ దేశం..."

తల అడ్డంగా ఊపిందామె. "నేపాల్. వ్యాపారులు ఇక్కడ స్థిరపడ్డారు. సార్! మీకేం కావాలో చూడండి. అవి యిటాలియన్ - ఇవి పర్షియన్." అంటూ గ్లాస్ కేజెస్‌లోని రకరకాల వస్తువులను చూపించసాగింది.

"ఆ పర్షియన్-ఉమర్ ఖయ్యాం బొమ్మ తియ్యండి హౌ మచ్?" అన్నాను.

"రెండు వేలు" అంటూ ఆ బొమ్మ నాకందించిందామె. విచిత్రమైన చెక్కతో, నగిషీలు చెక్కబడి తయారు చేయబడిందది. చేతిలో పట్టుకుని ఆ వస్తువును పరిశీలిస్తుండగా వులిక్కిపడ్డాను. సన్నగా గొణుగుతోంది మాయా!

"ఏజంట్ ఫ్లాష్! మిమ్మల్ని గుర్తించాను. ఉగ్రసేన్ ఎక్కడ వున్నాడో చెబుతాను...రాత్రి పదిగంటలకు... షెహనాయ్ క్లబ్...ఇక వెళ్ళిపోండి."

పాక్ నుండి గబగబా తేరుకున్నాను.

"మిస్ మాయా! ఇది పాక్ చేయించండి!" బొంగురుగా అన్నాను.

"థాంక్యూ సర్! మీది లవ్‌లీ సెలెక్షన్" అందామె.

"నా ఆరాధ్య పురుషుడు ఉమర్ ఖయ్యాం" నవ్వి ఆమె కళ్ళలోకి చూస్తూ చిన్నగా తల పంకించి—కాష్ గర్ల్ వేపు నడిచాను.

రెండువేల పకిస్తాన్ కరెన్సీతీసి ఆమె ముందు పడేశాను. బాస్ కరువీర్ ఈ బిల్లు చూస్తే రంకెలేస్తాడు.

"నో సర్" అంది కాల్‌గర్ల్ ఫాతిమా. "పదిహేను వందలు చాలు. అల్లాడీన్ ఆర్డర్స్" అంది నవ్వుతూ ఐదు వందలు తిరిగి ఇచ్చేసి.

వెనక్కి చూడకుండా, పాకింగ్ పట్టుకొని ముందుకి నడిచాను.

ప్లాట్ ఫాంమీద నా కళ్ళు తక్కున ఆగిపోయాయి.

...అప్పటిదాకా ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఆనుకుని నా కేసి పరిశీలనగా చూస్తున్న ఓ ఎర్రటోపి మనిషి గభాలున న్యూస్ పేపర్ ముఖానికి అడ్డంగా పెట్టుకున్నాడు.

నా మస్తిష్కంలో ప్రశ్నలు తలెత్తాయి.

అతన్ని ఇంతకు ముందు ఎక్కడో చూశాను.

ఎక్కడ?

మెదడుకి పని కల్పించాను. చటుక్కున గుర్తొచ్చింది.

అతన్ని చూసింది ఎక్కడో కాదు.

ఇక్కడే!

షాపులోకి వెళ్ళబోయే ముందు.

ఎఱ్ఱటోపీ - మూలాన గుర్రు వుంది.

మాయాశ్రేష్ఠ నాతో రహస్యంగా మాట్లాడ్డం అతను గుర్తించాడా? ఒక్క విషయంలో మాత్రం నా కనుమానం లేదు.

పకిస్తాన్ గూఢచారులు నా వెనకబడ్డారు!

## 3

షెహనాయ్ క్లబ్!

రాత్రి సరిగ్గా 9-50 నిముషాలయింది...

డిమ్‌లైట్ల వెలుగులో ఓ మూలగా కూర్చొని మిస్. నగీనా నృత్యం యాంత్రికంగా తిలకిస్తూ, అసహనంగా ఎదురు చూస్తున్నాను మాయాకోసం.

మరో పది నిముషాల్లో మాయా రావాలి.

ఆమె చిక్కుల్లో పడితే నా పరిశోధన ఆగిపోయినట్లే.

ఉగ్రసేన్ వునికి తెలిసిన ఒకే వ్యక్తి - మాయ.

రెండు రోజులకు ఓ జాగ్వార్ కారుని అద్దెకి తీసుకొని షెహనాయ్ క్లబ్‌కి వచ్చాను.

నా కారుని మరో కారు — నీడలా వెంటాడ్డం గమనించాను. అయితే వెంటాడే కారులోని వ్యక్తి-ఎట్టిటోపీ మనిషి కాదు.

మరో బోడిగుండు వ్యక్తి - అంటే ఎట్టిటోపీ మనిషి మాయాను వెంటాడుతున్నాడా?

బోడిగుండు వ్యక్తి క్లబ్ బయట ఆగిపోటం గమనించాను. అతను లోపలికి రాలేదు.

వాచీ చూసుకున్నాను. సరిగా పదిగంటలయింది.

చటుక్కున లేచి నిల్చున్నాను. బేరర్‌కి బిల్ పేచేసి క్లబ్ బయటకు వచ్చాను. చకచకా నడవసాగాను. అప్పుడే కనపడిందామె.

ఎదురుగావున్న మెయిన్‌రోడ్‌లోంచి గబగబా క్లబ్ వేపు నడుచుకుంటూ వస్తోంది మాయా, వానిటీబాగ్ లోంచి కర్చీఫ్‌తీసి ముఖాన్ని అద్దుకుంటూ.

ట్రాఫిక్ రద్దీగావుంది.

పెద్ద పెద్ద అంగలతో నా కారువైపు నడిచాను.

డ్రయివింగ్ సీట్లో కూలబడి భడాలున తలుపు మూసాను.

ఇంజన్ స్టార్ట్‌చేసి కారుని రాకెట్‌లా ముందుకి దూకించాను.

జాగ్వార్ రివ్వునవెళ్ళి భయంగా చూస్తూ నిలబడి పోయిన మాయప్రక్కగా ఆగింది.

"క్విక్ మాయా! గెటిన్, మనల్నెవరో ఫాలోచేస్తున్నారు" అర్చాను ఫ్రంట్ డోర్ ఓపెన్ చేసి.

మాయ తొందరగా తెరుకొని కార్లో కూర్చుంది.

డోర్ మూసి యాక్సిలేటర్ని కాలితో అదిమిపెట్టాను.

వెనకాలే, కొద్దిదూరంలో అప్పుడే స్టార్టయి ముందుకు వురుకుతున్న రెడ్ అంబాసిడార్ నాకు రియర్ వ్యూలో కనబడింది.

ఆ కార్లోవున్నది ఎవరో కాదు.

ఎల్లటోపి, బోడిగుండు.

"మాయా! వాళ్ళను వదిలించుకొనే అవకాశముందా?" అన్నాను రియర్ వ్యూ మిర్రర్ లోంచి వెనకాల కార్ని గమనిస్తూ.

"కొద్దిదూరంలో కుడివైపు ఓసందు యెదురౌతుంది. ఆ సందునుండి మూడువైపులా రకరకాల దార్లున్నాయి. పైగా ఆ ఏరియా చీకటిగా వుంటుంది. అక్కడ సులువుగా వదిలించుకోవచ్చు వెనకాల కారుని."

ట్రాఫిక్ హెవీగావుంది.

హార్న్ మోగిస్తూ జాగ్వార్ స్పీడ్ పెంచాను.

ప్రత్యర్థుల అంబాసిడార్ కి ఇప్పుడు ఫర్లాంగుదూరంలో వున్నాం.

కారుని సర్రున కుడివేపు సందులోకి కోశాను.

ఆ సందు చీకటిగా, నిర్మానుష్యంగా వుంది.

హెడ్ లైట్ల వెలుతుర్లో లోపలికి వేగంగాపోనిచ్చేను.

అటూయిటు దారులు కనబడుతున్నాయి.

"క్విక్. యింకా ముందుకి పోనివ్వండి, మూడురోడ్ల జంక్షన్ కి వస్తాం. అప్పుడు లెఫ్ట్ కి తిప్పండి. ఊరిచివర ఖలీఫాపహాడ్ కి చేరుకోవాలి మనం. అక్కడే ఉగ్రసేన్ వున్నది." అందామె.

"మాయా! నన్ను 'అండీ' అని పిలవడం మానేయాలి. ఓ. కే?"

చిన్నగానవ్వి తలవూపిందామె.

రెండు నిమిషాల్లో జంక్షన్ దాటి వూరిబయటకు ప్రయాణిస్తున్నాం...

వెనక్కి చూశాను.

కనచూపు మేరలో యెలాంటి హెడ్ లైట్స్ కనబడలేదు.

హైవేమీద విద్యుద్దీపాల కండిషన్ బాగులేదు. అత్యంత మెలుకువతో డ్రయివ్ చేస్తున్నాను.

అక్కడక్కడ వెలిగే ఎలక్ట్రిక్ స్థంభాల్ని దాటుకుంటూ, జాగ్వార్ వేగంగా దూసుకుపోతోంది.

"మాయా జిన్నామాబాద్ లో యెవరెవరితో వుంటున్నావ్?"

"నేను ఒంటరిదాన్ని," చిన్నగా మూల్గింది.

నేను దృష్టి పక్కకు తిప్పాను. మాయ చెంపలవెంట కన్నీళ్ళు కారుతున్నాయి.

"ఆర్యూ ఆల్ రైట్ మాయా?" అన్నాను కంగారుగా.

"అయామ్ ఆల్ రైట్!" అందామె కర్చీఫ్ తో కళ్ళు తుడుచుకుంటూ. "అయామ్ ఆల్ రైట్ ఫ్లాష్!" అంది ఆమె మళ్ళీ "బట్ ఉగ్రసేన్ ఈజ్ నాట్ ఆల్ రైట్."

ఉలిక్కి పడ్డాను.

ఎదురుగా వస్తున్న వాహనానికి సైడ్ యిచ్చి తిరిగి ముందుకు పోనిస్తూ అన్నాను. "అంటే?"

"లెట్ మి టెల్ యు ఎవ్విరిథింగ్ ఫ్లాష్! ఉగ్రసేన్ పకిస్తాన్ నుండి డబుల్ ఎటాక్ డాక్యుమెంట్స్ దొంగి

లించిన తరువాత మాయమయ్యాడు. కాని ఒకానొక దురదృష్టకరమైన రోజున— పకిస్తాన్ ప్రత్యేక గూఢచారి చంఘీజ్ ఖాన్‌కు దొరికిపోయాడు. ఆ రహస్య పత్రాలు దేశందాటితే వారికి యెంత ప్రమాదమో నీకు తెల్సు!

చంఘీజ్ ఖాన్ అనుచరులు— చేజిక్కిన ఉగ్రసేన్ని చితక బాదారు! చిత్రహింసలు పెట్టారు! అతన్ని చెరకు పిప్పిలా చేశారు!

జీవచ్ఛవంలా మార్చారు!

కాని ఉగ్రసేన్ పెదవి విప్పలేదు.

ఆ టాప్ సీక్రెట్ పత్రాలు ఎక్కడ దాచాడో చెప్పలేదు.

విసిగి వేసారిపోయాడు చంఘీజ్ ఖాన్!

మరోసారి చిత్రహింస చేస్తే, పరలోకానికి ప్రయాణం కట్టే పరిస్థితిలో వున్నాడు ఉగ్రసేన్.

ఉగ్రసేన్ మరణిస్తే డాక్యుమెంట్స్ ఎక్కడ వున్నాయో తెలిసే అవకాశంలేదు. అందుచేత—టార్చరింగ్ ఆపుచేశారు.'' ఆగి సిగరెట్ పీలుస్తూ నావేపు చూసింది మాయ.

''ఫ్లాష్! ఉగ్రసేన్ లాంటిసమర్థుడైన ఏజంట్ అమెరికన్ C.I.A.లో కాని, రష్యన్ K.G.B.లో కాని వుంటారని నేననుకోను. హీ ఈజ్ ఇన్‌కంపారబుల్! ఉగ్రసేన్-గాలిలో నాలుగు ప్రాణాలు కల్సిపోగా, మిగిలిన ఒక్క ప్రాణానికి ఊపిరినే ఆహారంగా పెట్టి-ఒకానొక రాత్రి విచిత్రంగా టార్చరింగ్ ఛాంబర్ నుండి తప్పించుకున్నాడు!!

పకిస్తాన్ సుప్రీమ్ ఏజంట్ చంఘీజ్ ఖాన్ తోక

త్రొక్కిన త్రాచు అయ్యాడు. దేశమంతా ఉగ్రసేన్ కోసం వలలు విసిరాడు.

అటు గూఢచారి శాఖా, ఇటు పోలీసు శాఖా, కేవలం ఒకే ఒక మనిషి — ఉగ్రసేన్ కోసం పిచ్చికుక్కల్లా తిరగ సాగారు. దేశంనుంచి వెళ్లే ప్రతి ఉత్తరం సెన్సార్ — అవసాగింది.

ఒక రాత్రి ఉగ్రసేన్ ఫోన్‌లో నన్ను కాంటాక్ట్ చేసాడు. నాకు ప్రాణం లేచివచ్చినట్లయింది.

అర్ధరాత్రి — అతను రహస్యంగా దాక్కుంటున్న ఈ ప్రాంతంలోని ఖలీఫా పహాడ్‌కి వచ్చాను.

ఉగ్రసేన్‌ని చూసి 'కెవ్వు'న అరిచాను. కొద్దిక్షణాలు నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. సేన్ గడ్డం పెరిగి, చిరిగిన బట్టల్తో పిచ్చివాడిలా వున్నాడు.

కండలు తిరిగిన అతని శరీరం చీపురు పుల్లలా తయారైంది... వంటి నిండా గాయాలు-గడ్డకట్టిన రక్తం-ఎర్రని కాల్చిన వాతలు... నా ఒళ్ళు జలదరించింది... ఎముకల గూడులాంటి అతని శరీరం తీవ్ర జ్వరంతో కాలిపోతోంది. డాక్టర్ దగ్గరికి వెళ్దాం అన్నాను.

'మాయా! అటువంటి ప్రయత్నాలేమీ చేయవద్దు. అది శత్రువులకు దొరికి పోవడానికి దగ్గర దారి. టార్చరింగ్ ఛాంబర్‌నుండి చిత్రహింసల పాలై పారిపోయిన నేను — డాక్టర్ దగ్గరకె వెళతానని సులువుగా ఊహిస్తాడు చంఘీజ్ ఖాన్. ప్రతి డాక్టర్ నన్ను పట్టుకొని బహుమతి గెల్చుకోడానికి ఎదురుచూస్తూ వుంటాడు. అందుచేత ఆ ప్రయత్నం చేయొద్దు. కేవలం యేజెంట్ ఫ్లాష్‌కోసం యెదురుచూడ్డమే నీ డ్యూటీ' అంటూ శాసించాడు ఉగ్రసేన్.

తర్వాత పాలు, పళ్ళు, కొన్ని టాబ్లెట్లు పట్టుకొని వెళ్ళాను. కాని ఉగ్రసేన్ స్పృహలో లేడు. నేనెంతో కంగారుపడ్డాను. ఎన్నిగంటలనుంచి అలా కోమాలో వున్నాడో నాకు తెలియదు. అరగంట ప్రయత్నంతో అతన్ని లేపి టాబ్లెట్స్ మింగించి పళ్ళు తినిపించాను. ఆరోజే అన్నాడు ఉగ్రసేన్." ఆగి బలంగా ఊపిరి విడిచింది మాయ.

"ఏమని?" అడిగాను సిగరెట్ పీక బయటకు విసిరి.

"ఇక నేను తన రహస్య స్థలాన్కి రావడాన్కి వీలు లేదని" చెప్పసాగింది మాయ. "నేను రాకపోకలు సాగిస్తూండగా ఏదోరోజు అనుమానం వచ్చి శత్రువులు నన్ను ఫాలో అయితే ఉగ్రసేన్ దొరికిపోయే ప్రమాదం వుంది. అదే అతని నిర్ణయాన్కి కారణం. ఉగ్రసేన్ పత్రాలు ఎక్కడ దాచాడో నాకుకూడా చెప్పలేదు. నన్ను శత్రువులు చిత్రహింసలు చేస్తే సులువుగా ఆ డాక్యుమెంట్స్ రహస్యాలు చెప్పేస్తాను. ఎందుకంటే నేను శిక్షణ పొందిన గూఢచారిణిని కాదు కాబట్టి. ఇదే ఉగ్రసేన్ ఆలోచన అయివుండాలి."

తల ఊపాను. ఏదో అడగబోయేంతలో "అదే ఖలీఫా పహాడ్" అంది వ్రేలితో పెద్ద మెట్టప్రాంతాన్ని చూపిస్తూ.

కొద్ది క్షణాల్లో ఉగ్రసేన్‌ను చూడబోతున్నానన్న తలంపు రాగానే నాలో ఎక్సైట్‌మెంట్ ప్రారంభమయింది.

రోడ్డు వారగా కారు ఆపి, పొదల్లోంచి ముందుకు నడిచాం. నా చేతిలోని మినీటార్చి దారి చూపుతోంది.

కొద్ది సేపట్లో మిట్టప్రాంతం వెనకభాగాన్ని చేరుకున్నాం.

సగం కూలిపోయిన ఓ పెంకుటిల్లు శిధిలావస్థలో కన బడుతోంది. ఓ గదిముందు యిద్దరం ఆగాం.

మాయ వానిటీ బాగ్‌లోంచి తాళంచెవి తీసి గది తాళం తెరుస్తుండగా ఓ ప్రశ్న అడిగాను.

"వెనకవైపు దారివుంది_ఉగ్రసేన్ స్థలం మార్చాలను కొంటే" అందామె.

కిర్రున తలుపులు తెర్చుకున్నాయి.

నిలబడిపోయాను! ఇద్దరం లోపలికి నడిచాం. అంతే! రాతిబొమ్మలా మనిబట్టిన - ఓ లాంతరు గుడ్డిగా వెలుగు తోంది ఆ గదిలో. ఒక స్టౌ, వో కూజా వో సిల్వర్ గ్లాసూ, ఒక దుప్పటి, సగం తిని వదిలేసిన కొన్ని యాపిల్ పళ్ళు-వాటి ప్రక్కగా నేలమీద విచిత్రమైన కోణంలో పడి వున్న అస్థిపంజరంలాంటి వో మానవాకారం......

నా గుండెల్ని ఎవరో పదునైన రంపంతో కోస్తున్న ట్లనిపించింది. కళ్ళు ఆర్ద్రమైనాయి.

భారతదేశ ప్రఖ్యాత గూఢచారి దిక్కులేని బిచ్చ గాడిలా వో శిధిల గృహంలో...

అప్పటిదాకా ఉగ్రసేన్‌ని పరీక్షించిన మాయ భయంగా కేకపెట్టింది ... "ఫ్లాష్! అతని హార్ట్ బీట్ దొరకడంలేదు" అందామె ఏడుస్తూ నిలబడిపోయి.

ఆమెను బలంగా లాగి, కర్కశంగా అన్నాను. "లుక్ మాయా! ఇది ఏడ్పులకు, ఓదార్పులకు హిస్టీరికల్ టిట్_బిట్స్‌కీ సమయంకాదు. వోపెన్ దోస్ బ్లడీ విండోస్ అండ్ లెట్ హిమ్ గెట్ సమ్ ఆక్సిజెన్_విల్ యూ?__ ఆ పని పూర్తయిన తర్వాత నువ్వు బైటకివెళ్ళి నిలబడు. నేను పిల్చేవరకూ రావనవసరంలేదు. యు అండర్‌స్టాండ్?"

ఏడ్పు అణుచుకుంటూ తల వూపిందామె. గది చివరికి వెళ్ళి కిటికీలు తెరిచింది.

చల్లని గాలి ఒక్కసారిగా గదిలోకి రివ్వున వీచింది— తర్వాత ఆమె ముందు తలుపు తోసుకొని బైటకి వెళ్ళి పోయింతర్వాత నేను ఉగ్రసేన్ మీదకి వంగాను.

అతని గుండెమీద నా చేతిని బలంగా నొక్కాను. హార్ట్ బీట్ తెలియడం లేదు...

ముక్కు దగ్గర వేలు పెట్టి-అలా వుండిపోయాను.

ఊపిరి...బలహీనంగా...

నా కళ్ళు మెరిసాయ్.

"సేన్! సేన్!" పిలవసాగాను అతన్ని బలంగా వూపుతూ.

ఎంత సేపటికీ జవాబులేదు...

అతని ఛాతీపై బలంగా అరచేతులతో రుద్దుతూ కూర్చున్నాను. తర్వాత అతని అరిచేతులు...అరికాళ్ళు...

నిర్విరామంగా పని చేయసాగాను.

గదినిండా గాలి నిండుకుని ఇప్పుడు హాయిగా వుంది.

దాదాపు పది నిముషాల తర్వాత నా ప్రయత్నం ఫలించింది.

"మ్మ్"...సన్నగా మూల్గింది ఉగ్రసేన్ ఆకారం...

నా ఆనందానికి అవధుల్లేవు...

"సేన్! సేన్!" అతని చెంపలు అటూ ఇటూ వాయించసాగాను, ఉక్కిరిబిక్కిరి అయ్యేట్టు. "కమాన్ మాన్! లుక్ అప్!"

"ఆఁ..." సేన్ బాధగా మూల్గాడు.

ఇంకా శరీరంలో చలనం లేదు.

నా ట్రీట్ మెంట్-కంటిన్యూ చేశాను.

అతని శరీరాన్ని పట్టుకొని అటూ ఇటూ బలంగా వూపేశాను. "సేన్! సేన్! లుక్ అప్ మాన్! నేను— ఫ్లామని!"...

ఉగ్రసేన్ ఊపిరి ఇప్పుడు బలంగా పీలుస్తున్నట్లు గ్రహించాను. నా ట్రీట్‌మెంట్‌కి తట్టుకోలేక సన్నగా మూల్గుతూ సేన్ బలహీనంగా కళ్ళు తెరిచాడు.

నాలో ఉత్సాహం ఉరకలు వేయసాగింది. "సేన్! నేను ఫ్లాష్‌ని వచ్చాను. సరిగా చూడు. యు ఆర్ ఆల్ రైట్! కమాన్ లుక్ ఎట్ మీ!"...

సేన్ కొద్దిగా తలతిప్పాడు.

గుంటల్లాంటి అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవై ఆనందం తొణికిసలాడ్డం గమనించాను.

"ఫ్లాష్! ని...జం—గా..." బలహీనంగా పల్కింది సేన్ కంఠం.

"నిజంగా నేను ఫ్లాష్‌నే! కమాన్ బ్రదర్ సరిగ్గా చూడు. మాయా నా కంతా చెప్పింది. యు ఆర్ సేఫ్. నా కేసి సరిగ్గా చూడు" దాదాపు అరిచాను.

ఆత్రంగా సేన్ తల వెనకాల చెయ్యిపట్టుకుని అతన్ని గోడవారగా కూర్చోబెట్టి-దీపం దగ్గరగా లాగాను.

వెలుగులో ఉగ్రసేన్ కళ్ళు సూటిగా నా ముఖంలోకి చూశాయి.

అతని కంటి రెప్పలు టపటపా కొట్టుకున్నాయి. మెల్లగా పెదవులు కదిలాయ్. "థాంక్ యూ ఫ్లాష్!" నూతిలోంచి వచ్చినట్టు వినబడ్డాయా మాటలు. అయినా అతని కంఠంలో తొణికిసలాడిన ఆప్యాయతను నేను గ్రహించకపోలేదు.

అతని చేయి వణుకుతూ గాల్లోకి లేచి—నా చేతిని అందు కొంది. "సేన్! నీకేం ఫర్వాలేదు. ఎలాగయినా సరే నీ ఆరోగ్యం బాగుచేయిస్తాను. మనిద్దరం యిండియా క్షేమంగా వెళ్తాం. మనల్నెవడూ ఆపలేడు. యు విల్ బి

ఆల్ రైట్ ...'' పెద్దస్వరంతో ఉగ్రసేన్ ని ప్రోత్సహిస్తున్నాను.

ఉగ్రసేన్ ముఖంలో నల్లటి మేఘాలు అకస్మాత్తుగా కమ్ముకున్నాయి. అతనికి బలంగా ఎక్కిళ్ళు రాసాగాయి.

"సేన్! వాటర్ కావాలా?'' అన్నాను ఆందోళనగా అతన్ని పట్టుకొని. బలంగా వస్తున్న వాంతి ఆపుకున్నట్లు వుక్కిరిబిక్కిరి అవుతూ తల అడ్డంగా వూపాడు సేన్. ఆసరాగా దొరికిన నాచేతిని బలంగా నొక్కిపట్టాడు.

బలంగా వెక్కుతూ విచిత్రంగా సైగ చేశాడు సేన్. వెంటనే నాచెవి అతని నోటి ఎదురుగా వుంచాను. "ఫ్లాష్ పత్రాలు ... జిన్నాబ్రిడ్జి క్రింద ... నాలుగో పిల్లర్ ... వె'' అంతే!

ఉగ్రసేన్ మెడ పట్టులేకుండా వెనక్కి వాలిపోయింది...

అతనిచేయి నా చేతిలోంచి జారిపోయింది.

నాలో రగిలే దుఃఖాన్ని పెదవుల వెనక బిగబట్టాను. నా కళ్ళనుండి రెండు వెచ్చని కన్నీటి చుక్కలు బుగ్గల మీదుగా జారాయి.

భారత గూఢచార సంస్థకు మేరుపర్వతంలాంటి మహా వ్యక్తి యిక లేడు...

నెరవేర్చవలసిన బాధ్యత అంతా యిప్పుడు నా ఒకని మీద పడింది...

"ఫ్లాష్! ఎవరిదో కారు రోడ్డుమీద ఆగింది!'' మాయ పిలుపుకు అదిరిపడి ఈ లోకంలోకి వచ్చాను. "యిద్దరు వ్యక్తులు మన కార్ ని పరీక్షిస్తున్నారు!''

ఆమె విసురుగా లోపలికివచ్చి ఉగ్రసేన్ శవాన్ని చూసి...ఆమె నోటిని చటుక్కున మూసాను. "మాయా!

శబ్దం చేయకు. ఉగ్రసేన్ని చూడాలనే ఆతృతలో కార్ని కనబడకుండా దాయడం మరచాను. నువ్వు ఈ గది వెనకాల దాక్కో. నేను వాళ్ళసంగతి తేల్చుకునివస్తాను" అన్నాను చేతిని తీసేస్తూ.

"ప్లాష్! వాళ్ళ దగ్గరకి నువ్వు ఒంటరిగా వెళ్ళొద్దు. వాళ్ళు కసాయివాళ్ళు" అంది నన్నడ్డగిస్తూ మాయా.

నవ్వి ఆమె భుజాన్ని తట్టాను. "వాళ్ళు కసాయి వాళ్ళయితే నేను వరల్డ్ కసాయివాళ్ళ సంఘానికి ప్రెసిడెంట్ని—నా దగ్గర పిస్తోలు వుంది కాబట్టి నేను ఒంటరివాడ్నికాదు. పైగా బ్రదర్ ఉగ్రసేన్ ఆత్మశాంతికి నేను కొన్ని పనులు చేయాలి. సో బీ ఎ నైస్ గర్ల్ అండ్ కీప్ క్వయిట్. విల్ యూ?"

తల ఊపిందామె. దీపం చేతిలోకి తీసుకుని 'ఉఫ్' మని ఆర్పేశాను.

చీకట్లో యిద్దరం బయటకు నడిచాం.

ఆమె ఎక్కడ వేచివుండాలో చెప్పి, ధైర్యంగా వుండమని భుజంతట్టి చీకట్లో గబగబా ముందుకు నడిచేను.

## 4

పొదలు, చెట్లు దాటుకుంటూ, ఒకరివెనుక వొకరు వాళ్ళు అడుగులో అడుగేసుకుంటూ శిధిలగృహం వైపు వస్తున్నారు.

వారిద్దరూ ఎవరోకాదు. ఎబ్బటోపీ, బోడిగుండు.

ఎబ్బటోపీ వ్యక్తి చేతిలో టార్చిలైట్ వుంది. అతను చేతివేళ్ళని టార్చికి అడ్డంగా పెట్టి అస్పష్టమైన కాంతిలో యిబ్బందిగా అడుగులు ముందుకు వేస్తున్నాడు.

వెనుక నడుస్తోన్న బోడిగుండువ్యక్తి చేతిలో పిస్తోలు ఆకారం స్పష్టంగా కనబడుతోంది.

పొదల్లోదాక్కుని ఎదురు చూస్తున్నాను.

ఓ గెరిల్లా ట్రిక్ నా బుర్రలో తళుక్కున మెరిసింది.

పన్నెండుగజాల దూరంలో వాళ్ళు నా వైపే వస్తూ వస్తున్నారు.

"ఎంతదూరం యింకా?" బోడిగుండు గొంతుకుడు సన్నగా వినబడింది.

"గట్టిగా మాట్లాడక. కొద్దిదూరంలో శిధిలమయిన కొంప ఒకటుండాలి. కొత్తగా వచ్చిన ఫ్లాష్‌గాడుమిగతా యిద్దరు అక్కడ వుండొచ్చు" అన్నాడు ఎల్లటోపీ.

వారిద్దరూ - చీకట్లో ముగ్గుర్ని ఎదుర్కోడానికి భయపడుతున్నట్లు గ్రహించాను.

వాళ్ళు 'నాలుగు గజాల' దూరంలోకి రాగానే నేను రెడీ అయ్యాను.

"చే..." దెయ్యంలా భీకరంగా అరుస్తూ__పొదల మధ్యనుండి ఎలుగుబంటిలా లేచి వారిముందుకు దూకాను.

"బా...బో...య్..." హడలిపోయి పొలికేక పెట్టాడు ఎల్లటోపీ, తూలి వెనక్కిపడుతూ. అతని చేతిలోని టార్చి జారిపడి నేలకు కొట్టుకుంది.

నేనాలశ్యం చేయలేదు.

పెద్దగా కరాటే షాట్ చేస్తూ గొడ్డలిలా బిగుసుకు పోయిన నా కుడికాలిని - బోడిగుండు మోచేతికి పిడుగులా తాకించాను.

అంతే!

బోడిగుండు చేతిలోని పిస్తోలు, ఆకాశంలోకి పిచ్చికలా యెగిరింది.

అతను వంగి మోచేతిని పట్టుకుంటూ బాధగా అరిచాడు.

మూడో ఎస్సాల్ట్ కూడా ఆలశ్యం కాలేదు.

పైనున్న చెట్టుకొమ్మను ఎగిరి అందుకుని బూటుకాళ్లతో యిద్దరిముఖాల్ని ఫెడీమని తన్నాను.

"అల్లా!" వికృతంగా అరిచారిద్దరూ ముఖాల్ని చేతుల్తో కప్పుకొని.

"అల్లా అంత త్వరగా కనబడడ్డూ కుత్తేకి బచ్చే!" పళ్ళు పటపట కొరుకుతూ అరచేతులు బిగించి వారిముఖాల మీద బాదాను.

ఇద్దరి ముక్కుల్లోంచి రక్తం బుసబుస పొంగి నా చేతులకి జిగటగా తగిలింది.

"బాప్రే!" అంటూ యిద్దరూ బట్టలమూటల్లా వెనక్కి పడ్డారు.

గడిలోని ఆ స్త్రీపంజరంలాంటి ఉగ్రసేన్ శవం జ్ఞాపకమొచ్చి నా రక్తం ఉడికిపోయింది. ఇద్దర్నీ పైకిలేవదీసి ఎర్రటోపీగాడి ఎడంచేయీ, బోడిగుండుగాడి కుడి చేయీ అందుకొని బలంగా వెనక్కి విరిచాను.

దశదిశలు దద్దరిల్లేలా అరిచారిద్దరూ.

ఎముకలు కరకర విరిగిన చప్పుడు...అంతే! స్పృహ తప్పి యిద్దరూ తోటకూర కాడల్లా నేలమీదకి జారి పోయారు.

అయిదు నిమిషాల్లో యిద్దరి శరీరాల్ని, నేను వచ్చిన జాగ్వార్ కార్లోకి ట్రాన్స్ఫర్ చేశాను.(ఆ కారు నంబర్ ప్రత్యర్థులకి గుర్తే కాబట్టి యికదాని వుపయోగంలేదు.)

జేబులోంచి డైరీతీసి ఒకపేజీలో ఇలా రాయసాగేను.

"మిస్టర్ చంఘీజ్ ఖాన్!

చిత్రహింసలు పెట్టడంలో నువ్వొక్కడివే గొప్పవాడివి కావు. ఇక్కడ శాంపిల్స్ చూడు!

ఖాన్!

ఫ్లాష్ పగబట్టాడు!

ఎదురొచ్చిన వాడ్ని కొదమసింగంలా చీల్చి చెండాడు తాడు! రెచ్చగొడితే పకిస్తాన్ని అల్లకల్లోలం చేస్తాడు!!

పాపం!

వీళ్ళిద్దరిచేతులు రిపేర్‌కి పనికిరాకుండా విరిచేశాను.

జీవితాంతం అంగవైకల్యంతో "నిన్ను" తిట్టుకుంటూ గడుపుతారు.

—విష్ యూ డెవిల్ డ్రీమ్స్. —"ఫ్లాష్."

ఆ పేజీ డైరీనుండి చింపి యెర్రటోపీగాడి చొక్కా జేబులో కనబడేలా పెట్టాను. మాయా నేను మరో అర గంట శ్రమించి ఉగ్రసేన్ మృతదేహాన్ని భూస్థాపితము చేశాము.

## .5

రాత్రి...

మూడున్నర గంటలయింది...

దూహానది కడ్డంగా నిర్మించబడ్డ పెద్దవంతెన - జిన్నా బ్రిడ్జి!

ఆ ప్రదేశమంతా నిర్మానుష్యంగా వుంది.

వంతెన కటూయిటూ వున్న ప్లాట్ ఫారాల మీద అక్కడక్కడ ముసుగుతన్ని పడుకొన్నారు బిచ్చగాళ్ళు.

నది ఒడ్డునే నిలబడి, నదిలో బ్రిడ్జికి ఆధారంగా నిర్మించబడ్డ స్థంభాలు లెక్కపెట్టాను. సరిగ్గా అయిదు కాంక్రీట్ పిల్లర్స్ వున్నాయి.

నాకో సందేహం వచ్చింది.

ఉగ్రసేన్ నాలుగో పిల్లర్ మీద ఆ రహస్య పత్రాలు దాచానని చెప్పాడు.

ఇట్నుంచి నాలుగోదా?

అట్నుంచి నాలుగోదా?

తర్కం ఆలోచించాను.

బ్రిడ్జి అవతల ఘజియాబాద్ అనే ఓచిన్న ఊరుంది. ఇటువైపు జిస్లామాబాద్ సిటీ. కాబట్టి నాకావల్సింది ఇట్నుంచి నాలుగో స్థంభమై వుండాలి!

చకచకా బ్రిడ్జిమీదకి నడిచాను.

వంతెనమీదవున్న పది ఫ్లోరోసెంట్ దీపాల్లో మూడు మాత్రమే ప్రకాశవంతంగా వెలుగుతున్నాయ్.

రైలింగ్ ప్రక్కగా నడుస్తూ నాకావాల్సినస్పాట్ దగ్గర ఆగాను.

ఓసారి అటూయిటూ చూసి జర్కిన్ జిప్పర్ క్రిందకి లాగి, లోపల్నుంచి అయిదుగజాల నైలాన్ రోప్ తీసాను. అంతకుముందే తాడు పొడవునా ముళ్ళువేసి వుంచాను దానికి, జారిపోవడానికి వీల్లేకుండా.

తాడు ఒకవైపు రైలింగ్ గోట్టానికి బలంగా ముడి వేసి బిగించాను. ముడి జారితే యమునానదిలో పడతాను.

ముడిని పరీక్షించి బలంగా లాగిచూశాను.

ఇట్సాల్ రైట్!

రైలింగ్ ఎక్కి తాడుపట్టుకొని అవతలివైపుకి జాగ్రత్తగా దిగాను.

తాడుపై వేలాడుతూ, చివరకంటా జారాను.

ఎడంచేతో తాడుని గట్టిగా బంధించి, కుడిచేతో టార్చిలైట్ అందుకొని, చేయి ముందుకు సాచి స్విచ్ ఆన్ చేసాను.

కాంతి-బ్రిడ్జి అడుగుభాగంలో కాంక్రీట్ స్థంభం మీదపడి అటూయిటూ కదిలింది.

నాగుండె గొంతుకలో కొట్టుకోసాగింది.

ఎదురుగా...

వాటర్ ప్రూఫ్ ఆయిల్ స్కిన్ పేపర్లో చుట్టబెట్టబడి వున్న పాకెట్!

పకిస్తాన్ గూఢచార్ల అహర్నిశలూ వేటాడిన వస్తువు అది!

భారతదేశ భవిష్యత్తు, ఆధారపడిన కాగితాలు అవి!

రెండు దేశాల పైశాచిక కుట్రకు సాక్ష్యం ఆ పాకెట్.

చేతికి అందేంత దగ్గరలో లేదది. పాకెట్ ఉన్న స్పాట్ జ్ఞాపకముంచుకుని టార్చిలైటు జేబులో పెట్టేశాను. తాడుకు వేలాడుతూ మెల్లగా కదిలాను.

కాళ్ళు అటూయిటూ వూపాను.

ఇప్పుడు తేలిగ్గా అటూయిటూ వూగసాగాను.

అప్పుడే దూరంగా ఎక్కడో జీపుశబ్దం వినబడింది.

నాకు ముచ్చెమటలు పోస్తున్నాయి.

తాడుకు వేలాడుతుండడంవల్ల భుజాలు నొప్పిపుడుతున్నాయి

రెలింగ్ మీద తాడు బయటివాళ్ళకి కనబడే అవకాశం వుంది!

చివరి ప్రయత్నం...

రివ్వున వెనక్కి ఊగాను.

ముందుకు వెళుతూ, చేయిచాచడం, డేగలా పాకెట్ నందుకోడం, తిరిగి వెనక్కి ఊగడం అన్నీ వరుసగా జరిగాయి.

ఎడంచేత్తో పాకెట్ని పరీక్షించాను.

'టాప్ సీక్రెట్' అన్న ఎర్రటి అక్షరాలు కొట్టొచ్చినట్లు కనబడ్డాయి.

అంతే!

నా చెవులు చటుక్కున నిక్కబొడుచుకున్నాయి.

జీపు కీచుగా అరుస్తూ రెయిలింగ్ ప్రక్కగా ఆగిన శబ్దం.

"శాస్! ఎక్కడో తాడు వేసుకొని అవతలివైపు దిగేరు" అన్న కంఠం...

నాగుండె దడదడ లాడుతోంది.

ఎడికే చేతితో పాంటు పైకెత్తి మోకాలికింద అమర్చిన రబ్బరు బాండ్ లోకి పాకెట్ ని చటుక్కున తోసి, పాంటు తిరిగి సర్దేశాను.

వంతెనమీద దడదడా బూట్లచప్పుడు.

నన్ను గుడ్డివాడ్ని చేస్తూ నాలుగు పవర్ ఫుల్ టార్చి లైట్ల వెలుగు ఒక్కసారిగా నా ముఖంమీద పడింది.

రెండు ఆకారాలు మెరుపులా వంతెనమీంచి, నీటిలోకి దుబ్బున దూకాయి.

"ఆల్ రైట్ ఫ్రాంక్! నదిలోకి దూకే పిచ్చిప్రయత్నం చేయకు. నీకోసమే అడ్వాన్సుగా నా మనుషులు నదిలోకి దూకారు. కమాన్ జాగ్రత్తగా పైకి వచ్చి – చంఘీజ్ ఖాన్ ని కల్సుకో" పాము బుసలా వినబడ్డాయీ మాటలు.

నా అరిచేతులు చమటపట్టి జారుతున్నాయి.

పకిస్తాన్ స్పెషల్ గూఢచారి చంఘీజ్ ఖాన్ నా కెదురుపడ్డందుకు ఒకందుకు భయం, ఉగ్రసేన్ ని చిత్రహింసలపాలేజేసి, మరణకారకుడైనందుకు ఆవేశం ఒక్కసారిగా నాకు కలిగాయి.

"చంఘీజ్ ఖాన్! టార్చిలైట్ల విషయంలో పకిస్తాన్ ప్రగతిని సాధించింది. స్విచ్ ఆఫ్ దోస్ గాడ్డామ్ లైట్స్! నేను పైకి వస్తున్నాను!" అరిచాను.

"గుడ్ బాయ్!" అన్నాడు ఖాన్.

మూడు లైట్లూ ఆరిపోయాయి,

# 6

ప్లాట్ ఫాంమీద నిలబడి చంఘీజ్ ఖాన్ వైపు చూడ సాగాను

అతని ఫోటోలు ఇంతకుముందు ఇండియన్ మిలిటరీ ఇంటలిజెన్స్ ఫైల్స్‌లో చూసాను.

ఎర్రగా, బలిష్ఠంగా ఆరడుగుల ఎత్తులో వున్నాడు చంఘీజ్ ఖాన్. నల్లటిగడ్డం, బుగ్గమీద పులిపిరికాయ, ఎర్రటి నెక్ బనియన్-వీధి రౌడీలా వున్నాడతను. వయస్సు ముప్ఫయి దాటివుంటుంది.

అతని చేతిలో పిస్తోలు పాము పిల్లలా మెరుస్తోంది.

"వెల్ మిస్టర్ ఫ్లాష్!" నవ్వుతూ అన్నాడు చంఘీజ్ ఖాన్ "ప్రత్యర్థులను చీల్చి చెండాడవల్సిన "సింహం" బోనులో చిక్కింది."

"వెరీ గుడ్! నేను పంపిన శాంపిల్స్ చూసావన్న మాట."

నవ్వుతూ తల వూపాడు చంఘీజ్ ఖాన్ "అవును—కంట్రోకితం చూసాను. వాళ్ళిద్దర్నీ సగం సగం చంపే శావ్!"

"చెప్పానుగా—అది శాంపిల్ మాత్రమే" అంటూ చటుక్కున కుడిచేతిని పాంటు జేబులోనికి పోనిచ్చాను.

చంఘీజ్ ఖాన్, అతని ముగ్గురు అనుచరులూ మెరుపులా నామీద పడ్డారు.

"ఫ్లాష్! నో-ట్రిక్స్!" అర్చాడు ఖాన్ పిస్తోల్ మొన మెడలోకి నొక్కుతూ.

జేబులోంచి సిగరెట్ పాకెట్, అగ్గిపెట్టె తీసాను.

"ఫూల్స్‌బ్రిగేడ్" అన్నాను సిగరెట్ పొగవదుల్తూ.

లావాలా పొంగే కోపాన్ని అణగద్రొక్కుతుంటూ నావేపు చూశాడు చంఘీజ్ ఖాన్.

"ఫ్లాష్! అమాయకంగా పకిస్తాన్‌లో అడుగు పెట్టావ్. కాని ఈ దేశాన్ని దాటిపోడం నీతరం కాదు. ఉగ్రసేన్‌కి పట్టిన గతే నీకూ పడుతుంది. అతని శవాన్ని పాపం నువ్వే సమాధికట్టావ్. కాని ఈసారి నీ శవాన్ని సమాధి చెయ్యడాన్కి మరో భారతీయుడు వుండడు. ఇప్పుడు బుద్ధిమంతుడిలా ఆ కాగితాలు పైకితీసి, నా చేతికివ్వు."

"ఏ కాగితాలు?" అన్నాను అమాయకంగా.

"రా... కా!" అర్చాడు ఖాన్.

అంతే! రాకా అనబడే ఓ రాక్షసాకారుడు పర్వతంలా నామీద పడ్డాడు. అతని పిడికిలి_బలంగా నా కడుపుని తాకింది.

రబ్బరుబొమ్మలా తూలి వెనక్కి పడ్డాను.

కడుపులో ప్రేగులు కదిలినట్లనిపించింది.

"ఆల్ రైట్! ఇస్తాను. ఆగండి" బాధగా అరిచాను.

రాకా విజయగర్వంలో పళ్ళికిలించి వెనక్కి తగ్గాడు,

"కమాన్ ఫ్లాష్!" అసహనంగా అన్నాడు ఖాన్.

తూలుతూ లేచి నిలబడి, జర్కిన్ జిప్పర్ సగం కిందకి లాగి, లోపల్నుంచి వో ఆకుపచ్చ పాకెట్ ప్రొడ్యూస్ చేసాను.

"ఖాన్! నువ్వే గెల్చావ్" అన్నాను పాకెట్ అందిస్తూ.

"రాకా! ఆ పాకెట్ అందుకో!" ఆదేశించాడు ఖాన్. నావైపే సూటిగా చూస్తూ. అతని పిస్తోలు చేయి తొణకడం లేదు.

రాకా _ పాకెట్ అందుకొని వో పెన్ చేసాడు.

మరుక్షణం అతని ముఖం మాడిపోయింది.

"బాస్! మోసం! ఇవి చిత్తుకాగితాలు" అర్చాడు ఆటవికుడిలా,

చంఘీజ్ ఖాన్ కాలయముడిలా నాకేసి చూసాడు. అతని కళ్ళు అగ్నిగోళాల్లా మండుతున్నాయి. "అయామ్ సారీ ఫ్లాష్! నా సహనం నశించింది. ఇప్పుడు నీ శరీరంలోని ఒకో అవయవంలోకి ఒక్కో తూటా ప్రవేశిస్తుంది! చంఘీజ్ ఖాన్ చిత్ర హింసలకు నువ్వు గురికాబోతున్నావ్!" పళ్ళు పటపట కొరుకుతూ పిస్తోలు నాకేసి సూటిగా గురిపెట్టాడు ఖాన్. బొటనవ్రేలితో సేఫ్టీ కాచ్ ని రిలీజ్ చేసాడు.

మరుక్షణం అతని చూపుడువ్రేలు టిగ్గర్ గార్డ్లో బిగుసుకుంది.

"ఢాం!"

అంతే!—

చంఘీజ్ ఖాన్ చేతిలో పిస్తోలు రివ్వున ఎగిరి రూహీ నదిలో పడింది...

"ఎవ్వరూ కదలకండి. ఒక్క అడుగు ముందుకువేస్తే బుర్రలు కొబ్బరి పుచ్చెల్లా ఎగుర్తాయ్" అన్నమాటలు కటువుగా వినబడ్డాయ్.

మాయా-ప్రొఫెషనల్ కిల్లర్ లా నిలబడి వుంది. ఆమె చేతిలోని పిస్తోలునుండి ఇంకా పొగ వస్తోంది.

చంఘీజ్ ఖాన్ ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు.

"సైతాన్! ఎక్కడ్నుంచి వూడిపడ్డావ్?" అన్నాడతను బాధగా రక్తం కారుతున్న చేతిని పట్టుకొని.

పిస్తోలు శబ్దానికి బ్రిడ్జిమీద పడుకున్న బిచ్చగాళ్ళు, బిచ్చకత్తెలు అదిరిపడి లేచి, విషయం గ్రహించి ప్రాణభయంతో పిట్టల్లా చెల్లాచెదురయ్యారు.

"నేనెక్కడ్నుంచో వూడిపడ్లేదు. ఇక్కడే వున్నాను.

ఇప్పటిదాకా ఆ బిచ్చుకత్తెల మధ్య దుప్పటి కప్పుకొని పడుకోలేక చచ్చాను" అంది నవ్వుతూ మాయా.

"మాయా! యూ ఆర్ వండర్‌ఫుల్ షూటర్! ఫైరింగ్ నీ దగ్గర నేర్చుకోవాలి" అన్నాను మెచ్చుకోలుగా.

"ఉగ్రసేన్స్ ట్రైనింగ్" అంటూ ఆమె నవ్వింది.

అకస్మాత్తుగా ఆమె కంఠం కరుగ్గా మారింది. "ఫ్లాష్! చంఘీజ్‌ఖాన్‌నీ, అతని గుండాలను ఇక్కడే కాల్చిచంపి మన అడ్డు తొలగించుకుందాం. ఒక్కొక్కడికి ఒక్కొక్క బుల్లెట్ చాలు. వాడ్డు యు సే?"

ఆమె కంఠంలో మార్పును గ్రహించి ప్రాణభయంతో చిందులేశాడు చంఘీజ్‌ఖాన్ "నో, డోంట్ కిల్ మీ... ఫ్లాష్! ఆమెను ఆపు చెయ్యి."

అప్పుడే చచ్చిపోయినట్లు వూహించుకుంటున్న ఖాన్ ముఖంలో ఆందోళనని గుర్తించి నవ్వుకొన్నాను.

"ఖాన్! నిద్రపోతున్న మనిషినీ - నిరాయుధుడైన వ్యక్తినీ నేనెప్పుడూ చంపలేదు. ఈసారికి నువ్వు బతికిపోతున్నావ్. అలాగన్నానని పిచ్చివేషాలు వేయడానికి ప్రయత్నించక. జీవితాంతం నడవలేవు."

మరో పది నిముషాల్లో — వంతెన ప్రక్కగావున్న ఆర్ అండ్ బి డిపార్ట్‌మెంటు స్టోర్‌రూమ్‌లో నలుగుర్నీ నైలాన్ తాడుతో బంధించి పడేశాం.

బయట గెడ పెట్టి నిట్టూర్పు విడిచాను.

బాగా అలసిపోయాం ఇద్దరం.

నిద్రలేమిచేత నా కళ్ళు మండుతున్నాయి.

అయినా ఆలస్యం చేయడానికి వీల్లేదు.

శరీరంమీద దేశరక్షణకు సంబంధించిన అతి ముఖ్య పత్రాలు వున్నవాడెవడూ ఆలస్యం చేయలేడు.

నేనిక భారతదేశం వెళ్ళాలి.

మాయా జీపుని డ్రైవ్ చేస్తోంది.

ఆమె చేతిలో జీపు 'కంగారూ' జంతువులా పరిగెడుతోంది.

"ఫ్లాష్!" పిల్చిందామె

"ఎస్ ట్రిగ్గర్ హాపీ వుమన్!" అన్నాను జేబులోంచి సిగరెట్ పాకెట్ అగ్గిపెట్టె తీస్తూ.

"చంఘీజ్ ఖాన్‌ని నువ్వు కాల్చి వుండవల్సింది."

సిగరెట్ ముట్టించి, పొగ వదుల్తూ ఆమెకేసి చూసి నవ్వాను. "సిల్లీ గర్ల్! చంఘీజ్ ఖాన్‌ని చంపినంత మాత్రాన నేను ఇండియా వెళ్ళడం సులభతరం అయిపోదు. ఎందుకంటే పకిస్తాన్ గూఢచారి శాఖ అంటే ఒకే వ్యక్తి కాదు కాబట్టి. చంఘీజ్ ఖాన్ పోతే మరో వందమంది ఆగాఖాన్‌లు సంతకాలు చేసి డ్యూటీలో కొస్తారు. ఫ్లాష్‌గాడుపోతే మరో వందమంది టార్చిలైట్లు, గాళ్ళ స్విచ్‌లు ఆన్ చేసి ఇండియానుండి బయలుదేర్తారు."

నవ్వుతూ నావేపు చూసింది మాయా.

"ఇండియా వెళ్ళేది నువ్వొకడివే కాదు మిస్టర్. నేను కూడ."

"నీ ఖర్మ! చేరుకోలేని ప్రదేశానికి ఎంతమంది బయలుదేరితే నేం?"

గలగలా నవ్వింది మాయా.

"మాయా! మనం విమానంలోగాని, షిప్‌లోకాని యిండియా వెళ్ళే అవకాశంలేదు. ఉగ్రసేన్ చేతిలో ఆ కాగితాలు పడ్డదగ్గర్నుంచీ ఆ రెండుమార్గాలు ప్రత్యేకమైన పర్యవేక్షణలో వుండివుంటాయి. పోతే మనకు ఒక టేదారి, సరిహద్దులదాకా ఎలాగో వెళ్ళి, తెలివిగా జమ్ము-కాశ్మీర్‌లో ప్రవేశించాలి."

మాయ కంగారుగా చూసింది. "ఈజ్ ఇట్ పాసిబుల్?"

"షుడ్ బి పాసిబుల్. పకిస్తాన్ నుండి అప్పుడప్పుడు సివిలియన్స్ కూడా కాశ్మీర్‌లోకి రహస్యంగా ప్రవేశించేవారు. అది పరిశోధించడానికి వెళ్ళినప్పుడు ఆ ఏరియా గురించి బాగా తెలుసుకున్నాను" అంటూ ఆగి చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చి అడిగాను. "మాయా! రుహానది గురించి నీకేం తెల్సు?"

"రూహానది మియాన్ వాలీ అనే ప్రాంతంవద్ద అంత మౌతుంది. కాని అక్కడ్నుంచి ఓ పాయ జీలం నదిలో కలుస్తుంది. జీలం రావల్పిండి పట్టణంలో ప్రవహిస్తోంది"

"ఇక చెప్పకు! రావిల్పిండి బోర్డర్స్ దాటగలిగితే జమ్మూ-కాశ్మీర్ కాపిటల్ శ్రీనగర్ చేరుకుంటాం. సాధారణమైన మెషిన్ బోటులో ప్రయాణిస్తే రావల్పిండి చేరడానికి ఎన్నిరోజులు పట్టవచ్చు?"

"పగలూ, రాత్రీ ప్రయాణం చేస్తే మూడురోజుల్లో చేరుకుంటాం - మధ్యలో శత్రువులు కాల్చేయకపోతే."

నవ్వాను. "నో అదర్ చాయిస్. ఇక ఇప్పుడు అర్జంటుగా మనకు కావాల్సినవి—ఓ పకిస్తాను మాపు, కండెన్స్‌డ్ మిల్క్, రొట్టెలు, బిస్కట్లు, విస్కీ, సిగరెట్లు యితర ఆహార పదార్థాలు, ఒక బోటు."

"చివరిది తప్ప మిగతావన్నీ దారిలో నే దొరుకుతాయి రౌండ్ ది క్లాక్ షాపుల్లో. కాని బోటు ఎలా?"

నవ్వి చెప్పాను.

"దొంగిలిస్తాం."

# 8

దొంగిలించిన బోటులో అప్పటికే దాదాపు ఏనిమిది గంటలు ప్రయాణించి నాలుగైదు వూళ్ళు దాటాం.

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

రెండురోజుల ప్రయాణానికి సరిపడే డీశెల్ ఆయిల్ స్టాకు వుంది. నిశ్చలమైన యూహో నదిలో నీటిని ఛేదిస్తూ షార్కు చేపలా ముందుకు దూసుకుపోతోంది బోటు.

గతరాత్రి నిద్రలేకపోడంవల్లా, నిర్విరామంగా ఎనిమిది గంటలపాటు బోటు డ్రైవ్ చేయడంవల్ల — నా ఒళ్ళు హూనమయిపోయింది.

కొద్ది గంటల నిద్రపోకపోతే ఇక మర్నాడు పనిచేయ లేనని అర్థమైపోయింది.

మధ్యాహ్నంపూటా, మూడోజాము నిద్రలో మునిగి పోయిన మాయాను, కేబిన్ నుండి పెద్ద కేకలు వేసి నిద్ర లేపాను.

ఆమె లంచ్ పూర్తయిన తర్వాత, డ్రైవింగ్ లో కొన్ని సూచనలిచ్చి చక్రాన్ని తిప్పే బాధ్యత పూర్తిగా ఆమెకి అప్పగించాను. రేషన్ బాగ్ లోంచి ఓ అరడజను మటన్ శాండ్ విచెస్ లాగించి, పీకలదాకా మందు బిగించి, డెక్ మీద నడుంవాల్చి కుంభకర్ణుడిలా కాళ్ళు జాపుతుండగా నిద్రాదేవి తటాలున కౌగలించుకొంది. అలా ఎంతసేపు నిద్రపోయానో నాకే తెలియదు.

ఎవరో తట్టి లేపుతున్నట్లయి విసుగ్గా మూల్గుతూ ప్రక్కకు దొర్లాను.

"ష్లాష్! పైకిలే!" నన్ను వూపేస్తున్నది మాయా అని గ్రహించాను.

చలిగాలి అదరగొడుతోంది.

పదుపనే కళ్ళు సగం తెరిచి వాచీకేసి చూశాను. అంతా చీకటి. రేడియండయల్ ఎనిమిదోగంట సూచి స్తోంది.

"...ఫర్ గాడ్ సేక్!" చిరాగ్గా గొణిగాను కాళ్ళు మడిచి పెట్టుకుని కళ్ళు మూసుకుంటూ "మరో గంట సేపు నన్ను వదిలెయ్ లిల్లీ. ఒళ్ళు హూనమై..."

నా చెంప ఛెళ్ళుమంది.

అంతే! అదిరిపడ్డాను, మౌనంగా మాయ చూపిస్తున్న వేపు చూసి.

ఫర్లాంగు దూరంలో ఓ పెద్ద లాంచి వురకలు పరుగులతో మా వైపే వస్తోంది...

లాంచి పైభాగంలో రెండు ఫ్లడ్ లైట్లు బిగించబడ్డాయ్.

డెక్ మీద లైట్ల ప్రక్కగా చంఘీజ్ ఖాన్, మరి కొందరి పోలీసు ఆకారాలు అస్పష్టంగా కనబడ్డాయ్.

కొద్ది క్షణాల్లో ఆ లైటింగ్ మా బోట్ మీద పడబోతోంది.

"మాయా! మన బోట్ లైట్లు ఆర్పేయ్! డైరక్షన్ మార్చి స్పీడ్ పెంచు. యు అండర్ స్టాండ్?"

"బట్...షాష్! చీకట్లో లైట్లు లేకుండా..."

"డామిట్! దేన్నీ గుద్దినా పర్వాలేదు. నేను చెప్పింది చెయ్యి" మాయ కాబిన్ లోకి పరిగెడుతుండగా మెషిన్ గన్ ఫైరింగ్ వినబడింది.

జిజ్ జ్...జ్...జ్ ..జ్...జ్...జ్ జ్...

దభాలున బోర్లాపడి మోచేతులతో తల కప్పుకున్నాను.

జ్...జ్...జ్...జ్...

బులెట్లు నా తలమీంచి పరిగెడుతున్నాయి.

భళ్ళున కాబిన్ అద్దం పగిలింది.

తూటాలు ఇనపవస్తువులకి తగిలి కయ్...కయ్...మన్న శబ్దం చేస్తున్నాయ్.

మరికొన్ని గుళ్ళు "స్సక్" ... మన్న ధ్వనితో బాటు చెక్కలలో దిగబడ్తున్నాయి.

చటుక్కున బోటు లైట్లు ఆరిపోడం, రయ్యిన వేగం పుంజుకుంటూ దిశ మారటం గమనించి విశ్రాంతిగా వూపిరి వదిలాను.

ఇప్పుడు మా బోటు ఫ్లష్ లైట్స్ పరిధికి దూరంగా ప్రయాణిస్తోంది. కాని బోటు ఇంజన్ "శబ్దం" చేసినంత వరకూ ప్రమాదం తప్పనట్లే.

ఇంజన్ ఆపేస్తే సెర్చిలైట్ల వెల్తురులో పడి - దిక్కు లేని చావు చావాలి.

మెషిన్ గన్ మోత మళ్ళీ గుడ్డిగా మ్రోగసాగింది.

బుల్లెట్స్ దూరంగా నీళ్ళలో పడుతున్నాయి.

"ప్రక్కకు తప్పకో మాయా! తలదించి కూచో!" ఆమెకు ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి బోటును గుడ్డిగా ముందుకు పరిగెట్టించసాగాను.

"మాయా! మనం ఏ ప్రాంతంలో వున్నామో తెల్సా?"

"తెలీదు. చీకట్లో చెప్పలేను."

"పోనీ ఎటువైపు ఒడ్డుదగ్గరో చెప్పగలవా?"

"కుడివైపు"

బోటును కుడివైపు మళ్ళించాను.

గుడ్డెద్దు చేలో పడినట్టుగా, కటిక చీకట్లో బోటు రూపానదికి అడ్డంగా పరిగెడ్తోంది.

"మాయా! మనం తిన్నగా తీరాన్ని గుద్దుకోబో తున్నాం. అందుకు రెడీగా వుండు. లేవన్ బాగ్ తీసు కోడం మర్చిపోకు"

మాయ లేవన్ బాగ్ లోపలికి తీసుకువచ్చి కాబిన్‌లో కూర్చుంది.

శత్రువుల లాంచీ కనుచూపు మేరలో కనబడుతోంది.

మరో నలభై సెకన్లలో మా బోటు బలంగా యిసుక తీరాన్ని గుద్దింది.

ఇద్దరం బయటకి దూకి - పరిగుత్తసాగాం.

# 9

మేం ఒక పల్లెటూళ్ళో ప్రవేశించినట్లు గ్రహించాను. మాయా, నేను చీకట్లో ముందుకు నడుస్తున్నాం.

ఒడ్డున వున్న బోటునుబట్టి చంఘీజ్ ఖాన్ మేమీ పల్లెటూళ్ళో ప్రవేశించినట్టు తెల్సుకొని వేట ప్రారంభిస్తాడు.

ఏది ఏమైనా... చీకట్లో ఏ దిక్కులో ప్రయాణించాలో తెలియడం కష్టం. ఈ రాత్రికి ఏదో సురక్షిత ప్రదేశంలో గడిపి-ఉదయాన్నే దారి వెదుక్కోడం మంచిదనిపించింది.

కొంతదూరం నడిచేటప్పటికి ఎదురుగా ఓ విశాలమైన పెద్ద కూరగాయల తోట కనబడింది.

చుట్టూ వెదురుకంచె.

చెక్కల గేటు మూయబడి వుంది.

తోట మధ్యగా ఓ పాతబడిన మేడ వుంది.

"మాయా! ఈ రాత్రికి ఇక్కడ విశ్రాంతి తీసుకుందాం" అన్నాను మేడప్రక్కగా వున్న పెద్ద గడ్డివాము వేపు చేత్తో చూపిస్తూ.

తల వూపింది మాయా.

ఇద్దరం చెక్క గేటుమీంచి అవతలకి దూకి పరిగెట్టసాగాం. గడ్డివామును చేరుకోబోతుండగా వినిపించింది భయంకరంగా శబ్దం...

"భౌ...భౌ"...అంటూ.

“ష్లాష్! తోటలో కుక్క వుంది. పారిపోదాం” అంది భయంగా మాయ నా చేతిని పట్టుకొని ఆపేస్తూ.

“డోంట్ వర్రీ! కుక్కల సైకాలజీ నాకు తెలుసు. అది మనల్నేమీ చేయదు” అన్నాను మాయను ముందుకు లాగుతూ.

“భౌ భౌ...” కుక్క మొరుగు దగ్గరైంది.
ఇద్దరం గడ్డివాము వెనక దాక్కున్నాం.
తెల్లటి బొచ్చుకుక్క మొరుగుతూ మా వేపు వచ్చేసింది.
మాయ ప్రాణాలు బిగపట్టుకొని దానివేపు చూస్తోంది.
“మాట్లాడక” అన్నాను రహస్యంగా.
ఇద్దరం రాతి విగ్రహాల్లా కూర్చుండిపోయాం.
కుక్క అరడుగుల దూరంలో నిలబడి మొరగసాగింది.
విచిత్రంగా నోటితో ఈల వేసాను.
అంతే! కుక్క-మొరగడం ఆపి చెవులు రిక్కించింది.
మళ్ళీ నోటితో ఈల వేశాను, చేత్తో సైగ చేస్తూ.
కుక్క తోకాడిస్తూ నావైపు వచ్చింది.

దాని మెడ నిమురుతూ నా దగ్గరున్న బాగ్ లోంచి రెండు బిస్కెట్లుతీసి దాని నోటికందించాను.

మేడలో తటాలున లైట్లు వెలిగాయి. ఓరగా అటు వేపు చూసాను.

ఓ ముసలి వ్యక్తి క్రింద గుమ్మంలోంచి ఆవరణలోకి వస్తున్నాడు.

“ఒంటరిగా తోటలోకి వెళ్ళకు నాన్నా! రేడియోలో చెప్పిన ఆ పారిపోయిన ఖైదీలు దాక్కున్నారేమో?” అంది వో పదహారేళ్ళ అమ్మాయి భయంగా-మేడమీంచి క్రిందికి చూస్తూ.

ఉలిక్కిపడ్డాను.

పాా గురించిన వివరాలు రేడియోలో ప్రసారం చేయబడ్డాయన్న మాట!!

"మరేం పర్వాలేదమ్మా సబియా! రేష్మి తెగ అరుస్తుంటే ఏమిటో చూద్దామని వచ్చాను. ఏ పిల్లినో చూసి అరిచివుంటుంది. నువ్వు పడుకోమ్మా! దాన్ని కట్టేసి వస్తాను" అంటూ ముందుకు నడుస్తూ "రేష్మీ!... రేష్మీ" అంటూ పిలవసాగాడు.

యజమాని పిలుపువిని వెనక్కి తిరిగింది రేష్మి.

దాని బొచ్చునిమిరి ముందుకు తోసాను.

రేష్మి తోకాడించుకుంటూ యజమాని వేపు పరిగెట్టింది. మరో రెండు నిమిషాలాగి, యిద్దరం ఎత్తయిన గడ్డివాము ఎక్కాం.

ఫోంబెడ్ మీద పడుకున్నట్లుగా హాయిగా నిద్ర పట్టింది.

# 10

"శ్యామ్!" నా భుజాల్ని గట్టిగా కుదుపుతూ _ మాయ గొంతు సన్నగా వినబడింది. బద్ధకంగా కళ్ళు తెరిచాను.

గడ్డివాము మీద పడుకొన్నట్లు గ్రహించి ఒక్క క్షణం ఆశ్చర్యపోయాను.

గతరాత్రి సంఘటనలు ఒక్కొక్కటి సినిమా రీల్లా నా కళ్ళముందు కదిలాయి.

అప్పుడే తెల తెలవారుతోంది.

చుట్టూ మంచు క్రమ్ముకొంది.

ఎక్కడో కోళ్ళు కూస్తున్నాయి.

వాచీ చూసుకున్నాను. ఐదూముప్పయి అయింది.

నా ప్రక్కనే వత్తిగిలి పడుకున్న మాయ నా చెవిలో రహస్యంగా చెప్పసాగింది.

"ఫ్లాష్! కంటక్రితం ఓ ట్రక్కు వచ్చి ఇక్కడఆగింది. ట్రక్కులో కాబేజీలు లోడ్ చేశారు. ఇంటియజమానీ, ట్రక్కు డ్రయివరూ మాట్లాడుకుంటుండగా విన్నాను. ట్రక్కు కొంచెంసేపట్లో బయలదేరి ఘజియాబాద్ అనే టౌనుకు మధ్యాహ్నం మూడుగంటలకు చేర్తుంది, సరుకు అక్కడి మార్కెట్లో విక్రయించడానిక్కి. డ్రయివర్ కాఫీ టిఫిన్లకోసం మేడలోకి వెళ్ళాడు. మనమందులో దాక్కుంటే?"

"ఘ...జి...యా...బా...ద్!" అన్నాను యేదో జ్ఞాపకం తెచ్చుకుంటూ.

"ఆ పేరుని మాప్‌లో చూసావ్. బోట్‌ని వేగంగా నడపడంవల్ల మనం అనుకున్నదానికంటే చాలాదూరం కవర్ చేశాం. ఘజియాబాద్ రావల్పిండికి రెండువందల మైళ్ళ యివతల వున్నది. ఆలశ్యంచేస్తే డ్రయివర్ వచ్చేస్తాడు" అంది కంగారుగా.

"ఆల్ రైట్!" అన్నాను పైకిలేస్తూ.

ఇద్దరం మేడవైపొకసారి చూసి, ఎవరూ రావటం లేదని నిర్ధారించుకున్నాక, జర్రున గడ్డివాముమీంచి క్రిందికి జారాం. వంగి పరిగెడుతూ ట్రక్కు తొట్టిలోకి యెక్కాం. కాబేజీలు అటూయిటు తొలగించి మధ్యగా కూర్చున్నాం. కాబేజీలు తొట్టి అంచుదాకా లేకపోడం వల్ల తలకొంచెం ఎత్తినా బయటవాళ్ళకి కనబడే అవకాశం లేదు.

మరో రెండు నిమిషాల్లో డ్రయివరూ, యింటి యజమాని ఉర్దూలో సంభాషించుకుంటూ ట్రక్కువైపుగా

వస్తున్న అలికిడి అయింది. ఊపిరి బంధించి మాయా, నేను ఒకర్నొకరు పట్టుకొని యిబ్బందిగా కూర్చుని వున్నాం.

"ఆదాల్ అర్జ్ హై ఖాసింసాబ్! రేపువచ్చి మీకు డబ్బు అందచేస్తాను" అన్న డ్రయివర్ మాటలు వినబడ్డాయి.

తర్వాత కాబిన్ డోర్ తీసిన చప్పుడు.

ఇంజను స్టార్టయింది.

ట్రక్కు రోడ్డెక్కాక మాయా నేనూ తలలు పైకెత్తి విశ్రాంతిగా గాలి పీల్చసాగాం.

# 11

మధ్యాన్నం ఎండ చుర్రుమనిపిస్తోంది.

తెల్లవారుఝామునుంచి, ఆ 'డకోటా' ట్రక్కులో, ఎత్తిపడేసే కుదుపులతో పకిస్తాన్ ఆర్ అండ్ బి డిపార్ట్మెంట్ని తిట్టుకుంటూ అప్పటిదాకా ఎలా ప్రయాణము చేసామో దేవుడికే ఎరుక.

కూర్చోడానికి వీలులేదు.

విపరీతమైన కుదుపులు.

పైన నిప్పులు చెరిగే ఎండ.

ఆహారపదార్థాలు పాడైపోయి, ఆకలికి తాళలేక ఆ పచ్చి కాబేజీలు నమిలేశాం.

గంట రెండయ్యేసరికి పీనుగుల్లా తయారయ్యాం.

దూరంగా ఘజియాబాద్ టౌన్ వస్తున్నట్లు సూచనలు కనబడగానే ప్రాణం లేచొచ్చింది.

తల పైకెత్తి పరిసరాలు పరికించాను.

అటుయిటూ పచ్చని పొలాలు. "మాయా! టౌన్లోకి వెళ్ళడం ప్రమాదం. ఇక్కడ దూకేద్దాం. చీకటి

పడేదాకా వుండి అప్పుడు రావల్సిందికి వెళ్ళే ప్రయత్నం చేద్దాం” అన్నాను.

నీరసంగా తలవూపింది మాయా.

వాడినగులాబీలావున్న ఆమెనుచూస్తే జాలి వేసింది. “మాయా!” ఆమె చేతిని ఆప్యాయంగా తీసుకొంటూ అన్నాను, “క్షణక్షణం గండాల్ని యెదుర్కొంటూ నాతో ఇండియా వస్తానని వుత్సాహపడ్డావ్. ఇప్పుడు అనుభవిస్తున్నావ్.” నా కంఠంలో చిరుకోపం ధ్వనించింది.

రంగు వెలిసిన చీరలా నవ్విందామె. “ఇప్పటి ప్రమాదాలు భవిష్యత్తులోమధుర జ్ఞాపకాలుగానిల్చిపోతాయ్”

“మధుర స్మృతులమాట దేవుడెరుగు. ట్రక్కులోంచి దూకేటప్పుడు కాళ్ళు విరక్కుండా జాగ్రత్తపడు. దేకకుంటూ యిండియా వెళ్ళలేం.”

పకపక నవ్వసాగింది మాయా దేక్కుంటూ ఇండియా వెళ్ళే సన్నివేశాన్ని వూహించుకొని.

“తర్వాత తీరిగ్గా నవ్వుకొందాం హనీ! ముందు నీ మోకాళ్ళకి నేను అడ్వాన్సు వైద్యం చేయాలి—” అన్నాను.

“అడ్వాన్సు వైద్యమా?” అంది ఆశ్చర్యంగాచూస్తూ మాయా.

తలవూపి బాగ్ లోంచి టవల్ తీసి రెండుగాచింపాను. ఇద్దరం లేచి కాబేజీలమీద కూర్చున్నాం.

ఆమె మోకాళ్ళక్రింద పిక్కలను గుడ్డతో బలంగా బిగించి బేండేజి వేశాను. “దూకేటప్పుడు కాళ్ళు బెణకకుండా” అన్నాను నవ్వుతూ.

“మరి నీకో?” అంది మాయా నోరు సున్నలా పెట్టి.

"అక్కరలేదు. అలవాటే! అమ్మాయిలకోసం గోడలు దూకే వాడిని" అన్నాను నవ్వుతూ.

"డెవిల్!" తిట్టిందామె.

"గెట్ రెడీ!" అన్నాను పైకిలేచి నిలబడుతూ.

ట్రక్కు తొట్టి అంచుమీదుగా వంగి, బాగ్ రోడ్ వారకు విసిరేశాను. "నెక్స్ట్ యు!" అన్నాను మాయను తొట్టి వెనకభాగానికి నడిపిస్తూ. "మాయా! తొట్టిని పట్టుకొని ముందుకాసేపు వేలాడు. తర్వాత నీ చేతుల్ని పట్టుకొని జాగ్రత్తగా దింపుతాను. ఓ.కే."

తల వూపిందామె.

మాయా మరుక్షణం ట్రక్కు అంచుని పట్టుకొని అవతలివేపు వేలబడింది.

ఆమె కాళ్ళు రోడ్డుకు అడుగుదూరంలో వున్నాయి.

"నా!" అంటూ ఆమె భుజాల్ని ఒక్కసారిగా పైకి యెత్తి వదిలాను.

మాయ కొంచెం ముందుకుతూలి _ రోడ్డుమీద నిలదొక్కుకుంది. నేను ఆమె వెనుకే ట్రక్కును పట్టుకొని పాదం ముందుభాగం రోడ్డుమీద ఆనేటట్లుగా దూకేను.

ట్రక్కు యిదేమీ తనకు తెలియదన్నట్లు అమాయకురాలిలా ముందుకు సాగిపోయింది.

ఇద్దరం పొలాల్లోకి నడిచాం.

ఓ చెరువును చూసి ఆగిపోయాం.

ఇద్దరం అందులోకి దూకాం.

స్నానం చేసినతర్వాత శరీరంలోకి కొత్తబలం వచ్చింది.

దుస్తులు మార్చుకొని సిగరెట్లు ముట్టించి, వాచీ కేసి చూస్తూ కూర్చున్నాం.

"ష్లామ్! ఆ బస్సు రావల్పిండి వెళ్తుంది!" అంటిమోచు ఫుత్సాహంగా, అప్పుడే ఆగిన ఓ బస్సు వేపు చూపిస్తూ.

ఘజియాబాద్‌లో ఓ చిన్న కాంటీన్‌లో టిఫిన్, కాఫీలు సేవించి చీకట్లో నిల్చున్నాం.

నాలుగయిదు బస్సులు మిస్సయిన తర్వాత మాకు కావల్సింది దొరికింది. రావల్పిండి వెళ్ళే నాన్‌స్టాప్ ఎక్స్‌ప్రెస్ అది.

"లెట్స్‌గో!" అన్నాను బాగ్ భుజానికి తగిలించు కుంటూ. అప్పటికి రాత్రి తొమ్మిది గంటలైంది. బస్సులో ప్రయాణీకులు పది పన్నెండుగురుకన్నా ఎక్కువలేరు. అందరికీ దూరంగా ఖాళీగావున్న వరసలమధ్య కుడివేపు డబుల్ సీట్‌లో కూర్చున్నాం.

నేను తలవంచి మౌనం వహించాను.

మాయా ప్రేక్ష టిక్కెట్లు కొంది.

ఎక్స్‌ప్రెస్ బస్ వేగంగా కదిలింది.

లాంగ్ జర్నీ గావడంవల్ల లెట్లు ఆర్పేశాడు కండక్టర్. శుభ్రంగా స్నానం చేయడంవల్ల, కడుపునిండా ఆహారం పడ్డంవల్లా కాస్సేపట్లో మాయా, నేను ఒకరి నొకరు అనుకోని కునికిపాట్లు పడసాగాం.

మెల్లిగా నిద్రలోకి జారిపోయాం—

బస్సు సడన్ బ్రేకుతో కీచుమంటూ ఆగడంతో వులిక్కిపడి లేచాను.

నాన్‌స్టాప్ బస్సు మధ్యలో ఎందుకు ఆగింది.

అప్పుడే రావల్పిండి వచ్చేసామా?

వాచీ చూసుకున్నాను. పన్నెండు గంటలయింది.

"షాప్! పోలీస్!" అంది మాయ నెమ్మదిగా వణుకు తున్న కంఠంతో.

బస్సు హెడ్ లైట్ల వెలుగులో రోడ్డుకు వారగా మోటర్ సైకిళ్ళు ఆపి దిగుతున్న యిద్దరు పోలీస్ యిన్ స్పెక్టర్లను చూసి అదిరిపడ్డాను.

వారిద్దరి చేతుల్లో ఆయుధాలు చూడగానే నా వెన్ను లోంచి చలి పుట్టుకొచ్చింది.

ఇన్ స్పెక్టర్లిద్దరూ చేతిలోని మెషిన్ గన్ లు వూపు కుంటూ బస్ వేపు నడచి వస్తున్నారు!

"మాయా! భయపడి లాభంలేదు. గెట్ రెడీఫర్ ఎటాక్. వాళ్ళదృష్టి నామీద వున్నప్పుడు సైగ చేస్తాను. వెంటనే విజృంభించాలి నువ్వు." రహస్యంగా చెప్పా నా మెతో, నా పిస్తోలు ఆమె చీర బొడ్లో దోపుతూ.

తలుపుతీసాడు ఓ ఇన్ స్పెక్టర్.

"కండక్టర్! లైట్లు వెయ్యి!" అన్నాడతను పెద్ద కంఠంతో.

"సార్! ఇప్పటికే బస్ లేట్ లో నడుస్తోంది. మధ్యలో ట్రబుల్ యిస్తే ఎలాసార్?" అన్నాడు కండ క్టర్ మా వెనుకనించి.

"లైట్లు వెయ్యరా బద్మాష్! లేకపోతే బుర్ర పేలి పోతుంది" అరిచాడు ఇన్ స్పెక్టర్.

కండక్టర్ లైట్లు వేశాడు.

ఇన్ స్పెక్టర్ తల లోపలపెట్టి గుడ్లగూబలా అటూ యిటూ చూశాడు. మరోక్షణం...

"మీరిద్దరూ యిలారండి" అన్నాడతను నావైపు చూస్తూ. నాగుండె ఒక్క క్షణం కొట్టుకోవడం మానే సింది.

"నిన్నే మిస్టర్!" అర్చాడతను.

"నేనా?" అన్నాను కంగారు కప్పిపుచ్చుకుంటూ.

'మీ యిద్దరూ - జల్దీ బాహర్ నికాల్!"

మాయా బాగ్ అందుకొని పైకిలేచింది.

ఇద్దరం బస్సుదిగాం.

"సార్! మాకు లేటయిపోయింది సార్!" అన్నాడు కండక్టర్.

"మీరు వెళ్ళిపోవచ్చు" అన్నాడు యిన్స్పెక్టర్.

బస్సు వేగంగా దూసుకుంటూ వెళ్ళిపోయింది.

"లుక్ ఇన్స్పెక్టర్! విదేశీ ప్రయాణీకుల్ని యీ విధంగా అవమానించడం మీరుచేసిన పెద్ద పొరపాటు. దీనికి జవాబు యిండియన్ కాన్సులేట్ కి మీరు చెప్పుకోవాల్సి వుంటుంది" అన్నాను తీవ్రంగా.

"సారీ మిస్టర్! మాడ్యూటీ మేము చేయాలి. మీ పాస్పోర్టు చూపించండి!" అన్నాడతను మెషిన్ గన్ భుజాన్కి తగిలించుకొని చేయిజాపుతూ.

రెండో ఇన్స్పెక్టర్ చేతిలో మెషిన్ గన్ నా వేపు స్టెడీగా గురిపెట్టబడివుంది.

పాంటు పాకెట్ లోంచి పాస్పోర్ట్ పుస్తకంతీసి యిన్స్పెక్టర్ చేతికి యిచ్చాను.

అతను పేజీ త్రిప్పాడు.

ఇద్దరి దృష్టి పేజీలో వివరాలపై కేంద్రీకృతమైంది. సన్నగా గొణుగుతూ చేయిపైకెత్తి తలగోక్క ..అంతే! మాయాకాలు మెరుపులా పైకిలేచి రెండో ఇన్స్పెక్టర్ మెషిన్ గన్ ని ఎగరగొట్టడం, నా నోటివెంట కరాటే గర్జన వెలువడుతుండగా నా అరచేయి పిడుగులా మొదటి ఇన్స్పెక్టర్ మెడకు తాకడం, అతను స్పృహ తప్పి

బరువుగా జారిపోవడం, అతని భుజానవున్న మెషిన్ గన్ నా చేతిలోకి రావటం అన్నీ కన్నుమూసి తెరిచేలోగా చకచక జరిగిపోయాయి.

"బీ కేర్ ఫుల్ ఇనెస్పెక్టర్! కాలు కదిలితే మెదడు పగులుంది" అంది మాయా రెండో ఇన్ స్పెక్టర్ తలకు సూటిగా పిస్తోలు గురిపెట్టి.

దూరంగా పడివున్న రెండో మెషిన్ గన్ కూడా కలెక్ట్ చేసుకొని వాడిదగ్గరకు వచ్చాను.

"ఇన్ స్పెక్టర్ మీ ఫ్రెండ్ కి పట్టిన గతి చూశావా?" అన్నాను నవ్వుతూ.

అతను నేలమీద స్పృహతప్పి కట్టెలా పడివున్న మిత్రుడికేసి వోసారి చూసి, తిరిగి నాకేసి చూస్తూ-"నీకు కరాటే వచ్చా" అన్నాడు భయంగా.

"అదొక్కటే కాదు. 'కుంగ్ ఫూ' కూడా వచ్చు. ఆదేవిటో తెల్సా? రెండుచేతుల చూపుడువేళ్ళు సాచి ఎదుటివాడి కళ్ళు పొడిచెయ్యడం."

ఇన్ స్పెక్టర్ ముఖం తెల్లగా పాలిపోయింది.

"నన్ను వదిలెయ్" అన్నాడతను బెదురుచూపుల్తో.

"అయితే వెనక్కి తిరుగు."

"ఏం చేస్తావ్?"

"వెనక్కి తిరగకపోతే కుంగ్ ఫూ పద్ధతిలో కళ్ళు పొడిచేస్తాను."

ఇన్ స్పెక్టర్ కంగారుగా వెనక్కి తిరిగాడు.

మెషిన్ గన్ ని తిరగేసి పట్టుకొని బలంగా అతని తల వెనుక తాకించాను.

కిక్కురుమనకుండా కప్పలా కూలిపోయాడతను. ఇద్దరినీ రోడ్డు వారగానున్న పొదలలోకి లాగేశాను.

ఇద్దరూ మరో గంటదాకా కళ్ళు తెరవరు.

ఒక మెషిన్‌గన్‌కి ఎమ్యూనిషన్ క్లిప్ లాగేసి దూరంగా విసిరేశాను. ఖాళీ మెసిన్‌గన్ వారిద్దరిమధ్యా పారేసి, రెండో మెషిన్‌గన్ భుజానికి తగిలించుకున్నాను.

రోడ్డు వారగా ఆగివున్న మోటర్ సైకిళ్ళవైపు నడిచాను.

ఒక మోటర్ సైకిల్‌కి స్పార్క్రింగ్ ప్లగ్ లాగేసి దూరంగా విసిరేసి — రెండో మోటర్ సైకిల్ స్టార్టు చేశాను.

"కమాన్ డార్లింగ్."

మాయా నవ్వుతూ పరిగెట్టుకుంటూ వచ్చి వెనకాల ఎక్కింది.

బండి బాణంలా దూసుకుపోయింది.

# 13

మరో నాలుగు గంటల మోటర్ సైకిల్ ప్రయాణం— మమ్మల్ని రావల్పిండి పొలిమేరల్లోకి తీసుకువచ్చింది.

ఇక ఆ వాహనంపై ముందుకు వెళ్ళడం ప్రమాదమని గ్రహించాను. ఇప్పటికే సెర్చింగ్ ప్రారంభమై వుండాలి.

మోటర్ సైకిల్ నంబర్ మమ్మల్ని సులువుగా పట్టిస్తుంది.

మోటర్ సైకిల్‌ని ఓ కాలువలో తోసేసి—నడక ప్రారంభించాం.

దూరంగా రావల్పిండి సిటీ భవనాలు కనబడుతున్నాయి.

రోడ్డుకటూ ఇటూ కొండలు, రాతి మైదానాలు విస్తరించి వున్నాయి.

వున్నట్టుండి ఆకాశంలో ఏదో చప్పుడైంది.

"ఫ్లాప్! లుక్ దేర్!" మాయ కేక పెట్టింది.

ఉలిక్కిపడి ఆమె చూపించిన దిక్కుగా ఆకాశంలోకి చూశాను. హోవర్ విమానం ఒకటి మా నెత్తిమీద ఎగురుతూ కనబడింది. సింగల్ ఇంజన్‌తో నడిచే డబుల్ సీటర్ విమానం అది. రన్ వే—అవుసరం లేకుండా సుల భంగా ఖాళీ ప్రదేశాల్లో ఆపవచ్చు. ఆ విమానంలో పైలట్ కాకుండా - చంఘీజ్ ఖాన్ వుంటాడనడంలో నాకేలాంటి సందేహంలేదు.

సడన్ గా-హోవర్ ప్లేన్ వేగంతగ్గి క్రిందికి దిగసాగింది.

"క్విక్ మాయా! పరిగెట్టు!" అరిచాను మాయ చేతిని పట్టుకుని ముందుకు లంఘిస్తూ. "వాళ్లు మనల్ని ఈపాటికే గుర్తించి వుండాలి. మనం ఎక్కడైనా దాక్కోవాలి."

దట్టమైన పొదలకు దాదాపు పదిహేను అడుగుల దూరంలో వుండగా ఎందుకో అనుమానం వచ్చి పరిగెడుతూ పైకి చూశాను.

అంతే!!

నా గుండెలు అదిరిపోయాయి!!

విమానంలోంచి విసరబడ్డ బాంబు మా ముందు పడబో తోంది.

నేనాలశ్యం చేయలేదు.

మాయాను విసురుగా నేలమీదకి పడదోయడం, ఆమెను చేతులమధ్య బిగించి కళ్ళు మూసుకుని పిచ్చి వేగంగా పొదల్లోకి దొర్లడం, మాకు పదడుగుల దూరంలో భూమిని దద్దరిల్లజేస్తూ, బాంబు భళ్ళున ప్రేలడం, విసురుగా మట్టి- రాళ్ళు పైకి ఎగరడం వరుసగా జరిగి పోయాయి. తలమీద చేతులు పెట్టుకొని మాయను కవర్ చేస్తూ పడుకున్న నేను కళ్ళు తెరిచి కాసేపు అలాగే

వుండిపోయాను. వీపునిండా మట్టి ... బాంబు పడిన ప్రదేశంలో బ్రహ్మాండమైన గొయ్యి ఏర్పడింది. దట్టమైన నల్లటి పొగ ఆ ప్రాంతాన్నంతటిని మేఘాల్లా కమ్మివేయ సాగింది.

హోవర్ ప్లేన్ నేలమీద ఆగిన శబ్దం...

"మాయా! గాయాలేం తగల్లేదుకదా?" అన్నాను ఆమెకు దూరంగా జరిగి ఊపిరి పీల్చుకునే అవకాశం యిస్తూ.

"సరైన సమయంలో నువ్వు మెరుపులా పనిచేయక పోతే మనం ఇద్దరం ఆ గోతిలో సమాధి అయ్యేందే వాళ్ళం. ఇట్ వుడ్ హావ్ బీన్ హారిబుల్-ఫ్లాష్!" అంది మాయా గాద్గదికంగా నా కల్లుకుపోతూ.

అప్పుడు తెల్సుకున్నాను ఆమె మోచేతులు దారుణంగా కొట్టుకుపోయినట్లు. "మాయా!" అన్నాను బాధగా.

"నీ చేతులుకూడా కొట్టుకుపోయాయి" అంది నవ్వుతూ.

"ఆల్ రైట్! ఇక మాట్లాడక! చంఘీజ్ ఖాన్ ఇటు వస్తున్నాడు."

రాతినేలమీద పైలట్, చంఘీజ్ ఖాన్ల బూట్ల చప్పుడు దగ్గరౌతున్న శబ్దం వినిపిస్తోంది.

పొదల్లోంచి కళ్ళు చిట్లించి చూడసాగాను.

గోతికి పదడుగుల దూరంలో వారిద్దరూ ఆగిపోయారు.

నల్లనిపొగలు యింకా పల్చగా వ్యాపించి వుండటం చేత వాళ్ళ కాళ్ళుమాత్రం కన్పిస్తున్నాయి.

"సులేమాన్! వాళ్లు నిజంగా చచ్చారా?" చంఘీజ్ కంఠం.

పకపకా నవ్వు వినబడింది. "నా కళ్ళతో నేను చూసాను బాస్! వాళ్లు తప్పించుకోడం అసంభవం. బాంబు పడుతుండగా యిద్దరూ నేలమీద పడ్డారు. కొద్ది క్షణాల్లో భళ్లున పేలింది బాంబు. తప్పించుకునే ఛాన్సు లేదు. ఆ గొయ్యిచూడండి. నుయ్యిలా వుందది. వాళ్ళు ఇద్దరూ ఇసుకలో కప్పబడి వుంటారు. అక్కడ ముక్క ముక్కలయిన బాగ్ చూడండి. ఆ బాగ్ ప్లాష్‌దే!"

"సులేమాన్. గాయాలతో వాళ్ళు తప్పించుకొనివుండ వచ్చు. ఎందుకయినా మంచిది. ఆ మూలవున్న పొదలు వెతుకుదాం. నీ పిస్తోలుతియ్." ఆర్డర్ చేశాడు చంఘీజ్ ఖాన్

ఊపిరి బిగబట్టాను!!

ఎడంచేత్తో మాయ నోటిని మూసాను.

బూట్లచప్పుడు దగ్గరవుతోంది.

తాపీగా పొదలమధ్యనుంచి మెషీన్‌గన్ మొనని బయ టికి పెట్టాను.

అయిదడుగుల దూరంలో బూట్లచప్పుడు ఆగిపోయింది.

నాచేయి ట్రిగ్గర్ ఆపరేటర్‌ని బలంగా నొక్కింది.

అంతే!

గజ్...జ్...జ్...జ్...జ్...జ్...జ్...

పిచ్చాడిలా బారెల్ అటూయిటూతిప్పాను. ఫైరింగ్ శబ్దంతో ఆ ప్రదేశం మారుమ్రోగుతోంది. దశదిశలు దద్ద రిల్లేలా...

కవ్వున ఆర్తనాదాలు!!

ఫైరింగ్ చప్పుడు ఆగిపోయింది.

మాయా, నేను బైటికి వచ్చాం.

చంఘీజ్ ఖాన్, సులేమాన్‌ల శరీరాలు విచిత్రమైన కోణాల్లో చెల్లా చెదురుగా పడివున్నాయి.

యిద్దరి శరీరాలు కన్నాలలో, జల్లెడలా కనబడింది.

"చంఘీజ్ ఖాన్! నిన్ను చంపగలిగిన అవకాశం ఒక సారి వచ్చికూడా ప్రాణాలతో వదిలాను. కాని నా శరీరాన్ని బాంబుతో వేయిముక్కలు చేయాలని చూశావ్. అయామ్ సారీ ఫ్రెండ్! ప్లాన్‌మీద బాంబు వేసినవాడు ఎవడూ బతికిలేడు" అన్నాను చంఘీజ్ ఖాన్ శవానికి నా సంజాయిషీ చెప్పుకుంటూ.

"హ్లాష్! ఉగ్రసేన్ ఆత్మ శాంతించింది" ఉత్సాహంగా మాయా ముందుకు కదిలి, ఇద్దరి శవాల్ని గోతిలోకి తోసింది.

తర్వాత ప్లేన్ వైపు వుత్సాహంగా పరిగెట్టాం ఇద్దరం. క్షణాల్లో పైలెట్ సీట్ అధిరోహించాను.

మాయ ప్రక్క సీట్లో కూర్చున్న తర్వాత కాబిన్ తలుపులు బిగించాను. మాయను సీట్ బెల్ట్స్ కట్టుకోమని చెప్పి, త్రాటిల్స్ ఫార్వర్డ్ చేశాను.

ఇంజన్ పెద్దశబ్దంతో పనిచేయడం ప్రారంభించింది. బ్రేక్స్ రిలీజ్ చేసిన వెంటనే విమానం పరిగెట్టసాగింది.

నోస్ వీల్ (స్టీరింగ్)ని ఎడంచేత్తో పట్టుకుని, కుడి చేత్తో కంట్రోల్ యోక్‌కి ఫార్వర్డ్ ప్రెషర్ అప్లయి చేశాను. వేగం కొంచెం పెరగసాగింది. రిట్రాక్టింగ్ గేర్‌ని పైకినొక్కి, ఇన్‌స్ట్రుమెంట్ పానెల్ మీది మధ్య భాగంలోని లివర్ని పైకి నొక్కాను.

అంతే!

విమానం ఏటవాలుగా ఆకాశంలోకి ఎగిరింది.

# 11

సాయంత్రం ఆరుగంటలవుతోంది...

జీలంనది మీదుగా ఆకాశంలో ఎగురుతున్నాం.

"మాయా! పకిస్తాన్ జమ్మూ-కాశ్మీర్ సరిహద్దుల్లో కైలాష్‌నాథ్ అనే మంచుపర్వతం వుంది. ఆ పర్వతం అవతలివైపు లాండ్ కాగలిగితే మనం ఇండియా చేరుకున్నట్లే!

ఇంకో అరగంట ప్రయాణించగలిగితే శ్రీనగర్ చేరవచ్చు. కాని రెండుప్రమాదాలు మనం ఎదుర్కోవాల్సి వుంది" ప్రశ్నార్థకంగా చూస్తున్న మాయకు వివరించసాగాను. "ఒకటి మన విమానంలో ఫ్యూయల్ మరో అరగంటలో అయిపోవచ్చు. కైలాష్‌నాథ్ పర్వతంచేరే లోగానే యింధనం అయిపోతే మనం పకిస్తాన్ సైనికులకు దొరికిపోతాం. రెండు__విమానాన్ని దొంగిలించి మనం బోర్డర్ దాటబోతున్నామని, ఆ విమానం కనబడితే కూలగొట్టమని ఈ పాటికే సరిహద్దుల్లో సైనికులకి ఆదేశాలిచ్చి వుండవచ్చు. అలాంటప్పుడు కైలాష్‌నాథ్ పర్వతమవతలివైపు మనవిమానం శత్రువుల కాల్పులను ఎదుర్కోవలసి వుంటుంది" అన్నాను యింజన్‌కి ప్రెషర్ అప్లయి చేస్తూ.

"ప్లాష్! మొదటి ప్రమాదం విషయంలో, మనం యిక్కడదిగి ఫ్యూయల్ నింపుకొని మళ్ళీ ప్రయాణిస్తే బావుంటుందేమో" అన్నది మాయా.

"టూ రిస్కీ" తల అడ్డంగా ఊపాను. "మనదగ్గర మెషిన్‌గన్ వున్నది కాబట్టి మన ప్రాణాలకు హాని కలగక పోవచ్చు. కాని లాండ్ అయినప్పుడు ఏ ట్రిగ్గర్ హాపీ పోలీస్ ఇన్‌స్పెక్టర్ అయినా, విమానం ఫ్యూయల్

టాంకులోకి ఒక్క బుల్లెట్ ఫైర్ చేస్తే - యిక మనం ఇండియా వెళ్ళే అవకాశాలు వ్యర్ధమైపోతాయ్."

మాయ యిక మాట్లాడలేదు.

విమానం వేగం హెచ్చించాను.

మరో ఇరవై నిముషాల్లో సరిహద్దుల దరిదాపుల్లోకి వచ్చేస్తాం..."బీ ఎలర్ట్ మాయా! మరో ఐదు నిమిషాల్లో కైలాష్‌నాథ్ పర్వతంమీద ఎగరబోతున్నాం" హెచ్చరించాను దూరంగా తెల్లగా మెరుస్తూ కనబడుతున్న పర్వతాన్ని అవలోకిస్తూ.

కొద్దిసేపట్లో విమానం _ అడవులు, లోయలు, సెలయేళ్ళు అధిగమించి పర్వతంవైపు ఎగురసాగింది.

సరిగ్గా అప్పుడే...

లోయ ప్రాంతం అంతా నిద్రనుండి మేల్కొన్నట్టుగా ధన్...ధన్...ధన్...మంటూ హైపిచ్‌లో గ్రౌండ్ ఫైర్ ప్రారంభం అయింది.

నాగుండె ఎందుకో దడదడలాడింది.

"లిస్సెన్ మాయా! పకిస్తాన్ సైనికులు అలెర్ట్ అయ్యారు. తలవంచి కూర్చో! నేను ఏం చెప్తే అది నువ్వు వెంటనే చేయాలి" అన్నాను విమానాన్ని జిగ్‌జాగ్‌గా పోనిస్తూ.

టిన్యూ....టిన్యూ....టిన్యూ....

విమానాన్కి అటూయిటూ గుళ్లు గురితప్పుతూ ఎగురుతున్నాయి.

ఫ్లయింగ్ డైరెక్షన్స్ చకచకా మారుస్తూ విమానాన్ని వేగంగా కైలాష్‌నాథ్ పర్వతంపైకి పోనిచ్చాను.

ఫ్యూయల్ గాజ్ చూసి అదిరిపడ్డాను.

ఇంధనాన్ని సూచించే, నీడిల్ జీరోని తాకపోతుంది.

ఒక్క నిముషం...

కేవలం ఒక్క ని....ము....షం....దాటితే—

అవతలి వైపుకు వెళ్ళిపోతాం.

ఫైరింగ్ శబ్దంతో లోయప్రాంతం అదిరిపోతోంది.

జ్...జ్...జ్...జ్...

యాంటి ఎయిర్ క్రాఫ్ట్ గన్సు పేలి కేకలు వినబడ్డాయి. రెండు షెల్సు దూసుకుంటూవచ్చి కాబిన్ అద్దాలకి తగలడంతో అవి భళ్లున విరిగి లోపలికిపడ్డాయి.

బయటనుంచి విసురుగా చల్లగాలి లోపలికి దూసుకు వచ్చి కాబినులో ప్రెజర్ ఎక్కువ కాసాగింది.

వణుకుతున్న చేతుల్తో బలంగా నోస్‌వీల్‌ని పట్టుకుని, నేర్పుగా విమానాన్ని ముందుకు పోనిస్తున్నాను.

ధన్...ధన్...ధన్ ... నిర్విరామంగా కాల్పులు కొనసాగుతున్నాయ్.

మరో షెల్ వచ్చి విమానం ఫ్యూయల్ టాంకును విచ్ఛిన్నం చేసిన శబ్దం అయింది.

అంతే! నాలో ఎక్కడలేని భయం ఆవహించింది.

ఆ శబ్దానికి విమానం ఒక్కసారి యెండుటాకులా వణికింది.

తోకవైపు నల్లని ఆయిల్ పొగలు దట్టంగా కమ్మేసాయి.

కంట్రోల్ తప్పి రబ్బరుబొమ్మలా ఊగసాగిందివిమానం.

క్రిందికి చూశాను.

నాలో ఆశ తళుక్కుమని మెరిసింది.

పర్వతాగ్రాన్ని దాటేశాం...

కంట్రోల్ పానెల్ మీద నా చేతులు చకచకా పని చేయసాగాయి.

"మాయా! రిమూవ్ సేఫ్టీ బెల్ట్స్" అరిచాను.

గాలి విపరీతంగా కాబిన్‌లోకి వస్తోంది.

మాయా బలంగా ఇద్దరి సేఫ్టీ బెల్ట్‌లు విప్పేసింది.

అప్పటికే ఆలస్యం అయింది.

ఇంధనం అందకపోడంతో ఇంజన్ పనిచేయడంలేదు. యంత్రాలు ఇక కంట్రోల్‌లో లేవు.

అంతే!

విమానం రెక్కలు విరిగిన పక్షిలా పర్వతపు పల్లాల లోకి కూలిపోసాగింది.

"మాయా! డోర్ తెర్చి దూకేయ్!" భయంగా అరిచాను ఆమెను ముందుకు తోస్తూ.

మాయ డోర్ బలంగా బైటికితోసి గ్భాలున మంచు నేలమీదకి దూకేసింది.

ఆమె వెనకే నేనూ జంప్ చేసాను.

ఇద్దరం మంచులో దొర్లుకుంటూ వెళ్ళి కొంతసేపటికి ఆగిపోయాం.

విమానం గుడ్డిదానిలా క్రిందికి జారుతూ మంచు చరియల్లో గుద్దుకుని ముక్కలు వేసుకుంటూ భళ్ళున పేలిపోయింది.

దట్టమైన పొగలు.

అరగంటలో ఆ ప్రాంతమంతా భారత సైనికులతో నిండిపోయింది.

## 15

ఢిల్లీ!...

మిలిటరీ ఇంటలిజెన్స్ ఆఫీసులో...

"గుడ్ బై సర్! ఇక నెలరోజుల వరకూ ఎవరికీ కని పించను. మాయా శ్రేష్ఠ భారత పౌరసత్వం లభించే విషయంలో సహకరించింది."

"ష్యూర్!" కురుషీర్ ఆప్యాయంగా మరోసారి నన్ను కౌగలించుకున్నారు.

"ఫ్లాష్! శత్రువుల దురాక్రమణ పత్రాలని ప్రాణాలకి తెగించి మాతృదేశానికి అందించావ్. యు శేవ్డు మదర్ ఇండియా ఫ్రం వార్! ఇకనుంచీ మన డిపార్ట్మెంట్లో ఉగ్రసేన్ స్థానాన్ని నీవే అలంకరిస్తావ్" అన్నారాయన చెమర్చిన కళ్ళతో.

"థాంక్యూ సర్! నెల రోజులదాకా నన్ను డిస్టర్బ్ చేయరుకదా?" అన్నాను నవ్వుతూ.

"ఆ విషయం చెప్పలేను. పార్లమెంట్లో చర్చలు జరుగుతున్నాయి. నేతాజీ సుభాస్ చంద్రబోస్‌ని వెతికే ఎస్సయిన్మెంట్ నీకు అప్పగించవచ్చును."

నవ్వి తల ఊపాను "గుడ్ బై సర్!"

"గుడ్ లక్ ఫ్లాష్! హేవ్ నైస్ టైమ్ విత్ ది లిటిల్ గర్ల్!"

మాయా చేతిని పట్టుకుని బైటకి పరిగెత్తాను. ఇద్దరం డిపార్ట్మెంట్ కార్లో ఎక్కాం. కారు స్టార్ట్ చేసి నాలు గైదు వీధులు దాటిన తర్వాత ఓ చోట రప్పున ఆపేశాను.

మాయ వింతగా చూసింది. "ఎందుకు ఆపేశావ్?"

"ముద్దు కావాలి" అన్నాను ఆమెను మీదకి లాక్కుంటూ.

మాయ నవ్వుతూ నన్ను చేత్తో వెనక్కి తోసింది. "ఇప్పుడు కాదు. చీకటిపడ్డాక."

"నీవన్నీ మాయ మాటలు! ఇప్పుడు అద్యాన్నంగా ముద్దు కావాలి" అన్నాను—మాయ అకస్మాత్తుగా నా కౌగిలిలోకివచ్చేసింది. మా పెదిమలు అతుక్కుపోయాయి. ఆమె చేతులు నా జుట్టులో కదులుతున్నాయి.

ఎక్కడికో తేలిపోతున్న అనుభూతి.

డోర్ మీద టకటక చప్పుడు...

కళ్ళు తెరిచాం. అదిరిపడ్డాం యిద్దరం.

ట్రాఫిక్ పోలీస్!

—: అయిపోయింది :—

# నిర్జీవ నర్తకులు!!

అజీజ్

డిటెక్టివ్ ఉత్తమకుమార్ డాక్టర్ల సలహామీద కొన్నాళ్లు విశ్రాంతి తీసుకుందామనే వుద్దేశంతో తన అసిస్టెంట్ సంజయ్‌ని వెంటబెట్టుకుని మద్రాసువదిలి, ఊటీలో మకాం వేసి అప్పటికే వారంరోజులవుతోంది.

మద్రాసులో వున్నంతకాలం క్రిమినల్ కేసుల గొడవల్లో నిర్విరామంగా సతమతమయ్యే ఆ డిటెక్టివ్ ద్వయం, అక్కడి టూ స్టార్ హోటల్లో ఆ వారంరోజులూ నిశ్చింతగా, ఆహ్లాదంగా గడిపేశారు.

డిటెక్టివ్ ఉత్తమకుమార్ స్వతహాగా మౌనం, గాంభీర్యం మూర్తీభవించిన వ్యక్తి. మితభాషి. స్ఫురద్రూపి.

అతని అసిస్టెంట్ సంజయ్‌ది మాత్రం అందుకు భిన్నమైన తత్వం! నవ్వుతూ, నవ్విస్తూ చలాకీగా అందర్నీ ఇట్టే ఆకట్టుకుంటూ వుంటాడు.

ఊటీ వచ్చిన మూడవరోజు అనుకోకుండా పరిచయమైంది సంజయ్‌కి ప్రేరిత! త్వరలోనే వాళ్ళిద్దరి మధ్యా స్నేహం సెమలిపింఛంలా పురివిప్పింది.

ఆ అమ్మాయికి ఇరవైలోపే వుంటుంది వయసు. స్నేహపిపాసి. చూడగానే ఆకట్టుకునే వ్యక్తిత్వం! నిర్మలంగా, గలగల పారే సెలయేటివంటి నైజం!

విచిత్రం ఏమిటంటే, ఆ హోటల్లో ఆ అమ్మాయి ఒక్కర్తే బసచేస్తోంది. ఎవరూ తోడులేకుండా, విజయనగరంనించి వచ్చిందిట, కొన్నాళ్ళు పీస్‌ఫుల్‌గా గడిపిపోదామని.

అంతకుమించి ఆమె వ్యక్తిగత వివరాలు తెలుసుకోడానికి అట్టే ఆసక్తి చూపలేదు సంజయ్. ఆమెకూడ అతని వ్యక్తిగత జీవితం గురించి ఎన్నడూ అడగలేదు.

సాయంత్రం ఆరుగంటలకి ట్రిమ్‌గా తయారయి, లిఫ్ట్‌లో క్రిందికివచ్చి, బాల్‌రూంలో ప్రవేశించాడు సంజయ్.

రంగురంగుల దీపకాంతులతో భూతల స్వర్గంలా వెలిగిపోతోంది విశాలమైన హాలు. ఎదురుగా డాన్సు స్టేజ్ మీద ఆర్కెస్ట్రా సన్నని శ్రావ్యమైన ట్యూను మ్రోగిస్తూ ఆ వాతావరణాన్ని మరింత ఆహ్లాదకరంగా మారుస్తోంది.

యువ జంటలూ, వృద్ధజంటలూ అనే తారతమ్యం లేకుండా అందరూ టేబిళ్ళు నలంకరించి యెవరికి తోచిన పానీయాలు వారు తాగుతూ నవ్వులతో, ఛలోక్తులతో కులాసాగా కాలక్షేపం చేస్తున్నారు.

సంజయ్ ఓ కుర్చీలో చతికిలబడి, ప్రేరిత కనిపిస్తుందేమోనని చుట్టూ కలయచూశాడు. ఎక్కడా ఆమె పిపులేదు. కాసేపట్లో రావచ్చు ఓపికపట్టాలి అను

కుంటూ సిగరెట్ అంటించి, వచ్చేపోయే జనాన్ని చూస్తూ కూర్చున్నాడు.

స్టేజ్ పై అంతవరకూ మోగుతున్న ఆర్కెస్ట్రా ఆగిపోయి, మైక్‌లో ఎనౌన్సర్ కంఠం వినిపించ సాగింది.

"విచిత్ర నర్తకులు! లేడీస్ అండ్ జంటిల్మన్! ప్రపంచంలో ఇంతవరకూ ఎక్కడా కనీవినీ ఎరగని అత్యంత ఆశ్చర్యంతో కూడిన విచిత్ర నర్తకుల డాన్స్ ప్రోగ్రాం ఎల్లుండి సాయంకాలం మీముందు ప్రవేశపెట్టబోతున్నాం.

ముందు ఆ నర్తకులనీ, ఆ తర్వాత వారు ప్రదర్శించే నాట్యాన్నీ చూసి మీరు నిజంగా దిగ్భ్రమ చెందుతారు. నాట్యానికి ముందు కాళ్ళు, చేతులూ కదపడం అటుంచి కనీసం ఊపిరికూడా సరిగ్గా తీసుకోలేనంత బలహీనంగా కనిపించే ఆ నర్తకులు, ఆ తర్వాత స్టేజిపై దృష్టివేగాన్ని మించిన చురుకుదనంతో, మెరుపుతీగల్లా ఏ విధంగా నాట్యంచేస్తారో చూసి, నిర్ఘాంతపోక తప్పదు.

జ్ఞాపకం వుంచుకోండి! ఎల్లుండి సాయంత్రం సరిగ్గా ఎనిమిదిగంటలకి ప్రదర్శించబోయే విచిత్ర నర్తకుల నాట్యాన్ని తిలకించడం మరవకండి" ఆ ప్రకటన విని ముఖం చిట్లించాడు సంజయ్.

అర్థపర్థంలేని అతిశయోక్తులతో నిండిన అటువంటి చొప్పదంటు ప్రకటనలంటే అతనికి నచ్చవు.

పూర్తయిన సిగరెట్‌ని ఏష్‌ట్రేలో నొక్కి తలెత్తగానే కనిపించింది ప్రేరిత. అతన్ని సమీపిస్తూ కాదు. అతని ముందునించే నడిచి వెళుతోంది.

బహుశా గమనించలేదు కాబోలు అనుకుంటూ చటుక్కున కుర్చీలోంచి లేని "హలో, ప్రేరితా!" అన్నాడు సంజయ్.

ఆ అమ్మాయి ఉలిక్కిపడి వెనుదిరిగి, కనురెప్పలు టప టప లాడిస్తూ విచిత్రంగా చూసిందతని వైపు. సాధారణంగా పరిచయస్తులు కనిపించగానే ఎవరయినా పలకరింపుగా నవ్వుతారుగానీ, అలా నిర్వికారంగా చూడరు.

సంజయ్ నవ్వి, "ఇదివరకెన్నడూ మనం కలుసుకోనట్టు అలా చూస్తావేం? ఇంత సేపూ నీకోసమే ఎదురు చూస్తున్నాను. కమాన్!" అన్నాడు.

ప్రేరిత పెదాలు బిగించి, "మిస్టర్! ఎవరు నువ్వు? ఆడపిల్ల ఒంటరిగా కనిపిస్తే చాలా? ఏకంగా పరిచయం కోసం పాకులాట్టమే! మనమిదివరకెక్కడ కలుసుకున్నామేమిటి?" అంది తీక్షణంగా.

సంజయ్ బిగ్గరగా నవ్వి, "నాచురల్ ఆక్టింగ్! నీకు నటనలోనూ మంచి ప్రావీణ్యం వుందని ఇప్పుడే తెలిసింది సుమా!" అన్నాడు విట్టు విసురుతూ.

ఆ మాటతో ప్రేరిత మొహం జేవురించింది. "ఏయ్ మిస్టర్! ఊరుకుంటోంటే మరీ మితిమీరుతున్నావు! మర్యాదగా ఇక్కణ్ణించి వెళ్ళావంటే సరేసరి, లేదా చింతిస్తావు జాగ్రత్త."

సంజయ్ మనసు చివుక్కుమంది. ప్రేరిత నటించడం లేదు. సీరియస్‌గా అంటోందామాటలు. నిన్నటి వరకూ ఎంతో ఆత్మీయంగా, స్నేహంగా మసలిన మనిషి హఠాత్తుగా దేనికలా మారిపోయింది? ఏమిటీ మాయ? జ్ఞాపకం వున్నంతవరకూ తనవల్ల ఏ పొరపాటూ జరగలేదే?

ఆ హఠాత్సంఘటనతో సంజయ్ అహం దెబ్బతింది. తలవంచుకుని "సారీ! పొరబడ్డాను. ఎక్స్‌క్యూజ్ మీ!" అంటూ వెనుదిరిగాడు.

లోలోన మండుతున్న దావానలాన్ని ఓపిక అనే

తేమతో ఆర్పడానికి ప్రయత్నిస్తూ తిరిగి సీట్లో కూల బడ్డాను. మళ్ళీ ఆ వసంస్కారివైపు కన్నెత్తి చూడ కూడదు అనుకుంటూ జేబులోంచి సిగరెట్ తీసి అంటిం చాను.

అదే సమయంలో పొడుగ్గా, బలిష్టంగావున్న ఓవ్యక్తి అడుగులో అడుగు వేసుకుంటూవచ్చి అతనిముందు నిల్చు న్నాడు. సంజయ్ తలెత్తి, కళ్ళు చిట్లిస్తూ ప్రశ్నార్థ కంగా చూశాడతన్ని.

"నాలుగు రోజుల్నుంచీ గమనిస్తున్నాను నువ్వా అమ్మాయి చుట్టూ ప్రదక్షిణాలు చెయ్యడం! ఆ పిల్లనితిరుగు బోతనుకున్నావట్రా? మళ్ళా ఆమె ఛాయలగ్గనక వెళ్ళా వంటే, నీ ఎముకలు చూర్ణంచేసి, వక్క పొడుంలా వాడు కుంటాను జాగ్రత్త!" అన్నాడా వ్యక్తి పళ్ళునూరుతూ.

ముందే చిరాకుతోవున్న సంజయ్ చివాల్న కుర్చీ లోంచి లేచి, "ఏయ్ మిస్టర్! మాటలు కాస్త జాగ్ర త్తగా రానియ్. నేను నువ్వనుకుంటున్నంత నానిరకం మనిషినికాను. వెంటనే వెళ్ళిక్కణ్నించి!" అన్నాడు తీక్షణంగా.

"ఓరి చుంచెలుకా! నన్నే వెళ్ళమంటావుట్రా? ఎన్ని గుండెల్రా నీకు? చూడు నిన్నేం చేస్తానో!" పిడికిలి బిగించి అడుగు ముందుకు వేశాడతను.

అంతే! బూటుకాలితో మెరుపులా ఈడ్చి డొక్కలో ఒక్కతన్ను తన్నేడు సంజయ్. అతనా షాక్‌లోంచి తేరుకోకముందే పిడికిలిబిగించి దవడకింద పిస్టన్‌లా నాలు గయిదు ఇచ్చేడు. అతని పెదాలు చిట్లేయి. రక్తంకారు తోంది.

చేతులు దులుపుకొని కాలర్ సరిచేసుకున్నాడు సంజయ్. అప్పటికే హాల్లో కూర్చున్న వాళ్ళంతా వాళ్ళచుట్టూ మూగి, చోద్యం చూస్తున్నారు.

"ఏం జరిగింది?"

"దేనికలా కొట్టారు?"

"ఏంచేశాడు?" ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు జనం.

"ఇంకా ఏం చేస్తాడు? నా ప్రక్కనుంచి పోతూ, కోటు జేబులోంచి పర్సు కొట్టేశాడు."

"అబద్ధం! పచ్చి అబద్ధం! నేను వీడిపర్సు కొట్టలేదు" అరిచాడతను.

సంజయ్ జనంవైపు తిరిగి, "నామాట మీద విశ్వాసం లేకుంటే, మీరే వాడి జేబులు వెతకండి. ఆ పర్సులో నా ఫోటోతోబాటు మూడువందల అరవయి రూపాయల పదిహైసలున్నాయి" అన్నాడు.

"చూసుకోండి!" అంటూ చేతులు పైకెత్తాడతను.

జనంలోంచి ఇద్దరు ముందుకువచ్చి, అతని జేబులు గాలించి, ఓ నల్లరంగు పర్సుతీసి చూశారు. అందులో సంజయ్ ఫోటో, అతను చెప్పినంత డబ్బు బయటపడ గానే ఆ వ్యక్తితోబాటు అందరి నోళ్ళూ తెరుచు కున్నాయి.

"నిజమే, పర్సు కొట్టేశాడు. తన్నండి వెధవని."

"కుమ్మండి బ్రూట్ ని!"

"పోలీసుల కప్పగించండి! పోలీసుల కప్పగించండి" అరుస్తున్నారు జనం.

"చాలు చాలు! నేనిచ్చిన డోస్ తో వాడీ జన్మలో మళ్ళీ దొంగతనం జోలికిపోతే ఒట్టు. కోర్టుల చుట్టూ

తిరిగే తీరిక లేదు నాకు. వాణ్ని వెళ్ళనివ్వండి'' అన్నాడు సంజయ్ మధ్యలో.

ఆ వ్యక్తి అతన్ని నమిలి మింగేసేలా చూస్తున్నాడు. సంజయ్ అదేమీ పట్టించుకోకుండా తనపర్సు జేబులో వేసుకుంటూ లిఫ్ట్ వేపు నడిచాడు. నిజానికా పర్సు తన హస్తలాఘవంతో ఆ వ్యక్తి జేబులోకి చేర్చింది అతనే!

గదిలో అడుగుపెట్టిన సంజయ్‌నిచూసి, ''బట్టలన్నీ అలా నలిగి వున్నాయేమిటి?'' అడిగాడు డిటెక్టివ్ ఉత్తమకుమార్.

''అ...అబ్బే! కింద ఓ గర్ల్ ఫ్రెండ్‌తో డాన్స్ చేస్తూ ఆర్కెస్ట్రా మ్యూజిక్ స్పీడందుకునేసరికి నాకు తెలియకుండానే భరతనాట్యం ప్రారంభించాను. బూటు బెణికి బొక్కబోర్లా పడ్డాను. అందరూ కలిసి లేపేసరికి అవతారం ఇలా తయారయింది.''

''బొంకక! ఎవ్వరితోనో పోట్లాడి వస్తున్నావ్ కదూ?''

''మీకెలా తెలిసింది?'' అడిగాడు సంజయ్ ఆశ్చర్యంగా.

''నీ కుడిచేతి పిడికిలి చూసుకో! వేళ్ళభాగం వాచి వుంది. కమిలివుంది. ఈ నిదర్శనం చాలదూ?''

నీళ్ళు నమిలాడు సంజయ్.

''జాగ్రత్త! ఇది పరాయి ప్రదేశం! అనవసరంగా ఎవరితోనూ ఘర్షణ పడొద్దని ముందే నచ్చచెప్పాను. మన మిక్కడికి ఫైటింగ్ ప్రాక్టీస్‌కు రాలేదు. విశ్రాంతి కోసం వచ్చాం!''

''అదికాదుసార్!'' అంటూ ప్రేరితతో తన పరిచయం, ఇన్నిరోజుల స్నేహం, హఠాత్తుగా ఈరోజు ఆమెలో వచ్చిన మార్పు, ఆ ఆగంతకుడితో ఘర్షణ మొదలయిన వన్నీ పూసగుచ్చినట్టు వివరించాడు సంజయ్.

అంతావిన్న డిటెక్టివ్ ఉత్తమ్‌కుమార్ సాలోచనగా తలూపి, "విషయం ఆసక్తికరమైనదే! ఒప్పుకుంటాను. ఐనా, ఆ అమ్మాయి మనసులో మనకు నిమిత్తం లేదు. ఇప్పుడామె నీనుంచి దూరంగా వుండడానికి ప్రయత్నిస్తున్నప్పుడు, నువ్వామెపట్ల ఇంట్రస్టు చూపడం అవివేకమే అవుతుంది. బట్టలు మార్చుకుని బుద్ధిగా పడుకో!" అన్నాడు సిగరెట్ అంటిస్తూ.

ఆరాత్రి చాలా పొద్దుపోయే వరకూ నిద్రపట్టలేదు సంజయ్‌కు.

ఆ అమ్మాయి విచిత్ర ప్రవర్తనే అతన్ని తీవ్రంగా ఆలోచింప చేస్తోంది. ముక్కూ, మొహం తెలియని ఆ ఆగంతకుడు ఆమెకు దూరంగా వుండమని తనకెందుకు హెచ్చరించాడు? ఆమెకూ, అతనికీ ఏమిటి సంబంధం? ఇన్నాళ్లూ ఒంటరిగా వుంటున్న ప్రేరిత దగ్గరికి, పానకంలో పుడకలాగా అతనెక్కణ్ణించి వచ్చాడు?

ఇలాటి సందిగ్ధమయిన సందేహాలతో చాలాసేపు సతమతమవుతూ నిదరలోకి జారుకున్నాడు సంజయ్.

## 2

ఉదయం నిద్ర లేచేసరికి తొమ్మిది గంటలయింది.

అప్పటికే ఉత్తమ్‌కుమార్ స్నానపానాదులు ముగించి న్యూస్ పేపర్ చూస్తూ కూర్చునున్నాడు సోఫాలో. ఆ హోటల్ వెనకే విశాలమైన స్విమ్మింగ్ పూల్ వుంది. దాదాపు చాలామంది యువతీ యువకులు వుదయంపూట అందులోనే స్నానాలు చేస్తూంటారు.

సంజయ్ కూడా ఆ స్విమ్మింగ్ పూల్ కలవాటు పడిపోయాడు. మంచం దిగి, స్లీపింగ్ గౌను తొడుక్కుని,

టవల్ అందుకుని స్విమ్మింగ్ పూల్ కు బయలుదేరాడు సంజయ్.

అప్పటికే చాలమంది యువతీ యువకులు అక్కడ ఈతకొట్టి, నీరెండలో తడి శరీరాలు పొడి చేసుకుంటున్నారు.

హఠాత్తుగా సంజయ్ దృష్టి గత రాత్రి తన చేత దెబ్బలు తిన్న వ్యక్తిమీద పడింది. క్షణంపాటు అతన్ని గుర్తించలేక పోయాడు సంజయ్. కారణం, ఇప్పుడా వ్యక్తి తన గుబురు మీసాలు నున్నగా గీసేసుకున్నాడు.

అందుక్కారణం ఏమిటో ఊహించగలిగేడు సంజయ్. రాత్రి అతను చాలామంది మనుష్లో దొంగగా ముద్రింపబడ్డాడు. వాళ్ళెప్పుడు తనను గుర్తించకూడదన్న ఉద్దేశంతోనే మీసాలు తీసేసుంటాడు. ప్రేరిత కూడా ఇక్కడే వుందా? అనుకుంటూ చుట్టూ కలయచూసాడు.

కనిపించింది. ఓపక్క స్విమ్మింగ్ డ్రెస్ లో యెండ కాచుకుంటూ కూర్చునుంది. అంతవరకూ ఇటే చూస్తున్నదల్లా, అతనటు చూడగానే చటుక్కున కళ్ళు తిప్పుకుంది!

కొందరు యువతీ యువకులు స్విమ్మింగ్ పూల్లో డయివింగ్ చేస్తున్నారు. అందులో ఏ ఒక్కరూ గాలిలోకి ఎగిరి పల్టీలువేసి డైవ్ కొట్టడం లేదు. చిన్నగా నవ్వుకుంటూ బట్టలు విప్పి, డ్రాయర్ మీద మెట్లవెపు నడిచేడు సంజయ్. మెట్లెక్కి పైకి చేరుకున్నాడు.

అక్కడ కూర్చున్న వాళ్ళందరి చూపులూ అతనివైపు మళ్ళాయి.

సంజయ్ ఛెంగున ఎగిరి ఓపిల్లిమొగ్గ వేసి, డైవ్ కొట్టాడు నీటిలోకి. ప్రేక్షకుల కరతాళ ధ్వనులు మారుమోగాయి.

సంజయ్ నీళ్ళలోంచి పైకి తేలి, ఈదుకొంటూ స్విమ్మింగ్ పూల్ రౌండ్ కొట్టి తిరిగి మెట్లని సమీపించాడు.

అదే సమయంలో ఓ అందమయిన అమ్మాయి సంజయ్ లాగా గాలిలో పల్టీ వేసి, నీళ్ళలో పడింది. అదిచూసి సంజయ్ కూడా వెంటనే పైకి చేరుకున్నాడు. ఈసారి అతను శూన్యంలో రెండు పిల్లి మొగ్గలు వేసి డైవ్ కొట్టాడు. ఆ అమ్మాయి కూడా పైకివచ్చి, రెండుపల్టీలు కొట్టి నీళ్ళలో దూకింది.

అలా ప్రారంభమయింది ఆ ఇద్దరిమధ్య పోటీ! కానీ, ఆ అమ్మాయి మూడుపల్టీలకు మించి వెయ్యలేక పోతోంది. సంజయ్ పట్టుదలగా ఐదు పల్టీలు కొట్టగలిగేడు గాలిలో. అప్పటికే ఇద్దరూ బాగా అలసిపోయి, పోటీ విరమించారు.

సంజయ్ టవల్‌తో ఒళ్లు తుడుచుకుంటూ వెళ్ళి ఎండలో పడుకున్నాడు. అయిదు నిమిషాల తర్వాత, డైవింగ్‌లో అతనితో పోటీపడ్డ అమ్మాయి తనవైపే వస్తూ కనిపించి, లేచికూర్చున్నాడు.

ఆమె చిరునవ్వుతో అతన్ని సమీపించి, "మీరు బాగా డైవ్ చేస్తారు సుమా!" అంది చలికిలబడుతూ.

సంజయ్ నవ్వి, "డయివింగ్‌లో నాకింకా అట్టే ప్రాక్టీస్ లేదు" అన్నాడు.

'మైగాడ్! ప్రాక్టీస్ లేకుండానే ఇంత బాగా డైవ్ చెయ్యగలిగితే, ప్రాక్టీసయ్యాక మీరు గాలిలో భరత నాట్యం మొదలెట్టినా ఆశ్చర్యంలేదు" అంది ఫక్కున నవ్వుతూ.

సంజయ్ సిగ్గుపడుతున్నట్లు అభినయం ప్రారంభించేడు.

"ఇంతకీ ఎక్కణ్ణించి వచ్చారుమీరు?"

"ఇంటినుంచి!"

"అదికాదండీ, ఏ ఊర్నించీ అని?"

"మద్రాసు!"

"నా పేరు దీప."

"నన్ను సంజయ్ అంటారు. మీ రెక్కడ్నించివచ్చారు?"

"మహాబలిపురం!"

"ఏం చేస్తుంటారు?"

"మా నాన్నగారు అక్కడ ఐరన్ ఫ్యాక్టరీలో ఛీఫ్ ఇంజనీర్ గా పనిచేస్తున్నారు."

"మా నాన్నగారుకూడా బ్రతికుంటే, ఇలాగే నేనూ తిని తిరిగేవాణ్ని!"

"సారీ. నేనింకా చదువుకుంటున్నాను."

సంజయ్ దృష్టి అనుకోకుండా ప్రేరిత కూర్చున్నవైపు మళ్ళింది. అంతవరకూ వీళ్ళిద్దర్నే కన్నార్పకుండా చూస్తున్న ఆ అమ్మాయి, చటుక్కున తల మరోవైపు తిప్పుకుంది.

"సంజయ్ గారూ! ఆ అమ్మాయిని చూశారా? చాలా సేపట్నించి గమనిస్తున్నాను. అదేపనిగా మిమ్మల్ని గుడ్లప్పగించి చూస్తోంది. పరిచయస్థురాలా?" అడిగింది దీప.

"లేదే!"

"ఆ అమ్మాయి దగ్గరున్న వానిటీబాగ్ లో చిన్నసైజు పిస్తోలుకూడా వుంటుంది ఎప్పుడూ!"

సంజయ్ ఉలిక్కిపడి, "మీ కెలా తెలుసు?" అడిగాడు ఆశ్చర్యంగా.

"మా గదులు ఒకే అంతస్థులో వున్నాయి. మొన్న అనుకోకుండా మేమిద్దరం ఒకేసారి లిఫ్ట్ లో పైకెళ్ళడం జరిగింది. లిఫ్ట్ లోంచి బయటపడుతుండగా తలుపుతగిలి

ఆమె హాండ్ బ్యాగ్ కిందపడి తెరుచుకుంది. ఆ తెరుచుకోడంలో, దాంట్లోంచి కొన్ని సామానులు యివతలకి వచ్చాయి. వాటిలో చిన్న సైజు పిస్తోలుకూడా వుంది. అప్పుడు చూశాను.''

"ఈమధ్య సిగరెట్ లైటర్లుకూడా పిస్తోళ్ళ ఆకారాల్లో వస్తున్నాయి. బహుశా మీరు చూసింది అదేనేమో?''

"ఏమో! మొత్తానికి ఆ అమ్మాయి నాకెందుకో చాల విచిత్రంగా తోస్తోంది సుమండీ!'' అంది దీప స్వరం తగ్గించి.

సరిగ్గా అదే సమయంలో, వాళ్ళకు దూరంగా కూర్చున్న ఆ వ్యక్తి లేచి, హోటల్ వైపు వెళుతూ కనిపించాడు సంజయ్‌కి. అతనే అంతస్తులో, యే గదిలో వుంటున్నాడో తెలుసుకుందామని, తనూ లేచి, దీపదగ్గర సెలవు తీసుకుని అతన్ని వెంబడించాడు సంజయ్.

ఆ వ్యక్తి తిన్నగా మూడో అంతస్తు చేరుకుని, చిట్టచివరవున్న గదిలో ప్రవేశించాడు. ఆ గదికి నాలుగు గదుల ఇవతలే వుంది ప్రేరితగది!

సాలోచనగా తలూపుతూ వెనుదిరిగాడు సంజయ్. అవకాశం చూసుకుని ఆ వ్యక్తి గదిలో ప్రవేశించి గాలించాలి. అప్పుడు తెలుస్తుంది అతనెవరో?

## 3

ఆ సాయంత్రంకూడ సంజయ్ అలవాటు ప్రకారం బాల్ రూంలోకి వెళ్ళాడు. ప్రతి సాయంత్రం అక్కడేదో ఒక ప్రోగ్రాం వుంటుంది గనక, దాదాపు హోటల్లో

బసచేసే వాళ్ళంతా అక్కడచేరి ఆనందంగా గడుపుతూ వుంటారు.

అరోజు మిమిక్రీ షో వున్నట్టు బోర్డుమీద రాసుంది. షో యింకా ప్రారంభం కాలేదు. నిన్నటిలా మైక్ లోంచి మళ్ళీ రేపురాత్రి ప్రదర్శించబోయే 'విచిత్ర నర్తకుల' ప్రోగ్రాం గురించి ఎనౌన్స్ చేస్తున్నారు.

సంజయ్ దృష్టి అప్పుడే బాల్ రూంలో ప్రవేశిస్తున్న ప్రేరితమీద పడింది. ఆ వ్యక్తికూడా అక్కడున్నాడేమోనని చుట్టూ కలయజూసాడు. కనిపించలేదు.

ప్రేరిత సంజయ్ ముందునించే వెళ్ళినా, అతనివైపు కన్నెత్తికూడా చూళ్ళేదు.

కాస్సేపటికి మిమిక్రీ షో ప్రారంభమయింది.

సంజయ్ దృష్టి స్టేజిమీద లేదు. ఆ వ్యక్తికోసం గాలిస్తోన్నాయి చూపులు. ప్రేరితవచ్చి ఇంతసేపయినా అతని అయిపులేదు! నగరంలో కెళ్ళాడా? అయితే అతని గది గాలించడానికిదే అదను.

అనుకుంటూ లేచి, లిఫ్ట్ వైపు నడిచాడు సంజయ్. తిన్నగా మూడో అంతస్థు చేరుకొని, చిట్టచివరి గదిని సమీపించాడు. తలుపు మూసుంది. అవి డోర్ లాక్ సిస్టం తలుపులు. మూయగానే క్లిక్ మంటూ ఆటోమేటిక్ గానే లాక్ పడిపోతుంది.

ఓమారు చుట్టూ కలయచూసాడు. క్రింద ప్రోగ్రాం జరుగుతోంది గనక, నడవాలో జనసంచారంలేదు. జేబులోంచి తాళంచెవుల గుత్తితీసి, మాస్టర్ కీ అందుకొని లాక్ హోల్లో దూర్చాడు.

రెండు నిమిషాల ప్రయాసతో క్లిక్ మంది లాక్! పిడి తిప్పి మెల్లగా తోసాడు తలుపు. కిర్రుమంటూ తెరుచు

కుంది. లోన అడుగుపెట్టి కొయ్యబారిపోయాడు సంజయ్.
గదిమధ్యలో సోఫాలో అటుతిరిగి కూర్చునున్నా రెవరో!

అతనేనా? తను పొరబడ్డాడా? అతను సిటీకెళ్ళ లేదా? తను మాస్టర్ కీతో లాక్ తెరిచినప్పుడు క్లిక్ మన్న చప్పుడయింది. తలుపు తోసినప్పుడు కిర్రుమన్న చప్పుడయింది. అయినా ఇతను బెల్లంకొట్టిన రాయిలా కూర్చునున్నాడేమిటి?

అనుమానం వేసి, అడుగులో అడుగు వేసుకుంటూ పిల్లిలా సోఫా దగ్గరికి నడిచేడు. సోఫాని సమీపించి అతన్ని చూడగానే సంజయ్ గుండె ఒక్కసారి ఆగి, తిరిగి కొట్టుకోసాగింది.

అతను సజీవంగా లేడు! రక్తసిక్తమయిన బట్టలతో నిర్జీవంగా కూర్చున్నాడు సోఫాలో. తల సోఫా వెనక ఆనించి వుంది. కళ్లు రెండూ తెరచి కిటికీని చూస్తు న్నాయి. సరిగ్గా గుండెదగ్గిర గాయం! లోతైన గాయం! ఆ గాయంగుండా కారి, షర్టుని ముద్దచేసిన రక్తం.

అనుభవాన్ని బట్టి, అది కత్తిపోటువల్ల ఏర్పడ్డ గాయ మని క్షణంలో గ్రహించాడు సంజయ్. హంతకుడా కత్తిని అలాగే వదలకుండా తనవెంట తీసికెళ్ళాడు.

ఇక ఒక్కక్షణంకూడ అక్కడుండకూడదు. చటుక్కున వెనుదిరిగి గబగబ తలుపువైపు నడిచాడుసంజయ్. డోర్ కొద్దిగా తెరచి, నడవాలోకి తొంగిచూసాడు. ఎవ్వరూ కనిపించకపోయేసరికి చటుక్కున బయటికెళ్ళి తిరిగి తలుపు మూసేశాడు.

వడివడిగా అడుగులు వేసుకుంటూ లిఫ్టును సమీపించి, చకచక నాలుగో అంతస్థు చేరుకున్నాడు.

అప్పుడే గదిలోంచి బయటకు వస్తోన్న డిటెక్టివ్ ఉ త్తమకుమార్, సంజయ్ హడావుడిచూసి, "ఈరోజు తొందరగా వచ్చేస్తున్నావే?" అన్నాడు.

"అబ్బే, ఏంలేదు! ఒంట్లోకాస్త నలతగా వుంటేనూ" అని వాక్యం పూర్తిచెయ్యకుండా గదిలో ప్రవేశించాడు సంజయ్.

"రాత్రిళ్లు ఎక్కువ మేలుకోవద్దంటే విన్నావా? ఓ అనాల్జిన్ మాత్ర వేసుకుపడుకో" అంటూ బయటికెళ్ళి పోయాడు ఉత్తమకుమార్.

సంజయ్ తలుపులు దగ్గరగావేసి సోఫాలో చతికిల బడ్డాడు. అప్పుడుగానీ అతని మానసికస్థితి ఓ కొలిక్కి రాలేదు. ఆ వ్యక్తిని ఎవ్వరు హత్యచేశారు? యెందుకు చేశారు? అపరిచితుడిలాగే నటిస్తూ అతను ప్రేరితను నీడలా దేనికి కనిపెట్టుకునుండే వాడు?

ఇలా సాగుతున్నాయి సంజయ్ బుర్రలో సవాలక్ష ఆలోచనలు. వేటికీ సరయిన సమాధానం దొరకడంలేదు. అలా గంటగడిచి వుంటుంది. అంతలో బయట హడావుడిగా అటూయిటూ పరిగెత్తుతూ మాట్లాడుకోడం విని పించింది.

తలుపు తెరుచుకున్న చప్పుడయి వెనుదిరిగి చూశాడు సంజయ్.

డిటెక్టివ్ ఉత్తమకుమార్ లోన అడుగుపెట్టి, "గత రాత్రి నీతోఘర్షణపడ్డ వ్యక్తి తనగదిలో చచ్చిపడున్నా డట. స్టీవార్డ్ద్వారా ఈసంగతి తెలియగానే, హోటల్లో పెద్ద దుమారం బయలదేరింది. కాసేపట్లో పోలీసులిక్కడికి రాబోతున్నారు.

ఆ వ్యక్తికీ, నీకూ జరిగిన ఘర్షణ గురించి జనం చెవులు కొరుక్కుంటున్నారు. ఆ సంగతి పోలీసుల చెవినబడితే, అనవసరంగా నీ పీకమీదికి రావచ్చు'' అన్నాడు.

''రానివ్వండి! పోలీసుల్ని యెలా ఆటపట్టించాలో నాకు తెలుసు.'' సంజయ్ ఇంకా ఏదో అనబోతుండగా టీపాయ్ మీది ఫోన్ మోగింది.

రిసీవర్ అందుకున్నాడు సంజయ్. ఆ కాల్ అతని పేరే వుందని చెప్పింది హోటల్ ఆపరేటర్.

''కనెక్టు చెయ్యండి!'' అన్నాడు.

మరుక్షణం అవతలినుంచి ఓ స్త్రీకంఠం వినిపించింది, ''మై స్వీట్ హార్ట్! నీ ఋణం ఎలా తీర్చుకోమంటావు? ఆ వరదరాజన్ బారినుంచి నన్ను విముక్తురాల్ని చేసినందుకు మెనీ మెనీ థాంక్స్. నాకోసం ఒక మనిషిని చంపగలిగిన నీకు ఏమిచ్చినా తక్కువే.''

''వాట్?'' అరిచాడు సంజయ్.

అవతల క్లిక్‌మంది.

''హలో ఆపరేటర్! ఆ కాల్ ఎక్కణ్నించివచ్చింది నాకు?'' అడిగాడు సంజయ్.

''సారీ చెప్పడం కష్టం!''

''ఈ హోటల్లోంచి రాలేదా?''

''నో! ఔట్‌సైడ్ కాల్!''

''కొంపదీసి, పొరపాట్న నాకు కనెక్టు చేయలేదు కదా?''

''రూం నెంబర్ 110 నించేకదూ మీకు మాట్లాడు తోంది.''

''ఔను.''

''ఐతే, అది మీ కాలే!''

రిసీవర్ దించి లేచాడు సంజయ్.

"ఏమిటి కథ?" అడిగాడు ఉత్తమ్‌కుమార్.

సంజయ్ జరిగింది వివరించి, "ఆమె ఎవ్వరో నాకు తెలీదు. ఆ కంఠాన్ని నేనింతవరకూ విన్లేదు!" అన్నాడు.

"కంఠాలుమార్చి మాట్లాడటం ఏమంత కష్టమయినపని కాదు. నువ్విక్కడే వుండు. నేవెళ్ళి శ్రీరితను చెక్ చేసి వస్తాను. గదిలో ఆమెవుంటే, ఆ ఫోన్ చేసిన స్త్రీ ఆమె కాదని స్పష్టమౌతుంది. కారణం ఔట్ సైడ్ నుంచిఫోన్ చేసి, ఇంత త్వరగా సిటీనుంచి ఎవ్వరూ తిరిగిరాలేరు.

ఈ సంఘటనతో నువ్వు పోలీసుల దృష్టిలో నానడం మాత్రం ఖాయం. ఎందుకంటే, ఆ కాల్ గురించి నువ్వు ఆపరేటర్ని తరచి తరచి ప్రశ్నించావ్. ఈ విషయాన్ని ఆమె అంత త్వరగా మర్చిపోదు. వెయిట్ మి!" అంటూ బయటకి నడిచాడు ఉత్తమ్‌కుమార్.

# 4

తీవ్రంగా ఆలోచిస్తూ సోఫాలో చతికిల బడ్డాడు సంజయ్. ఐదు నిమిషాలతర్వాత, ఎవరో దబదబ తలుపు బాదిన శబ్దం వినిపించింది.

"ఎస్, కమిన్" అన్నాడు.

తలుపు తోసుకుంటూ హడావుడిగా లోనికి వచ్చింది దీప. ఆయాసంతో ఆమె ఛాతీ ఎగిసిపడుతోంది.

"హలో మీరా! రండి, కూర్చోండి. ఎందుకలా గాభరా పడుతున్నారు?" అడిగాడు సంజయ్.

ఆమె సోఫాలో కూలబడుతూ, "అతికష్టంమీద మీ గది కనుక్కోగలిగాను. మీకా వ్యక్తి హత్యగురించి ఇంకా తెలీదా?" అడిగింది.

"తెలిసింది." అన్నాడు సంజయ్ చాలా నింపాదిగా.

"పోలీసులు వచ్చేశారు. గతరాత్రి మీరనితో ఘర్షణ పడ్డ సంగతి చెప్పేశారు ప్రత్యక్ష సాక్షులు."

"ఆ సమయంలో అతనికి అందమైన మీసాలుండేవనీ, ఇప్పుడా మీసాలు తీసివేయబడ్డాయనీ చెప్పలేదావాళ్లు?"

"చెప్పారు! ఐనా...." దీప కంఠంలో అనుమానం తొంగిచూసింది.

"అర్థమయింది! ఆ హత్యలో నా చెయ్యిందేమోనని మీరనుమాన పడుతున్నారు కదూ?"

"నో, నో. ఆ హత్యావార్త మీవరకు చేరవెయ్యాలనే ఇలా పరిగెత్తుకొచ్చాను. ఈరోజు మధ్యాహ్నం లంచ్ తీసుకుంటున్నప్పుడు డైనింగ్ హాల్లో ఆ వ్యక్తి నాతో మాట్లాడాడు."

"ఏమని?"

"మీతో నాకు పూర్వ పరిచయముందా అని అడిగాడు."

"మీరేమన్నారు?"

"లేదు, ఈరోజే స్విమ్మింగ్ పూల్ దగ్గర స్నేహమయిందన్నాను."

"ఆల్ రైట్! ఇక వెళ్ళండి. పోలీసులు ఏ క్షణంలో నయినా నాకోసం ఇక్కడికి రావచ్చు."

"పోలీసులంటే మీకు భయంలేదా?"

"లేదు, అందమైన అమ్మాయిలంటేనే చచ్చేభయం"

"పోలీసులు మిమ్మల్ని అనుమానంమీద అరెస్ట్ చేస్తే?"

"మరీ మంచిదే! కనీసం ఈ హోటల్ ఖర్చులయినా కలిసి వస్తాయి. హాయిగా ప్రభుత్వం ఆతిథ్యం స్వీకరిస్తూ

ఇక్కడి ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తాను. ఇక వెళ్ళండి!"

"ఆల్ రైట్" అంటూ లేచి వెళ్ళిపోయింది దీప.

ఆమె వెళ్ళిన ఐదు నిమిషాలకే, ఓ కానిస్టేబుల్ గది లోకి వచ్చి, "సంజయ్ గారు మీరేనా?" అడిగారు.

"ఔను, ఏం?"

"మిమ్మల్ని ఇన్ స్పెక్టర్ పిలుచుకురమ్మన్నారు."

"ఎందుకూ?"

"తెలీదు. మేనేజర్ గదిలో వున్నారాయన."

"పద," అంటూ లేచాడు సంజయ్.

అదే సమయంలో డిటెక్టివ్ ఉత్తమ్‌కుమార్ వచ్చేడు గదిలోకి. "మేనేజర్ గదిలో పోలీసులు నీ కోసం ఎదురు చూస్తున్నారు. సవాలక్ష ప్రశ్నలతో విసిగించి ఇప్పుడే వదిలిపెట్టారు నన్ను. వెళ్ళి వాళ్ళనెలా ఎదుర్కొంటావో చూడు."

సాలోచనగా తలూపుతూ కానిస్టేబుల్ వెంట బైటికి నడిచాడు సంజయ్. మేనేజర్ గదిలో ఓ ఇన్ స్పెక్టర్, సబిన్ స్పెక్టర్, ఇద్దరు సార్జంటులూ అతనికోసం ఎదురు చూస్తున్నారు.

"హంతుడు వరదరాజన్‌తో మీ కెప్పట్నుంచి పరిచయం?" అడిగాడు ఇన్ స్పెక్టర్.

"నా జీవితంలో అతన్ని మొదటిసారి చూసింది నిన్న రాత్రే!"

"రాత్రి ఎందుకు కొట్టేరతన్ని?"

"పర్సు కాజేసినందుకు."

"అతను మీ పర్సు కాజేసాడనడానికి ఏమిటి సాక్ష్యం? ఆ సమయంలో అక్కడెవరున్నారో చూపించగలరా?"

"చాలామందే వున్నారు. వాళ్ళందర్నీ జ్ఞాపకం పెట్టు కొనే స్థితిలో నేను లేనప్పుడు!"

"ఐతే, తాగివున్నారన్న మాట."

"కాదు, కోపంలో వున్నాను."

"ఆకోపం ఇప్పటికీఅలాగే వుండిపోయిందన్నమాట."

"సారీ, మీ ప్రశ్న నాకర్థం కాలేదు."

"అవుతుంది. ఇంతవరకూ మీ రెక్కడున్నారు?"

"నా గదిలో."

"మధ్యలో ఎక్కడికీ వెళ్ళలేదా?"

"నో!"

"ఆల్ రైట్! మేము మీగది సోదా చెయ్యాలి!"

"సెర్చి వారంట్ వుందా?"

"ఓహో, సెర్చివారంట్ కావాలన్నమాట తమరికి?"

"అక్కర్లేదనుకున్నారా? ఆ మాత్రం రూల్సు వాకూ తెలును!"

"అయితే, రూల్సు తెలిసిన వాళ్ళతో మేమెలా ప్రవర్తిస్తామో కూడా తెలుసనుకుంటాను."

అదే సమయంలో డిటెక్టివ్ ఉత్తమ్‌కుమార్ వచ్చాడక్కడకి.

"మేము మీగది సోదాజెయ్యడానికి రూల్సుప్రకారం సెర్చివారంట్ అడుగుతున్నాడు మీ మిత్రుడు. అలాగే, రూల్సుప్రకారం అరెస్ట్ వారంట్ లేకుండా కేవలం అనుమానంమీద ఈయన్ని అరదండాలతో అలంకరించి తీసికెళ్ళాలనుకొంటున్నాము. మీ రేమంటారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

ఉత్తమ్‌కుమార్ సంజయ్‌ని నాలుగు చీవాట్లుపెట్టి, "ఎక్స్‌క్యూజ్ మీ ఇన్‌స్పెక్టర్! అమావాస్య, పున్నమి

రాత్రుల్లో వచ్చాడు కాస్త తలతిక్కగా మాట్లాడుతుం టాడు. ఆగది నాపేర వుంది గనక, మీరు నిస్సంకోచంగా సోదా చేసుకోండి'' అన్నాడు.

''థాంక్స్!'' అంటూ లేచాడు ఇన్‌స్పెక్టర్.

మరుక్షణం పోలీసు పటాలం వారి గదిలో ప్రవేశించి, అంగుళం వదలకుండా గాలింపు చర్య ప్రారంభించింది. అనుమానాస్పద వస్తువేదీ దొరకలేదు.

దాంతో ఇన్‌స్పెక్టర్ నిరుత్సాహపడి, ''ఆల్ రైట్! మా అనుమతి లేనిదే మీరీవూరు విడిచి వెళ్ళడానికి వీలు లేదు.'' అంటూ హెచ్చరించి వెళ్ళిపోయాడు.

ఉత్తమకుమార్ తలుపు గడియవేసి, సంజయ్‌ని సమీపించేడు. అతని మొహం జేవురించి వుంది. జేబులోంచి కర్చీఫ్‌లో చుట్టివున్న పొడుగాటి వస్తువుతీసి, ''ఏమిటిది?'' అన్నాడు తీక్షణంగా.

ఆ వస్తువు చూడగానే సంజయ్ నోరు తెరుచుకుంది.

అది కత్తి! రక్తసిక్తమైన కత్తి!!

''ఎక్కడ దొరికింది?'' అడిగాడు ఆశ్చర్యంగా.

''ఈ గదిలోనే!''

''ఈ గదిలోనా?''

''ఔను. అదుగో ఆ సోఫాకింద! హతుడి గుండెలో వుండవలసిన కత్తి ఇక్కడికెలా వచ్చింది?''

ఆ సోఫావైపు చూసి ఉలిక్కిపడ్డాడు సంజయ్. ''మైగాడ్! మీరు బైటికెళ్ళిన సమయంలో దీపవచ్చి ఆ సోఫాలో కూర్చుంది. కొంపదీసి...''

''దీప ఎవ్వరు? ఎలా పరిచయమైంది నీకు?''

చెప్పాడు సంజయ్.

''ఎన్నాళ్ళనించీ వుంటోందిట ఇక్కడ?''

"తెలీదు. ఆమెదీ ఊరుకాదు. మహాబలిపురం! వాళ్ళ నాన్న అక్కడి ఐరన్ ఫ్యాక్టరీలో చీఫ్ ఇంజనీర్ గా పనిచేస్తున్నాడుట."

"సంజయ్! నీకు మతిపోయిందా? మహాబలిపురంలో ఐరన్ ఫ్యాక్టరీ ఏమిటి? ఇంతక్రితం కంఠంమార్చి నీకు ఫోన్ జేసిన స్త్రీ కూడా ఆమే అయుంటుంది. ముందు మనం ప్రేరితను అనుమానించాం! నేవెళ్ళి చెక్ జేస్తే, ఆమె తన గదిలోనే వుందప్పుడు. దేనికైనా మంచిది, ఈ ఇద్దరమ్మాయిల్నీ ఓ కంట కనిపెడుతుండాలి!

అనుకోకుండా మనమీ రొంపిలో దిగబడ్డాం గనక, దీని అంతు చూడందే ఇక్కణ్నించి కదలకూడదు." అన్నాడు ఉత్తమ్‌కుమార్ దృఢంగా.

## 5

"ఈ రాత్రి హోటల్లో విచిత్ర నర్తకుల ప్రోగ్రాం వుంది. రెండు రోజుల్నించీ ఆ ప్రోగ్రాం గురించి ఎనౌన్స్ చేస్తున్నారు. వెళ్దామా?" అడిగాడు సంజయ్.

"విచిత్ర నర్తకులు! పేరు క్యూరియస్ గా వుంది. చూడాలి!" అంటూ లేచాడు ఉత్తమ్‌కుమార్.

ఇద్దరూ లిఫ్ట్‌లో కిందికి చేరుకని, హాల్లో ప్రవేశించారు. అప్పటికే హాలు జనంతో కిటకిటలాడుతోంది. ఒకటీ అరా తప్ప కుర్చీలన్నీ నిండుకున్నాయి. ఓచోట రెండు కుర్చీలు ఖాళీగా వుంటే వెళ్ళి చతికిలబడ్డారు.

స్టేజిమీద సన్నగా ట్యూన్ అవుతోంది ఆర్కెస్ట్రా. మైక్‌లో మాటిమాటికీ ఎనౌన్స్ చేస్తున్నారు, ఎనిమిది గంటలకు ప్రోగ్రాం ప్రారంభమాతుందని. ప్రేక్షకులంతా ఊపిరి బిగబట్టి ఎదురు చూస్తున్నారు ఆ విచిత్ర నర్తకుల్ని వీక్షించడానికి!

ఎనిమిది గంటలకు ఒక నిమిషం వుందనగా, ఆరు చక్రాల కుర్చీలు తోసుకుంటూ స్టేజిమీదికి వచ్చారు హోటల్ సిబ్బంది. ఆ కుర్చీల్లో ముగ్గురు యువతులూ, ముగ్గురు యువకులూ కూర్చునున్నారు.

కేవలం కనురెప్పలు కదలడంతప్ప వారి శరీరంలో ఏమాత్రం చలనం లేదు. పక్షవాతం సోకిన రోగుల్లా, ఎన్నో ఏళ్ళనించి అన్నపానాలూ, నిద్రాహారాలూ లభ్యం కాని మనుషుల్లా నీరసంగా, బలహీనంగా కనిపిస్తున్నారు.

"ఈ పీనుగులా నాట్యం చేసేది?" అన్నాడు సంజయ్ ఆశ్చర్యంగా.

అదే సమయంలో మైక్‌లోంచి ఎనౌన్సర్ కంఠం వినిపించింది. "డియర్ ఫ్రెండ్స్ చూడండి. వీళ్ళే ఆ విచిత్ర నర్తకులు! నిర్జీవ నర్తకులు!!

ప్రేక్షక మహాశయుల్లో కొందరు డాక్టర్లుకూడా వుండి వుంటారు. దయచేసి, వారు స్టేజిమీదికి వచ్చి, ఈ నర్తకుల్ని క్షుణ్ణంగా పరిశీలించవలసిందిగా మనవి చేసుకుంటున్నాం! ఈ స్థితిలో వున్న ఏ మనిషీ, నాట్యం చెయ్యడం అటుంచి, కూర్చున్న చోటినించి లేచి నిలబడే ధైర్యంకూడా చెయ్యలేడని నిస్సందేహంగా చెప్పవచ్చు. కాని, ఈ స్థితిలో వున్న ఈ నర్తకులు, మేమిచ్చే ఎనర్జిన్ అనే మందు తాగి, తుఫానుతో పోటీపడుతూ నాట్య ప్రదర్శన ఇచ్చి మిమ్మల్ని దిగ్భ్రాంతుల్ని చెయ్యగలరు! ప్రేక్షకుల సంతృప్తికోసం డాక్టర్ మహాశయులు వీళ్ళని ఒకసారి పరీక్షించవలసిందిగా మరోసారి కోరుకుంటున్నాం!"

హాల్లో గుసగుసలు ప్రారంభమయ్యాయి. అక్కడక్కడా కొందరు లేచి నిలబడ్డారు. ఈ అవకాశాన్ని

సన్నివియోగం చేసుకోవాలనుకున్నాడు ఉత్తమ్‌కుమార్. తనూ లేచి, ఆ డాక్టర్లతో బాటు స్టేజివైపు నడిచేడు.

ప్రేక్షకుల్లోంచి మొత్తం నలుగురు డాక్టర్లు లేచి వచ్చారు స్టేజిమీదికి. వంతులవారిగా ఒక్కొక్కరూ ఆ నర్తకుల్ని పరీక్షించడం ప్రారంభించారు. డిటెక్టివ్ ఉత్తమ్‌కుమార్ కూడా వాళ్ళతోబాటు పరీక్షిస్తున్నట్టు నటించసాగేడు. పదిహేను నిమిషాల తరవాత ముగిసింది పరీక్ష.

"గౌరవనీయులైన డాక్టర్ మహాశయులు, తమ నిర్ణయాలని, మిగతా ప్రేక్షకులకు విన్నవిస్తే బావుంటుందని మా అభిప్రాయం!" అన్నాడు అనౌన్సర్ మైక్‌లో.

డాక్టర్లు అక్కడే నిల్చుని తమలోతాము కాసేపు చర్చించుకుని ఓ నిర్ణయానికి వచ్చారు. వారిలో కాస్త వయసుమళ్ళిన డాక్టర్ ఒకరు మైక్ దగ్గరికెళ్ళి చెప్పసాగాడు.

"మేమా నర్తకుల్ని క్షుణ్ణంగా పరిశీలించాం! వాళ్ళు ఎంతోకాలం రకరకాల దీర్ఘరోగాలతో బాధపడి, ఈ మధ్య కోలుకున్నట్టు కనిపిస్తున్నారు. అంత మాత్రాన వారిలో లేచి నడవగలిగే శక్తి అవలేశమూ లేదిప్పుడు.

అటువంటి శల్యశరీరాలు తుఫానుతో పోటీపడుతూ నాట్యం ఎలా చేస్తారో మా కంతుబట్టకుండా వుంది. అటువంటి ప్రయత్నం ఏమాత్రం చేసినా, వాళ్ళ హార్ట్‌ఫేల్ కావడం మాత్రం ఖాయం! ఏది ఏమైనా, ఇటువంటి పరిస్థితిలో వాళ్ళు అటువంటి సాహసం చెయ్యడానికి డాక్టర్లుగా మేమనుమతించలేము!" అని స్టేజి దిగాడు డాక్టర్.

వెంటనే అనౌన్సర్ మైక్ దగ్గరికి వచ్చి, "ఫ్రెండ్స్! విన్నారుకదా, డాక్టర్ల అభిప్రాయం? అటువంటి శ

జీవులు ఇప్పుడు ఏ విధంగా శక్తిని పుంజుకుంటారో మీరే చూడండి!'' అంటూ రెండుసార్లు చప్పట్లు చరిచాడు.

వెంటనే ఓ బట్లర్ ఓ ట్రాలి తోసుకుంటూ వచ్చాడక్కడికి. ఆ ట్రాలీపైన ఆరు గ్లాసులున్నాయి. వాటిలో చిక్కని నారింజరంగు ద్రవం వుంది.

"చూడండి, ఆ గ్లాసులో వున్న ద్రవం పేరే ఎనర్జీన్! దాన్ని తాగాక, ఆ శక్తిహీనులు ఎలా మారిపోతారో ప్రత్యక్షంగా వీక్షించండి'' అన్నాడు ఎనౌన్సర్.

చక్రాల కుర్చీలు తోసుకొచ్చిన బట్లర్లు తలో గ్లాసు ఎత్తి నర్తకుల కందించారు. వాళ్ళా గ్లాసులు పట్టుకున్న తీరు చూస్తోంటే ఏ క్షణంలోనైనా అవి పట్టుతప్పి కింద పడేట్టున్నాయి. బట్లర్ల సహాయంతోనే వాళ్ళాగ్లాసులెత్తి మందు తాగగలిగారు.

మరుక్షణం స్టేజిమీంచి ట్రాలీ తొలగించబడింది. బట్లర్లు తలోవైపు తప్పుకున్నారు. స్టేజి నాలుగు వైపులా ఫడ్ లైట్స్ వెలిగాయి. అంతవరకూ సన్నగా మోగుతున్న ఆర్కెస్ట్రా ఇప్పుడు తారస్థపికప్ అందుకుంది. డాక్టర్లందరూ తమ తమ సీట్లలోకి వచ్చారు.

అలా ఐదు నిమిషాలు గడిచి వుంటాయి. క్రమక్రమంగా మ్యూజిక్ క్లైమాక్స్ నందుకుంది.

అంతే! అంతవరకూ నిర్జీవంగా చక్రాల కుర్చీల్లో చతికిల బడున్న ఆ నర్తకులు మెరుపు తీగల్లా ఛెంగున స్టేజి మీదికి గెంతారు. పది నిమిషాల క్రితం కాంతిహీనంగా, డస్సిపోయినట్టున్న వాళ్ళ మొహాల్లో ఇప్పుడు దివ్య తేజస్సు ప్రస్ఫుటమౌతోంది!

ప్రేక్షకులంతా కళ్ళు విప్పార్చి, చూడసాగారు స్టేజి వైపు. ఆర్కెస్ట్రా కనుగుణంగా నర్తకులు ప్రదర్శిస్తున్న

నాట్యం అందర్నీ చకితుల్ని జేస్తోంది. క్రమక్రమంగా మ్యూజిక్ వేగం అందుకుంటోంది. వాద్యగాళ్లు చమటలో తడిసిపోతున్నారు. విపరీతంగా ఆయాసపడిపోతున్నారు.

"ఐనా, నర్తకుల్లో ఏమాత్రం నీరసం కనపించడం లేదు. క్లారినెట్స్ వాయిస్తున్న వాద్యగాళ్ళ నోళ్ళు నెప్పెడుతున్నాయి. డ్రమ్స్ కొట్టేవాడి చేతులు మొద్దుబారుతున్నాయి. నర్తకులు వాళ్ళ ననుసరించడంలేదు. వాళ్ళే నర్తకుల్ని ఫాలో అవుతున్నారు.

భుజం తిమ్మిరెక్కేసరికి వయొలెనిస్ట్ తన వాద్యాన్ని పక్కనపెట్టి ఉస్సూరుమంటూ కూలబడిపోయాడు. దాదాపు గంటవరకూ నడిచిందా నాట్యప్రదర్శన. ఆ తరవాత ఎక్కడివాళ్ళక్కడ నిలిచిపోయారు. ఆర్కెస్ట్రా ఆగిపోయింది. నర్తకులంతా ఒకే వరసలో స్టేజిమధ్య నిలబడి పోయారు.

మరుక్షణం వాళ్ళు కనిపించకుండా పైనించి తెర దిగింది.

ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో హాలు మారుమోగింది!

"ఫ్రెండ్స్! దేశంలో మొట్టమొదటిసారి ఈ కార్యక్రమం మీముందే ప్రదర్శింపబడిందని తెల్పడానికి చాలా గర్విస్తున్నాం! చూశారా, ఎనర్జిన్ మందు పుచ్చుకోగానే ఆ నిర్జీవుల్లో ఎలా జీవం పుంజుకుందో?

అంతకు ముందు వాళ్ళను పరీక్షించిన డాక్టర్లు, ఆ మనుషులు లేచి నిల్చోడానిక్కూడా శక్తిలేని వారనీ, నాట్యం చెయ్యడం అసంభవమనీ తమ అభిప్రాయాన్ని వెల్లడించారు కదా?

మానవ మేధస్సుకూ, కృషికీ అసంభవమన్నది వుందంటారా ఈ సృష్టిలో? శబ్దాన్ని మించిన వేగంతో పయ

నించే విమానాలని ఎవరు సృష్టించారు? వాయు వేగంతో నడిచే రైళ్లని ఎవరు కనిపెట్టారు? చంద్రమండలంలోనూ, చివరికి అంగారక గ్రహంలోనూ సంచరించి వచ్చే వాహనాల నెవ్వరు తయారుచేశారు?

మనిషి!

ఆ నిర్జీవ వాహనాల చలనానికి జీవం ఏమిటి?

ఇంధనం!!

ప్రాణరహితమైన ఆ యంత్రాల్లో అటువంటి చలనం సృష్టించగలిగిన మనిషి, తాను కేవలం అనారోగ్య కారణంగా, నిస్సత్తువతో పడివుండటమా? యంత్రాలకుమల్లే మానవ దేహంలోని అవయవాలకూ అద్భుత శక్తిని తెప్పించే ప్రక్రియ ఎందుకు కనిపెట్టకూడదు?

ఈ మోటివ్ మీదే పరిశోధనలు జరిపి, అహోరాత్రులు శ్రమించి, ఎన్నో ఏళ్ళ ప్రయాసతో ఎనర్జీన్ మందు కనిపెట్టారు ప్రొఫెసర్ విష్ణువరధన్! ఆ ప్రఖ్యాత కెమిస్ట్ గురించి తెలియని వారున్నారంటారా మీలో?

పేరు ప్రఖ్యాతల నాపేక్షించకుండా, తన మేధా సంపత్తిని కేవలం మానవ కళ్యాణానికే వినియోగించే వాళ్ళెంతమంది వుంటారీ లోకంలో? ఇదివరకు ఆయన కనిపెట్టిన - రకరకాల రుగ్మతల నరికట్టే మందులెన్నో మార్కెట్లో పోటాపోటీలుగా అమ్ముడుపోతున్నాయి.

ఈ ఎనర్జీన్ మందుకూడా అతి త్వరలో మార్కెట్ లోకి రాబోతోంది. ఎదురు చూడండి. మరిచిపోకండి. ఎనర్జీన్!''

''బావుంది! ఇంతా చేసి, పబ్లిసిటీ ప్రదర్శనా ఇది. రెండు రోజులుగా దీని గురించి ప్రకటిస్తోంటే, ఏప్రెల్ ఫూల్ చేస్తున్నారేమో అనుకున్నాను'' అన్నాడు సంజయ్.

"నా కిదంతా ఏప్రిల్ ఫూల్ గానే తోస్తోంది!" అన్నాడు ఉత్తమకుమార్ నవ్వుతూ.

"మొత్తానికి పబ్లిసిటీకోసం మంచి మార్గాన్నే ఎన్నుకున్నారు వెధవలు! ఈ దెబ్బతో ఆ మందు మార్కెట్లోకి రాగానే జనం ఎగబడి తన్నుకుపోరూ?"

సాలోచనగా తలూపాడు ఉత్తమకుమార్. అప్పుడే అతని దృష్టి, అంతక్రితం మైక్ లో మాట్లాడిన డాక్టర్ మీద పడింది.

"పద! ఆ డాక్టర్ తో కొన్ని విషయాలు చర్చిద్దాం!" అంటూ లేచి అటు నడిచాడు.

డిటెక్టివ్ లిద్దరూ వెళ్ళి, డాక్టర్ కెదురుగా కూర్చున్నారు.

"మాతోబాటు మీరూ ఆ నర్తకుల్ని పరీక్షించారు కదూ?" అడిగాడు డాక్టర్ ఉత్తమకుమార్ని పలకరింపుగా.

"ఔను. ఇప్పటికీ నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. ఆ స్థితిలో ఆ నర్తకులు ఆ విధంగా డాన్స్ ఎలా చెయ్యగలిగారంటారు?"

"నాకూ అదే అంతుబట్టడం లేదు. మొత్తానికి నావల్ల పెద్ద మూర్ఖత్వం జరిగిపోయింది."

"ఏమిటది?"

"వీళ్ళ ప్రదర్శన్ని పబ్లిసిటీకోసం వినియోగించుకుంటున్నారనుకోలేదు."

"నేనూ అలా అనుకోలేదు. కూటికోసం కోటి విద్యలని ఊరికే అన్నారా? ఇంతకీ, ప్రొఫెసర్ విష్ణువర్ధన్ ఎక్కడున్నారిప్పుడు? మీరాయన్ని చూశారా?"

“చూశాలేదు. మెడికల్ జర్నల్‌లోనూ పత్రికల్లోనూ ఆయన పేరు చదవడమే తప్ప ఆయన ఫోటోకూడా చూసి ఎరగను. ఫోటో ప్రచురణకూ, వ్యక్తిగత ప్రచారానికీ ఆయన ఒప్పుకోడట. ఆదినించీ ఆయన అజ్ఞాతవాసంలోనే వుండి, తన తరిశోధనలు సాగిస్తున్నాడు.

అటువంటి నిరాపేక్షుడు తను కనిపెట్టిన మందును ప్రచారం చెయ్యడానికి ఇటువంటిమార్గాన్ని చేపట్టాడంటే విడ్డూరంగానే వుంది!”

“ఇది ఆయన చేపట్టిన మార్గం కాకపోవచ్చు. ఇంకెవరో ఈ కొత్త ప్రక్రియను ప్రవేశపెట్టి వుండవచ్చు. మొత్తానికి చాలా తెలివైన మార్గాన్నే ఎన్నుకున్నారు. మీరే ఆలోచించండి. ఈ ప్రదర్శనకు బదులు, మైక్‌లో ఆ మందుగురించి గొంతు చించుకు అరిచినా, ఈ జనం పట్టించుకునేవారా?”

డాక్టర్ తలూపి, “నిజమే!” అన్నాడు.

సంజయ్ వాళ్ళ చర్చలో ఆసక్తి చూపడం లేదు. అతని చూపులు దీపా, ప్రేరితా కనిపిస్తారేమోనని హాలంతా కలయజూస్తున్నాయి. కాకతాళీయంగా, అదే సమయంలో అతని దృష్టి లిఫ్ట్ దిగి, హోటల్లోంచి బైటికెళ్తున్న ప్రేరితమీద పడింది!

ఆమె అటూ ఇటూ చూడకుండా, త్వరత్వరగా అడుగులు వేస్తోంది తలుపువైపు. రోజూ క్రమం తప్పకుండా, ఇక్కడికి వచ్చే ప్రేరిత ఈరోజు ఈ విచిత్ర నర్తకుల ప్రోగ్రాం వుందని తెలిసీ ఎందుకు రాలేదు? అంత హడావుడిగా ఎక్కడికెళ్తోంది?

అనుకుంటూ చటుక్కున లేచి, ఆమె ననుసరించాడు సంజయ్.

# 6

ప్రేరిత హోటల్లోంచి బయటపడి కారు పార్కింగ్ వైపు నడుస్తోంది.

అక్కడ అట్టే జనసంచారం లేదు. పార్కింగ్ ప్లేస్‌లో లైట్ల కాంతి ఎక్కువగా పడటంలేదు. సంజయ్ ఆమెకాస్త ఎడంగా వుండి గమనించసాగాడు.

ప్రేరిత తిన్నగా వెళ్ళి ఓ నీలిరంగు ఫియట్ కారు పక్కన నిలబడింది. అంతే మరుక్షణం మసక చీకట్లోంచి ఇద్దరు వ్యక్తులు ఆమెని సమీపించారు. క్షణంపాటు వాళ్ల మధ్య ఏదో సంభాషణ సాగింది. అంతవరకూ మామూలుగా వున్న ప్రేరిత అకస్మాత్తుగా బెదిరిపోయినట్టు కనిపించింది.

ఆ ఇద్దర్లో ఒకడు చటుక్కున కారు డోర్ తెరిచి, ఆమెని లోనికి తోశాడు. రెండోవ్యక్తి మెరుపులా డ్రైవింగ్ సీట్లోకి దూరాడు.మరుక్షణం కారు స్టార్టయింది. హెడ్ లైట్స్ వెలిగాయి. కన్ను మూసి తెరిచేలోగా, కంపౌండ్ గేటు దాటి ఎడంవైపు తిరిగింది కారు.

చక చక చుట్టూ కలియజూశాడు సంజయ్. పార్కింగ్‌లో ఓ పక్క ఆపివున్న స్కూటర్లు కనిపించాయి. జేబులోంచి మాస్టర్ కీ తీస్తూ అటు పరిగెత్తాడు. నిమిషంలో ఓ స్కూటర్ లాక్ తీసి, స్టార్ట్ చేసి, బాణంలా గేటు దాటించి ఎడంవైపు తిప్పాడు.

ఫర్లాంగు దూరంలో కనిపించిందా ఫియట్! వాళ్ళ కనుమానం రాకుండా హెడ్ లైట్స్ ఆర్పి, వెంబడించసాగేడు సంజయ్. కారు హిల్ రూట్ వైపు వెళుతోంది.

ఎవరు వాళ్ళు? ప్రేరితని బలవంతంగా ఎక్కడికి తీసి కెళ్తున్నారు? వాళ్ళకూ, ప్రేరితకూ ఏమిటి సంబంధం?

మొదటినించీ ఆ అమ్మాయి తీరు అంతుబట్టని క్రాస్ పజి ల్లాగే వుంది!

సంజయ్ వూహించినట్టే కారు హిల్ రూట్‌గుండా ఎత్తైన ప్రదేశానికి చేరుకుంది. చుట్టూ మసక చీకటి. నిర్మానుష్యం! కొండను తొలిచి నిర్మించిన రోడ్డు అది. రోడ్డుకి కుడివైపు కొండరాళ్ళూ, ఎడంవైపు లోతైన లోయా వున్నాయి.

అప్పుడే సన్నగా వర్షపుజల్లు ప్రారంభమైంది. అదే చిలికి చిలికి గాలివానగా మారిందంటే, తనకు చాలా ఇబ్బంది కలగవచ్చు. ఉన్నట్టుండి కారు హఠాత్తుగా ఆగి పోయింది రోడ్డు పక్కన. సడన్ బ్రేక్ వేసి ఆపాడు సంజయ్ స్కూటర్ని.

డ్రైవింగ్ సీటు తలుపు తెరుచుకుంది. అంతవరకూ కారు తోలిన వ్యక్తి దిగి బాయ్‌నెట్ తెరిచి ఇంజన్‌లో ఏదో చూడసాగాడు. బహుశా, ఏదో ట్రబుల్ వచ్చుం టుంది!

స్కూటర్ మీంచి దిగాడు సంజయ్. సవ్వడి కాని అడుగులు వేస్తూ చిఱుతలా కారును సమీపించాడు.

"ఏం జరిగింది?" అడిగాడు బాక్‌సీట్లో కూర్చున్న వ్యక్తి గట్టిగా.

"ఫ్యూయల్ అందడం లేదు. ఏర్‌లాక్ అయిందేమో?" అన్నాడు ఇంజన్ చూస్తున్న వ్యక్తి.

"త్వరగా కానివ్వు. అవతల వర్షం ఎక్కువయ్యేట్టుంది" అన్నాడు లోపలతను.

"నా ఒక్కడివల్ల అవుతుందా? రా ఇటు!"

జేబులోంచి పిస్తోలు తీసి రెడీగా పట్టుకున్నాడు సంజయ్.

కారు బాక్ డోర్ తెరుచుకుంది. రెండో అతను దిగి, ఇంజన్ వైపు వెళ్ళాడు. పిస్తోలు సేఫ్టీ కాచ్ వెనక్కిలాగి, వేలు ట్రిగ్గర్ మీద సిద్ధంగా వుంచి, వాళ్ళవైపు నడిచాడు సంజయ్.

అడుగుల శబ్దం విని ఇద్దరూ అదిరిపడి వెనుదిరిగారు.

"కదలకండి! చేతులు పైకెత్తి అక్కడే నిల్చోండి. నా అనుమతి లేకుండా ఊపిరి తీసుకోడం తప్ప, చిటికెన వేలు కదిపినా, మీ శరీరాల్లో అనేక కిటికీలు తెరుచుకుంటాయి జాగ్రత్త!" అన్నాడు సంజయ్.

"ఎవరు నువ్వు? ఎక్కణ్నించి వచ్చావ్?" అన్నాడొకడు చేతులెత్తుతూ.

"చెబుతాను, ఓపిక పట్టు!" అని ఆ అమ్మాయి నుద్దేశించి, "ప్రేరితా! కార్లోంచి దిగు. నేను సంజయ్‌ని. వీళ్ళిప్పుడు నా చెప్పు చేతుల్లో వున్నారు" అన్నాడు.

కారు తలుపు తెరుచుకున్న శబ్దం! అవతలివైపు దిగింది ప్రేరిత. అంతే! ఆమె గావుకేకతో పరిసరాలు మారుమోగాయి.

"ప్రేరితా! ఏమైంది?" అరిచాడు సంజయ్.

నిశ్శబ్దం!

చటుక్కున వెనుదిరిగి అటు పరిగెత్తబోయాడు సంజయ్. అంతే! ఆ ఇద్దరు వ్యక్తులు లంఘించారతని మీదికి. ట్రిగర్ వత్తేశాడు సంజయ్.

"ఢాం!" దిక్కులు పిక్కటిల్లాయి.

గుండు దూసుకెళ్ళి ఓ వ్యక్తి తొడలో దిగింది. కాండం నరికిన చెట్టులా కూలాడతను. క్షణం కూడా జాగు చెయ్యకుండా బూటుకాలితో ఈడ్చి రెండో వ్యక్తి తొడల నడుమ తన్నాడు సంజయ్. గావుకేక పెడుతూ రెండు చేతులతో అక్కడ అదుముకుని, నేలకూలాడతను.

వెంటనే కారు అవతలివైపు కెళ్ళి చూశాడు సంజయ్.

ప్రేరిత లేదు!

పిల్చాడు గట్టిగా.

జవాబు లేదు.

ఆమె ఛాయలుకూడా లేవక్కడ. ఏమైంది? ఎక్కడికి కెళ్ళింది? తీవ్రంగా ఆలోచిస్తూ చుట్టూ కలయజూశాడు. కొద్ది దూరంలో నేలమీద పడుందో లేడీస్ సైండిల్! ఆమెదేనా?

అనుకుంటూ రోడ్డు పక్క లోయవైపు చూశాడు. కొంపదీసి ఆమె కారు దిగి, లోయలో దొర్లిపోలేదుకదా? ఐతే, సహాయంకోసం కేకలెందుకు వెయ్యడంలేదు? ఆలోచిస్తూ గబగబ లోయలోకి దిగసాగాడు సంజయ్.

కొద్ది దూరం వెళ్ళి, "ప్రేరితా!" పిల్చేడు.

జవాబు శూన్యం.

ఇంకా స్త కిందికెళ్ళి మళ్ళీ పిల్చేడు.

నిశ్శబ్దం!

చీకట్లో ఏమీ కనిపించడం లేదక్కడ. అంతవరకూ జల్లులా పడుతున్న వర్షం అప్పుడు చినుకులుగా మారింది. మేఘాలు గర్జిస్తున్నాయి. ఆ చీకట్లో ఆమెని వెదకడం కష్టం.

రోడ్డుమీద పడున్న ఆగంతకుల దగ్గర టార్చి వుంటే తీసుకురావాలి, అనుకుంటూ అతి కష్టంమీద పైకిచేరుకుని, నిర్ఘాంతబోయాడు సంజయ్. రోడ్డుమీదుండవలసిన ఇద్దరు మనుషులూ, ఫియట్ కారూ మాయం.

తను కిందికెళ్ళగానే అదును చూసి పారిపోయారా? ప్రేరితని ఏ వుద్దేశంతో అపహరించాలనుకున్నారు? వరద రాజన్ అనే ఆ వ్యక్తిని వీళ్లే చంపారా?

ఆలోచిస్తూ స్కూటర్ వదిలిన చోటికి బైలుదేరాడు సంజయ్. కొద్దిదూరం నడిచాడో, లేదో వర్షం ఉధృత మైంది. రోడ్డుపక్క చెట్టుకిందికి పరిగెత్తాడు. కాండానికి ఒదిగి నిల్చున్నాడు.

అంతలో ఎవ్వరో వస్తున్న అడుగుల శబ్దం వినిపించి, అతని చెవులు అప్రయత్నంగా నిక్కబొడుచుకున్నాయి. అంత వర్షంలో, చీకట్లో ఓ ఆకారం తనవైపే వస్తూ కనిపించింది లీలగా. ఊపిరి బిగబట్టి కన్నార్పకుండా అటే చూడసాగాడు.

# 7

ఆకారం దగ్గిరవుతున్నకొద్దీ బూట్సుల శబ్దం స్పష్టంగా వినిపించసాగింది. అతనికి పదిగజాల దూరంలో ఆగిపోయా డతను. మరుక్షణం ఆ వ్యక్తి చేతిలో టార్చిలైటు వెలిగింది.

"ఏయ్, ఎవరు నువ్? ఇక్కడేం చేస్తున్నావ్?"

"కనిపించడంలా? మనిషిని, అందుకే నీలా వర్షంలో తడవదలచుకోలేదు."

"తలతిక్కగా మాట్లాడక! ఇంత రాత్రి ఇక్కడికెలా వచ్చావ్?"

"అడగడానికి నువ్వెవరు?"

"నాకు తలతిక్క జవాబులు గిట్టవని మళ్ళీ చెబు తున్నాను" అంటూ కుడిచెయ్యి వెలుగులోకి చాచాడతను.

అప్పుడు పడింది సంజయ్ దృష్టి, ఆ చేతిలో వున్న పిస్తోలుమీద! "ఓహో, పిస్తోలా! ఏదీ, ఇలా ఇవ్వు చూద్దాం. సినిమాల్లో చూడ్డమే తప్ప, ఇంతవరకూ చేత్తో తాకి ఎరగను!"

"ఇది సినిమాల్లో చూపే పిస్తోలు కాదురా బడుద్ధాయ్

నిజం పిస్తోలు...బుద్ధిగా నా ప్రశ్నలకి జవాబులిచ్చావా సరి. లేదా, ఇక్కడే హరీమంటావ్!''

''అలాగా? ఐతే, పదికి మించి ప్రశ్నలు వెయ్యక. అందులో, నాకు నచ్చిన ఐదింటికే జవాబులిస్తాను.''

''నేను ఫైర్ చెయ్యబోతున్నాను జాగ్రత్త.''

''నా కభ్యంతరం లేదుగానీ, త్వరగా వచ్చెయ్యాలి! ఈ చీకట్లో చచ్చే భయం వేస్తోంది నాకు.''

''రాస్కెల్! చూడు నిన్నేం చేస్తానో...'' అంటూ అడుగు ముందుకు వేశాడతను. అంతే! స్ప్రింగులా ఎగిరాడు సంజయ్ గాలిలోకి. మరుక్షణం అతని రెండు కాళ్ళు ఆ వ్యక్తి ఛాతీని ముద్దెట్టుకున్నాయి. ఇద్దరూ అమాంతం నేల కూలారు.

సంజయ్ మెరుపులా లేచి, ''ఇప్పుడు నేను వేసే ఇరవై ప్రశ్నలకి జవాబులివ్వాలి నువ్వు!'' అన్నాడు ఛాతీ మీద కాలు పెట్టి అదుముతూ.

ఆ వ్యక్తి లేవడానికి శాయశక్తులా ప్రయత్నించి విఫలుడయ్యాడు.

''అలా పడుకునే చెప్పు, ఎవరు నువ్వు?''

''సి.ఐ.డి. ఆఫీసర్ని!''

''ఐతే, నిన్నా పరబ్రహ్మకూడా ఇక కాపాడలేడు. ప్రభుత్వ డిటెక్టివ్ అంటే నాకు వళ్ళు మంట. బహుశా, నువ్వు నన్ను వెంబడిస్తూ వచ్చుంటావు. పోలీసుల్ని ముప్పు తిప్పలు పెట్టి, మూడు చెరువుల నీళ్ళు తాగించడం నా రివాజు!''

''న్... నేను పోలీసాఫీసర్ని కాను.''

''లాభంలేదు. ఇప్పుడు అరిచి గీపెట్టినా నేన్నమ్మను.''

''ఐతే నువ్వు పరాయి సొత్తు స్వాహాచేసే బాపతన్న

మాట.''

''పరాయిసా తెప్పకూ నాకోసం ఎదురు చూస్తుంటుంది. నా అడుగుల శబ్దం వినగానే, ఇనప్పెట్టెలు వాటంతటవే తెరుచుకుంటాయి.''

''ఐతే మనిద్దరం ఒకేజాతి పక్షులం! పోలీసాక్షీసర్వని పూరికే బొంకాను. నీలాంటి వాణ్ని నేనింతవరకూ చూళ్లేదు. కన్ను మూసి తెరిచేలోగా నన్నూ, నా ఆయుధాన్నీ నిర్వీర్యుల్ని చేశావ్. ఇప్పుడైనా ఛాతీమీంచి కాలు తీసి పుణ్యంకట్టుకో.''

సంజయ్ వంగి, కొద్దిదూరంలో పడున్న టార్చిలైటూ పిస్తోలూ అందుకున్నాడు. అప్పుడు తట్టిందతనికి సడన్‌గా ఓ ఆలోచన.

పిస్తోలు ఆ వ్యక్తి బుర్రకి గురిపెట్టి, ''నా ప్రశ్నలకి సరైన జవాబులిచ్చేదాకా నీకీ నరకం తప్పదు. ఏమాత్రం బొంకావా నీ పిస్తోలు గుళ్లే నిన్ను వైకుంఠం పంపేస్తాయి జాగ్రత్త! ప్రేరిత అనే అమ్మాయిని ఫియట్ కార్లో కిడ్నాప్ చేసినవాళ్ళు నీ అనుచరులేకదూ?'' అడిగాడు.

అతను పలకలేదు.

బూటుకాలితో గట్టిగా నొక్కాడు సంజయ్. ''చెప్పు లేదా బూటుతో నీ గుండె అప్పడం చేస్తాను.''

''ఔను. వాళ్ళు మనిషినే!''

''ప్రేరితనెందుకపహరించారు?''

''ఆమెనపహరించడానికి మొత్తం నలుగురం నియమించబడ్డాం! అందులో ఇద్దరు హోటల్‌నించి ఆమెని తీసుకురావడానికళ్ళారు. వాళ్ళు రావలసింది ఈ రూట్‌లోనే గనక, మధ్యలో వాళ్ళకేదైనా ఆపద ముంచుకొస్తే ఆదుకోడానికి మిగతా ఇద్దరం అక్కడక్కడా నియమించబడ్డాం.

ఆమె నపహరించుకొస్తే పదివేలు ముట్టచెబుతా నన్నాడో వ్యక్తి...కాకతాళీయంగా కారిక్కడే చెడి పోయింది. వాళ్ళు కారుదిగి ఇంజన్ చూస్తుండగా నువ్వు వెనకనించి వచ్చి, వాళ్ళని పిస్తోలుతో బెదిరించావ్. నేను చీకట్లో నక్కి ఇదంతా చూస్తూనే వున్నాను.

ఆ అమ్మాయి అవతలిపక్క కారు దిగగానే, అక్కడ పొంచివున్న నేను ఆమె నెత్తుకుపోయి, వో గుహాలో బంధించి, మిగతా అనుచరుల్ని వెనుక్కంటూ ఇటొస్తే నువ్వు కనిపించావ్!"

"ఐతే, మీరు స్థానిక రౌడీలన్న మాట! ఆమె నెత్తుకురావడానికి మిమ్మల్ని నియమించిన వ్యక్తి ఎవరు?"

"తెలీదు. అతను మా దగ్గరికి వచ్చినప్పుడు మొహానికి ముసుగు వేసుకున్నాడు. మాక్కావలసింది డబ్బు. అత నెవ్వరయితే ఏం?"

"ఇప్పుడా అమ్మాయి ఎక్కడుంది?"

"ఇక్కణ్నించి ఫర్లాంగు దూరంలోవున్న గుహాలో."

"వెంటనే ఆమెని నా కప్పగించు."

"పది వేలకోసం ఇన్ని అవస్థలు పడ్డాం! ఆ డబ్బిచ్చి ఆలాగే తీసికెళ్ళు."

సంజయ్ నవ్వి—"ఇటువంటి బేరాలు భోళారాయు ళ్ళతో జరపాలి. బుద్ధిగా ఆమె నెక్కడ బంధించావో చూపెట్టకుంటే ఒళ్ళు హూనం చేస్తాను జాగ్రత్త!" అన్నాడు బూటుతో గట్టిగా అదుముతూ.

"చ్...చూపెడతాను. కాలు తియ్యి!" అన్నా డతను మూలుగుతూ.

పిస్తోలు సిద్ధంగా పట్టుకుని, ఛాతీమీంచి కాలు తీశాడు సంజయ్.

అతి కష్టంమీద లేచి నిల్చోగలిగాడతను. అంతవరకూ ఎడతెరిపి లేకుండా కురుస్తున్న వర్షం ఇప్పుడు తగ్గుముఖం పట్టింది. అతను వెనుదిరిగి కదిలాడు ముందుకు. సంజయ్ వెనక వుండి, టార్చి వెలిగించి అతనికి దారి చుపిస్తున్నాడు.

రోడ్డు కడ్డంగా పొదల్లోపడి ఫర్లాంగు దూరం నడిచేక వోచోట ఆగాడతను. ఎదురుగా వో గుహ కనిపిస్తోంది.

"నడు లోపలికి" అన్నాడు సంజయ్.

ఇద్దరూ లోన అడుగుపెట్టారు. వో మూల తాళ్ళతో కట్టి పడేసి వుంది ప్రేరిత. అరవకుండా ఆమె నోట్లో గుడ్డలు కుక్కి వున్నాయి.

"ఆమె కట్లు విప్పేయ్!"

అతను కింద కూర్చుని గబగబ కట్లువిప్పాడు.

"సంజయ్‌గారూ" అంది ప్రేరిత పూడుకుపోయిన కంఠంతో.

"మనం తరవాత మాట్లాడుకోవచ్చు. ముందిలావచ్చి, ఈ పిస్తోలుతో వాణ్ని కవర్ చేస్తూ నిల్చో!" అన్నాడు సంజయ్.

ప్రేరిత అతన్ని సమీపించి, పిస్తోలూ - టార్చిలైటూ అందుకుంది.

సంజయ్ లేవబోతున్న ఆ వ్యక్తిని కిందికితోసి ఆ తాళ్లతోనే అతని కాళ్ళూ చేతులూ కట్టిపడేశాడు.

తరవాత ప్రేరిత చేతిలోంచి పిస్తోలందుకుని, "కమాన్!" అంటూ గుహ బైటకి నడిచాడు.

ఇద్దరూ చకచక అడుగులు వేస్తూ రోడ్డువైపు నడక సాగించారు.

"ఈ నిశిరాత్రిలో అంతదూరం కాలినడకన వెళ్ళక తప్పదంటారా?" అంది ప్రేరిత భయంగా.

"రోడ్డుమీద నేను వచ్చిన స్కూటర్ వుంది. ఇంతకీ, నువ్వా హోటల్లోంచి కార్ పార్కింగ్ దగ్గరికెందు కెళ్ళావ్?"

"గదిలో వున్న నాకు బట్లర్ ద్వారా ఎవ్వరో వో ఉత్తరం పంపించారు. అందులో, నేను వెంటనే కారు పార్కింగ్ దగ్గరికివస్తే, ఇంతకాలం ఏ రహస్యాన్నైతే కనుక్కోడానికి నేను ఆరాటపడుతున్నానో అది తెలుసుకోవచ్చని రాసుంది. నేనింకేమీ ఆలోచించకుండా వెళ్ళానక్కడికి. ఆ దుండగులిలా చేస్తారని ఊహించ లేదు!"

"ఏమిటా రహస్యం?"

"నా జన్మ రహస్యం."

"వాట్?"

"ఔను. నా తలిదండ్రులెవ్వరో, ఇంతకాలం నా అవసరాలకి డబ్బు ఎక్కణ్నించి వస్తోందో, ఎవ్వరుపంపుతున్నారో తెలుసుకోవాలని ఎన్నాళ్ళుగానో ప్రయత్నిస్తున్నాను. ఇంతవరకూ ఏమీ అంతు బట్టలేదు."

"బాల్యంనించి నువ్వెక్కడ పెరిగావ్?"

"ఒక వృద్ధురాలి ప్రాపకంలో!"

"నీ తలిదండ్రులెవరో ఆమె చెప్పలేదా నీకు?"

"లేదు."

"ఎందుకు?

"ఆమె మూగది గనుక!"

"అయితే, నువ్వామె దగ్గరికెక్కణ్నించి వచ్చావు?"

"మూగది, చదువురానిది ఎలా చెప్పగలుగుతుంది? అంతేకాదు, ఇరుగు పొరుగు వాళ్ళకూడా తెలీదుట నేనామె దగ్గరికెలా వచ్చానో?"

"ఇప్పుడా ముసలామె ఎక్కడుంది?"

"చనిపోయింది! ఆరేళ్ళక్రితం."

"ఆ తరవాతకూడా నువ్వక్కడే వున్నావా?"

"ఔను. ఆమె మరణించిన కొద్దిరోజులకు, ఓ తల నెరిసిన వ్యక్తివచ్చి, తనా ముసలామె సోదరుణ్నని పరిచయం చేసుకున్నాడు."

"నువ్వామె దగ్గరికెలా వచ్చావో అతనుకూడా చెప్పలేదా?"

"ఎంత ప్రయత్నించినా చెప్పేవాడుకాదు. అతనామె సోదరుడు కాడని ఎందుకో నా కనుమానం వేస్తుండేది"

"కారణం?"

"ఆ ముసలామె చాలా పేదది. జీర్ణావస్థలోవుండే ఇంట్లో నివసించేది. అతనుమాత్రం పచ్చగా బ్రతుకుతున్న గొప్పింటి వ్యక్తిలా కనిపించేవాడు. అదీగాక ఆమె బ్రతికుండగా ఎన్నడూ ఆ ఛాయలకు రానివ్యక్తి, కనీసం ఆమె అంత్యక్రియలకూడా రానివ్యక్తి. వున్నట్టుండి ఎక్కణ్నించి వూడిపడ్డాడు?

ఆమె మరణానంతరం అతనే నా బాగోగులు చూసి పోతుండేవాడు. జీర్ణదశలోవున్న ఆ ఇంటికి మరమ్మత్తులు చేయించి, ఆధునికంగా మార్చేశాడు. అయితే, వచ్చి నప్పుడల్లా నేనీ లోకంలో ఏ దిక్కూలేని అనాధబాలిక నన్న భావం వచ్చేలా పదేపదే మాట్లాడేవాడు."

"ఇప్పుడతనెక్కడున్నాడు?"

"తెలీదు! అడపాదడపా వచ్చి నన్నుచూసి పోయే వ్యక్తి రెండేళ్ళక్రితం హఠాత్తుగా రావడం మానేశాడు. ఎక్కడున్నాడో? ఎలా వున్నాడో? కనీసం బ్రతికి వున్నాడో? చనిపోయాడోకూడా నాకు తెలీదు!"

"నీకథ చాలా విచిత్రంగా వుంది. ఈ రెండేళ్ళుగా నీ అవసరాలకి డబ్బెక్కణ్ణించి వస్తోంది?"

"అదీ ఒక విచిత్రమే! ప్రతినెలా మూడవ తేదీన ఐదువందలకు చెక్కు వచ్చేస్తుంది నా పేర. హాయిగా, నిశ్చింతగా గడిచిపోతున్నాయి రోజులు. అయితే, ఆ చెక్కు ఎక్కణ్ణించి వస్తుందో, ఎవరు పంపిస్తున్నారో ఇంతవరకూ అంతుబట్టలేదు. చెక్కుమీద సంతకంకూడా అర్థంకాకుండా వుంటుంది."

"బ్యాంకులో కనుక్కుంటే ఆ వివరాలన్నీ తెలిసి పోతాయి కదా?"

"ప్రయత్నించాను. లాభంలేకపోయింది."

"హోటల్లో హత్యచేయబడ్డ వరదరాజన్ ఎవరు?"

"నా శ్రేయోభిలాషి, ఆత్మీయుడు. నా కథంతావిని నాతోబాటు రహస్యం కనుక్కోడానికి తీవ్రప్రయత్నాలు చెయ్యసాగాడు. ఈమధ్య హోటల్లో మీరు నాకు పరిచయమైనప్పుడు, మనిద్దరం తరచూ కలుసుకోడంచూసి, సహించక నన్నూ, మిమ్మల్ని హెచ్చరించాడు. నాకోసం అంత దారుణంగా అతని హత్య జరుగుతుందని నేను ఊహించలేదు."

సంజయ్ పలకలేదు. అప్పటికే రోడ్డుప్రక్క ఆపి వున్న స్కూటర్ని సమీపించారిద్దరూ. కొద్ది ప్రయాసతో దాన్ని స్టార్ట్ చేసి, ప్రేరితను వెనక కూర్చోబెట్టుకొని, బాణంలా ముందుకు పోనిచ్చాడు సంజయ్.

# 8

హోటల్ కు చాలాదూరంలో స్కూటరాపేసి దిగారిద్దరూ.

అక్కణ్ణించి ఫర్లాంగుదూరం నడిస్తే హోటల్ చేరు

కోవచ్చు. ఇప్పుడు వర్షం పూర్తిగా స్తంభించింది. ఇద్దరూ గబగబ అడుగులు వేస్తూ హోటల్లో ప్రవేశించారు.

చిన్నసైజు జాతరలా వుందక్కడ. ఎర్రటోపీలు అటు యిటూ తిరుగుతున్నాయి. క్రితంరోజు వచ్చిన యిన్స్పెక్టరే మళ్ళీ కనిపించాడు మేనేజర్తో మాట్లాడుతూ.

సంజయ్ని చూడగానే, "మిస్టర్ యిలారండి" అన్నాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ అతన్ని సమీపించి కనుబొమలెగరేశాడు సంజయ్.

"అనుమతి లేకుండా ఎక్కడికీ వెళ్ళొద్దని చెప్పాగా! ఇంతసేపూ ఎక్కడున్నారు?" గుడ్లురిమాడు ఇన్స్పెక్టర్.

"మీ అనుమతి లేకుండా ఈ ఊరొదిలి వెళ్ళొద్దు అన్నారుగానీ, హోటల్ బయట షికారుక్కూడా వెళ్ళవద్దనలేదు. జ్ఞాపకం చేసుకోండి."

"ఐతే, ఇంతరాత్రి ఈ కుండపోత వర్షంలో షికారు కెళ్ళొస్తున్నారన్న మాట."

"షికారుకని వెళ్ళాను. మధ్యలో వర్షం వచ్చింది. ఓచోట తలదాచుకుంటూ వుండిపోయాను."

"పార్కింగ్లో ఆపివున్న ఓ ఫియట్ కారూ, స్కూటరూ దొంగిలించబడ్డాయి. దీనికేమంటారు?"

"నాకు స్కూటరూ, కారూ నడపడం అటుంచి, సైకిల్ కూడా తొక్కడం చేతకాదు."

"ఐసీ, రిపోర్టందాక మేమువచ్చి చూస్తే మీ స్నేహితుడు కూడా లేడు హోటల్లో. ఆయనకూడా షికారుకు వెళ్ళాడా?"

"తెలీదు! అయినా అతను మైనర్ బాబు కాదుకదా, కనిపెట్టుకునుండడానికి."

"మనిషిలా మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోండి!" అన్నాడు ఇన్స్పెక్టర్ గుర్రుమంటూ.

"అయితే నేనింతవరకూ ఊరపిచుకలా కిచకిచ మన్నానా?" అడిగాడు సంజయ్ ఆశ్చర్యంగా.

"తెలుస్తుంది. త్వరలోనే తెలుస్తుంది" బుసలుకొడ్తూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు ఇన్స్పెక్టర్.

సంజయ్ నవ్వుతూ ప్రేరితని వెంటబెట్టుకుని లిఫ్ట్లో పైకి చేరుకున్నాడు. వాళ్ళగది తలుపు మూసుంది. సంజయ్ తన దగ్గరున్న తాళంచెవితో డోర్లాక్ తెరిచాడు.

ఇద్దరూ లోన అడుగుపెట్టారు.

సంజయ్ బ్రీఫ్కేసులోంచి డైరీతీసి, "ప్రేరితా, నీకు ప్రతినెలా ఓ అజ్ఞాత చెక్కు వస్తుందన్నావు కదూ? ఏ బ్యాంకు చెక్కది?" అడిగాడు.

"కెనరా బ్యాంకు."

"ఏ బ్రాంచి?"

"తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు."

"అకౌంట్ నెంబరు?"

"1252. లెడ్జర్ పోలియో 204."

"నీ దగ్గర లేడీ పిస్తోలున్నమాట నిజమేనా?"

"ఔను. మీకెలా తెలుసు?"

"లైసెన్సుందా దానికి?"

"ఉంది! వరదరాజనే దాన్ని కొనిచ్చాడు నాకు, ఆత్మరక్షణ కోసం!"

"మంచిపని చేశాడు. జరిగిన సంఘటనలను బట్టి, నిజంగా నిన్నేదో ప్రమాదం అంటిపెట్టుకున్నట్టు స్పష్టమౌతోంది. నిన్ను కిడ్నాప్ చేసి, ఆ వ్యక్తి ఏం చెయ్యాదలచుకున్నాడో తెలీదు.

ఆ ప్రయత్నం ఇప్పుడు ఫలించలేదు గనక, త్వరలో మళ్ళీ ప్రయత్నం చెయ్యొచ్చు. ఆ పిస్తోలు యెప్పుడూ నీ దగ్గర సిద్ధంగా వుంచుకోవాలి. అవసరం వస్తే కాల్చి పారెయ్యడానికి సందేహించక" ఇంకా సంజయ్ మాట పూర్తికాలేదు.

తలుపు తోసుకుంటూ లోనికి వచ్చాడు డిటెక్టివ్ ఉత్తమ్‌కుమార్. అతని బట్టలన్నీ తడిసివున్నాయి.

"ఆ డాక్టర్‌తో నేను మాట్లాడుతున్నప్పుడు చెప్పా చెయ్యకుండా ఎక్కడికెళ్ళావ్? తరవాత నీకోసం హోటల్ అంతా గాలించాను. ఎక్కడా కనిపించక పోయేసరికి ఖంగారుపడి టాక్సీలో సిటీ అంతా తిరిగొచ్చాను.

హోటల్లో ప్రవేశించగానే యిన్‌స్పెక్టర్ యెదురయ్యాడు. అతని యక్షప్రశ్నలకి జవాబులిచ్చి, వదిలించుకునేసరికి తలప్రాణం తోకొచ్చింది. ఇంతకీ యెక్కడి కెళ్ళావ్ నువ్వు?" అడిగాడు సంజయ్‌ని.

ప్రేమితని అతనికి పరిచయంచేసి, జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించాడు సంజయ్.

ఉత్తమ్‌కుమార్ సాలోచనగా తలూపి, "వెంటనే మద్రాను క్రయింబ్రాంచి హెడ్‌క్వార్టర్స్‌కు ట్రంకాల్ చేసి, మన ఫ్రెండ్ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డికి ఆ కెనరా బ్యాంకు వివరాలు చెప్పి, ఆ అకౌంట్ ఎవరిపేర వుందో కనుక్కొని తెలియజెయ్యమను.

ప్రేమితా! ఈ కేసు ముగిసేవరకూ నువ్వు మాతోబాటు ఇక్కడే వుండాలి. ఎట్టి పరిస్థితుల్లోనూ గదిదాటి బైటి కెళ్ళకూడదు" అన్నాడు.

సంజయ్ టీపాయ్‌మీది టెలిఫోన్ ముందుకు లాక్కు

న్నాడు. రిసీవర్ ఎత్తి, వెంటనే మద్రాసు క్రయిం బ్రాంచికి ట్రంకాల్ చెయ్యమన్నాడు హోటల్ ఆపరేటర్‌తో.

అరగంట తరవాత దొరికింది లైను.

"ఇట్రీజ్ క్రయిం బ్రాంచి స్పీకింగ్!" వినిపించింది అవతలినుంచి.

"నేను డిటెక్టివ్ ఉత్తమకుమార్ అసిస్టెంట్ సంజయ్‌ని. ఊటీనుంచి మాట్లాడుతున్నాను. ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డిగారున్నారా అక్కడ?"

"లేరు సార్! ఇప్పుడే ఇంటికెళ్ళారు. నేను సార్జంట్ డేవిడ్‌ని మాట్లాడుతున్నాను. ఏదయినా మెసేజివ్వాలా ఆయనకు?"

"అవును" అంటూ కెనరా బ్యాంకు వివరాలూ, అకౌంటు నెంబరూ అదీ చెప్పి, రేపు బ్యాంకుకెళ్ళి, ఆ అకౌంటు ఎవరి పేర వుందో కనుక్కుని తమకి తెలియజెయ్యమని చెప్పాడు సంజయ్.

"ఓ. కే. సార్" అవతల క్లిక్కుమంది.

## 9

మర్నాడు మధ్యాహ్నం ఒంటిగంటకు మోగిందిఫోన్.

డిటెక్టివ్‌లిద్దరూ ఆ ఫోన్ కాల్ కోసమే యెదురు చూస్తున్నారు, కదలొంచి ఎక్కడికీ వెళ్ళకుండా.

సంజయ్ రిసీవరందుకుని, కాసేపు మాట్లాడి, "థాంక్స్ మెనీ థాంక్స్!" అంటూ క్రెడిల్ చేశాడు రిసీవర్ని.

"ఇన్‌స్పెక్టరేనా?" అడిగాడు ఉత్తమకుమార్.

"అవును. బ్యాంకుకెళ్ళి కనుక్కున్నాడట. ఆ అకవుంటు డాక్టర్ పీతాంబరం అనే వ్యక్తి పేర వుందట. ప్రేరిత నడిగి తెలుసుకోవాలి" అంటూ పక్కగదిలోకెళ్ళి రెండు నిముషాల తర్వాత తిరిగి వచ్చాడు సంజయ్.

"ఇన్నాళ్ళూ ఆమె బాగోగులు చూస్తూ, హఠాత్తుగా అదృశ్యమైపోయిన వ్యక్తి పేరే పీతాంబరమట. అయితే, అతను డాక్టర్ అని ప్రేరితకు తెలీదట."

ఉత్తమ్‌కుమార్ పలకలేదు. సిగరెట్ అంటించి, తీవ్రంగా ఆలోచిస్తూండిపోయాడు. రెండు గంటలకు ఇద్దరూ లేచి, కింద డైనింగ్ హాల్లోకెళ్ళారు భోజనం చెయ్యడానికి. ప్రేరితకు ఏం కావలసినా రిసెప్షన్‌కు ఫోన్ చేసి గదికే తెప్పించుకుంటోంది.

డిటెక్టివ్ ద్వయం భోజనాన్ని ఉపక్రమిస్తూండగా, హోటల్ సిబ్బంది ఆ ఆరుగురు విచిత్ర నర్తకుల్ని చక్రాల కుర్చీల్లో తోసుకుంటూ తీసుకొచ్చారక్కడికి. డైనింగ్ టేబులు దగ్గరకి జరపబడ్డాయి వాళ్ళకుర్చీలు. ఐదు నిముషాల తరవాత వాళ్ళముందు భోజన పదార్థాలు అమర్చబడ్డాయి.

అందరిలా ఆ నర్తకులు తమ స్వహస్తాలతో భోజనం చేయడంలేదు. వాళ్ళతో వచ్చిన బట్లర్లే తినిపిస్తున్నారు వాళ్ళకు. వాళ్ళ వెంట సూటుబూటులో వున్న ఓ యువకుడు కూడా వున్నాడు. అతనే వాళ్ళకు ఆదేశాలిస్తున్నాడు. బహుశా, ఆ నర్తకుల్ని పర్యవేక్షించేది అతనే కాబోలు.

బట్లరతన్ని 'మధుబాబూ' అని గౌరవంగా సంబోధిస్తున్నారు.

"అటువంటి స్థితిలో వున్న నర్తకుల్ని అంత ప్రయాస పడి ఇంతదూరం తీసుకొచ్చే బదులు, వారిగదుల్లోనే భోజనం ఏర్పాటు చెయ్యవచ్చుకదా?" అన్నాడు సంజయ్ తగ్గుస్వరంలో.

ఉత్తమ్‌కుమార్ నవ్వి, "వాళ్ళు ఎనర్జిన్ మందు పట్ల

సిటీ కోసం వాడుకోబడుతున్నారని మర్చిపోక! పాపం వాళ్లు తమ స్వహస్తాలతో స్వతం భోంచేయలేనంత బల హీనంగా వున్నారని జనానికెలా తెలియాలి? అదుగో, ఆ మధుబాబు అనే యువకుడే ఆ నర్తకుల ఇన్‌స్ట్రక్టర్ లాగా కనిపిస్తున్నాడు. అతన్ని పరిచయం చేసుకొని కాసేపు మాట్లాడాలి'' అన్నాడు.

భోజనాలయ్యాక, నాప్‌కిన్‌తో మొహంతుడుచుకొని లేచాడు ఉత్తమ్‌కుమార్. ఆ యువకుడి దగ్గరికెళ్ళి పలక రింపుగా నవ్వాడు. అతనూ కలుపుగోలు మనిషిలా నవ్వుతూ పలకరించాడు. అతన్ని కాఫీకి ఆహ్వానించాడు ఉత్తమ్‌కుమార్.

ఇద్దరూ ఓ టేబిల్ ముందు కూర్చుని పిచ్చాపాటీలోకి దిగారు. ''మీ నర్తకులెప్పుడూ ఈ స్థితిలో యెందుకుం టారు? వీళ్ళ జబ్బులేమిటో కనుక్కొని వైద్యం ఇప్పించ కూడదా?'' అడిగాడు ఉత్తమ్‌కుమార్.

మధుబాబు నవ్వి, ''వీళ్ళజబ్బులు నయమైతే, మనలా ఆరోగ్యవంతులయితే,వీళ్ళఅవసరం మాకెందుకు చెప్పండి? అందుకే వీళ్ళ ట్రీట్‌మెంటు గురించి మేమిప్పుడప్పుడే ఆలోచించ దలచుకోలేదు.

వీళ్లు ప్రస్తుతం ఎనర్జిన్ మందు పబ్లిసిటీకోసం పని చేస్తున్న వుద్యోగులు. ఎప్పుడయితే ఆ మందు ప్రజల మనసుల్లో పూర్తి ప్రభావాన్ని సంతరించుకొంటుందో అప్పుడే వీళ్ళి స్థితినుంచి విముక్తులయ్యేది.'' అన్నాడు.

''ఇది చాలా ఘోరం కదా? బహుశా నేరంకూడా అనుకుంటాను.''

అతను పెద్దగానవ్వి,''కాదు, కాదు. ముమ్మాటికీకాదు. ఆ విధంగా వీళ్ళచేత అగ్రిమెంటు వ్రాయించుకోబడింది.

ప్రతిఫలంగా వీళ్ళకు పెద్ద మొత్తాలలో జీతాలివ్వబడతాయి. పబ్లిసిటీ పూర్తయ్యేక, ఎనర్జిన్ మందు వీళ్ళకు పూర్తిడోస్ ఇవ్వబడుతుంది.

అలా కొద్ది రోజుల్లోనే వీళ్ళు మనకన్నా బలాఢ్యులై పోతారు. ఇందుకు ఆరోగ్యమంత్రిత్వ శాఖనించి ముందే అనుమతి తీసుకున్నారు ప్రొఫెసర్ విష్ణువర్ధన్! వేరొకరికైతే ప్రభుత్వం ఈ ప్రక్రియకు అనుమతి ఇచ్చేదికాదు. ప్రొఫెసర్ విష్ణువర్ధన్ గారి పట్లా, ఆయన పరిశోధనల పట్లా ప్రభుత్వానికి పూర్తి నమ్మకం వుంది. ఇదివరకు ఆయన కనిపెట్టిన మందులన్నీ వైద్యరంగంలో అనేక సత్ఫలితాలనిచ్చాయి'' అన్నాడు.

''అటువంటి మహా వ్యక్తిని ప్రత్యక్షంగా చూడటం అటుంచి, కనీసం ఫోటోకూడా చూసే భాగ్యం నాకు దక్కలేదు. ఇంతకీ, ఆయనెక్కడుంటున్నారిప్పుడు?'' అడిగాడు ఉత్తమ్‌కుమార్ కుతూహలంగా.

''అది మీరడక్కూడదు. నేను చెప్పకూడదు. వ్యక్తిపూజ అంటే ఆయనకు గిట్టదు. ఈ సృష్టిలో ప్రతి వస్తువూ, ప్రతి ప్రాణీ ఏదో ఒక రూపంలో ఎదటి ప్రాణికి సేవ చేస్తోందనీ, అది సృష్టి నైజమనీ, మానవ కళ్యాణానికి ఏదో ఒరగబెడుతున్నానని తనను అందల మెక్కించడం తగదనీ ఆయన అభిప్రాయం!

నిర్జీవమైన రాళ్ళు మనిషి అవసరాలు తీర్చడంలేదా? జంతువులూ, పక్షులూ మనిషి కుపయోగపడటంలేదా? అంతెందుకు, ప్రాణాపాయకరమైన పాము విషంకూడా మందులకు పనికిరావడం లేదా? అలాగే, తనూ అందరికీ ఈ విధంగా వుపయోగపడుతున్నానని ఆయన వాదం.

ఆయన సౌమ్యస్వభావి. మితభాషి. ఏకాంతాపేక్షుడు.

తన ప్రయోగాలు తప్ప, బయట ప్రపంచంతో సంపర్కం పెట్టుకోడం ఆయన కిష్టం వుండదు.

ఉత్తమ్‌కుమార్ ఏదో అడగబోతుండగా, అదే సమయంలో ఓ బట్లర్ వచ్చి, "సార్! వాళ్ళు తమ గదుల కెళ్ళి విశ్రాంతి తీసుకోదలుస్తున్నారు!" అన్నాడు మధుబాబుతో.

అతను లేచి, "సారీ! వస్తాను" అంటూ డిటెక్టివ్ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

మధుబాబుతో జరిగిన సంభాషణ సంజయ్‌కు వివరిస్తూ లిఫ్ట్‌లో తమ గదికి చేరుకున్నాడు ఉత్తమ్‌కుమార్.

ఆ సాయంత్రం ఇద్దరూ తయారై బాల్ రూంలో ఏదైనా కొత్త ప్రోగ్రాం జరుగుతుందేమో చూద్దామని కిందికి వచ్చారు.

అప్పటికే లైట్ల కాంతిలో దేదీప్యమానంగా వెలిగి పోతోంది హాలు. రోజూ యువతీయువకులతో క్రిక్కిరిసి వుండే టేబిళ్ళు ఈనాడు, వయసు మళ్ళిన వాళ్ళతో కిట కిటలాడుతున్నాయి.

స్టేజిమీద వుండవలసిన ఆర్కెస్ట్రాకు బదులు పిలక జుట్టూ, పంగనామాల శాస్త్రులుగారు ఆసీనుడై, పళ్ళ మధ్య కిళ్ళీ దుబ్బుతూ, భూతద్దం కళ్ళద్దాల్లోంచి ప్రేక్షకుల్ని వీక్షిస్తున్నాడు. ఆయన కిరుపక్కలా సితార్, మృదంగ వాద్యగాళ్ళు!

"హాతోస్మి! ఈరోజు శాస్త్రీయ సంగీత కచేరీ ఏర్పాటు చేశారన్నమాట. అందుకే ఎన్నడూ ఈ ఛాయ లకి రాని వృద్ధజంబుకాలన్నీ ఈ రోజిక్కడ దర్శన మిస్తున్నాయి. పోదామా?" అడిగాడు సంజయ్ నీర సంగా.

"కాసేపు కూర్చో, చూద్దాం!" అన్నాడు ఉత్తమ్ కుమార్ ఓ కుర్చీలో చతికిలబడి.

"రెండు సారిడన్ మాత్రలు కొనుక్కొస్తాను." అంటూ బయటకు వెళ్ళాడు సంజయ్.

ఉత్తమ్‌కుమార్ చిన్నగా నవ్వుకున్నాడు.

సంజయ్ అరగంట తర్వాత తిరిగివచ్చాడు. ఉత్తమ్ కుమార్ కూర్చున్నవైపు చూశాడు. అకనికళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

కారణం, గుర్తు తెలియని ఇద్దరు అపరిచితులు. ఉత్తమ్ కుమార్ భుజాలమీద చేతులు వేసి, నడిపించుకుంటూ హోటల్లోంచి బయటికి తీసికెళ్తున్నారు. ఆయన టైఫాయిడ్ రోగిలా నీరసంగా అడుగులు వేస్తూ వెళుతున్నాడు వాళ్ళ వెంట.

ఎవరువాళ్ళు? అంతవరకూ యెంతో చలాకీగావున్న ఉత్తమ్‌కుమార్ అంత నీరసంగా ఎలా మారారు? గబగబ అటు నడిచాడు సంజయ్.

అప్పటికే వాళ్ళు ఉత్తమ్‌కుమార్ని నడిపించుకుంటూ ద్వారం దాటారు. బయట అడుగుపెట్టి, క్రీనీడలో నిల్చుని చూశాడు సంజయ్. ముగ్గురూ కాంపౌండ్ గేటుదాటి, ఎడంవైపు తిరిగారు.

చకచక అడుగులు వేస్తూ అటు నడిచాడు సంజయ్. గేటుమాటున నక్కి ఎడంవైపు చూశాడు. అక్కడికి కొద్దిదూరంలో ఓ లారీ ఆగివుంది. అటు నడుస్తున్నారు వాళ్ళు. లారీ ఎక్కుతారా?

క్రీనీడలో కంపౌండ్ గోడ కతుక్కుంటూ అటు నడిచాడు సంజయ్. అతనూహించినట్టే, వాళ్ళు ఉత్తమ్ కుమార్‌తో లారీ కేబిన్ తలుపు తెరుచుకుని ఎక్కారు. మరుక్షణం ఇంజన్ స్టార్టయిన చప్పుడయింది.

మెరుపుగా అటు పరుగుతీశాడు సంజయ్. కన్ను మూసి తెరిచేలోగా లారీవెనక బాడీలోకి ఎక్కాడు.

ఆ క్షణంలో స్టార్టయింది లారీ! ఆ కుదుపుకు సంజయ్ బాడీలో దొర్లాడు. లేచి నిల్చుందామనుకుంటుండగా చల్లని వస్తువేదో అతని ఛాతీకి గుచ్చుకొంది. "నోరు మెదపక! అలాగే పడుకో!" చీకట్లో కీచుగా వినిపించిందో కంఠం.

అప్పుడే కమ్మని సెంటువాసన గుప్పుమంది నషాళానికి. ఆ వాసన అదివరకెక్కడో చూసినట్లే తోచిందిసంజయ్‌కి. ఎక్కడ? లారీకన్న వేగంగా ఆలోచిస్తోంది అతని మస్తిష్కం. అది టాప్ లేని బాడీ కావడంవల్ల చల్లని గాలి రివ్వున వీస్తూ శరీరాన్ని మంచు ముద్దగా మారుస్తోంది.

"నీవు చెప్పినట్లే వింటాగానీ, వెంటనే ఓ గొంగళి ఏర్పాటుచెయ్యి. చలికి చస్తున్నాను" అన్నాడు యెదురుగా కూర్చున్న ఆకారాన్ని చూస్తూ.

"పిచ్చిపిచ్చి వాగుడు కట్టిపెట్టి, నోరుమూసుకు పడుకో!" ఈసారి ఆ కంఠం కీచుగా గాక, కాస్త గట్టిగా వినిపించింది.

తన చెవుల్ని తనే నమ్మలేక పోయాడు సంజయ్. అది మగకంఠం కాదు. స్త్రీ కంఠం! అంతేగాక, ఆ కంఠాన్ని అంతకు ముందెక్కడో విన్నట్లే అనిపించిందతనికి.

"నువ్వే సెంటు వాడతావో తెలుసుకోవచ్చా బేబీ?" అడిగాడు గోముగా. ఆమె పలకలేదు. పిస్తోలు మొన ఇంకా స్త గట్టిగా అదిమిపట్టింది ఛాతీకి.

"పోనీ నీ వయసెంతో చెప్పు!"

"నా వయసుతో నీకేం పని?"

"నీ వయసు నాకన్నా ఎక్కువుంటే మాత్రం, నేను చచ్చినా నీ చేతుల్లో చావడానికొప్పుకోను. దానికంటే ఈ లారీలోంచి దూకి ఆత్మహత్య చేసుకోడం నయం!"

ఎంత ఆపుకుందామన్నా నవ్వాపుకోలేక, ఫక్కున నవ్వేసిందామె.

వెంటనే ఆ నవ్వు గుర్తుపట్టాడు సంజయ్.

"దీపా!"

"ఔను, నేనే." ఆమె నోట్లోంచి వాక్యం పూర్తి కావడం మరుక్షణం ఆమె చేతిలోని పిస్తోలు అతని చేతి లోకి రావడం ఒకేసారి జరిగాయి.

"పిస్తోలు చేజిక్కించుకున్నంత మాత్రాన నువ్వు నన్నేం చెయ్యలేవు." అందామె చాలా నింపాదిగా.

"అవును. అవతల నీ మనుషులు కేబిన్‌లో వున్నారు కదా?" అన్నాడు సంజయ్ వ్యంగ్యంగా.

"పొరపాటు. వాళ్ళతో నాకలాటి సంబంధంలేదు"

"అయితే నువ్విక్కడ కూర్చుని ఊరికే వేరుశెనక్కా యలు నములుతున్నావన్నమాట!"

"వేళాకోళానిక్కూడా వేళాపాళా వుంటుంది. ఈ రోజు కొందరు వ్యక్తులు హోటల్లోని ఓ గదిలో రహ స్యంగా మాట్లాడుకోడం విన్నాను. వాళ్ళ మాటల్ని బట్టి ఈరాత్రి వాళ్ళెవర్నో బలవంతంగా యెక్కడికో తీసుకెళ్ళబోతున్నట్టు గ్రహించాను."

"అయితే, నువ్వాసంగతి పోలీసులకు తెల్పకుండా ఇక్కడెందుకు దాక్కున్నావ్?"

"నాకు ఎడ్వెంచర్స్ అంటే చాలా ఇష్టం. అవ్యక్తిని వాళ్ళెక్కడికి తీసికెళ్తారో స్వయంగా తెలుసుకోవాలని పించింది."

"అలాగా, అయితే నిన్నిక్కణ్నుంచి తప్పకుండా కిందికి తోసితీరాలి."

"ఎందుకూ?"

"ఊరికే ఎడ్వంచర్ కోసం! నాకూ నీలాగే ఎడ్వంచర్ పిచ్చుంది మరి!" దీప ఏదో అనాలని నోరు తెరిచింది. అదే క్షణంలో లారీ స్పీడ్ స్లో అయినట్టు తోచి, బయటకు తొంగిచూశాడు సంజయ్.

లారీ రోడ్డుదిగి కుడివైపు వెళుతోంది. అక్కడంతా పిచ్చిమొక్కలూ, పొదలూ మొలిచివున్నాయి. వాటిని సమీపించగానే ఆగిపోయింది లారీ. హెడ్ లైట్సు కాంతిలో ఆ పొదల మాటునుంచి మరో ముగ్గురు వచ్చారు ఇవతలికి. అందులో ఒకడి మొహంమీద నల్లని ముసుగు కప్పివుంది.

లారీ కేబిన్ లోంచి ఉత్తమ్ కుమార్, ఆ యిద్దరు వ్యక్తులూ కిందికి దిగారు. ఇప్పుడు ఉత్తమ్ కుమార్ చేతులు వెనక్కి విరిచి కట్టబడి వున్నాయి.

వాళ్ళని చూడగానే ఆ ముసుగుమనిషి నవ్వి, "వెరీ గుడ్! నేను తీసుకురమ్మన్నది వీణ్ణే" అంటూ డిటెక్టివ్ వైపు తిరిగి "ప్రేరితను ఎక్కడ దాచావ్?" అడిగాడు కటువుగా.

"ప్రేరితా? ఎవరామె?"

"బుకాయించి లాభంలేదు. చిత్రహింసలు పెట్టి నిజాన్ని కక్కిస్తాం. ప్రేరితను నువ్వే ఎక్కడో దాచావని తెలిసింది. చెప్పు. ఎక్కడుంది ప్రేరిత?" అన్నాడతను జేబులోంచి పిస్తోలు తీస్తూ.

అంతవరకూ లారీలోంచి మౌనంగా ఆ దృశ్యం చూస్తూ వున్న సంజయ్, రివాల్వర్ని రెండు చేతుల్లో గట్టిగా పట్టుకుని ముందుకుచాపి గురి చూడసాగాడు.

"పదిహరకూ లెక్క బెడతాను. ఆలోపల ప్రేరితను ఎక్కడ దాచావో చెప్పకుంటే, రెండు గుళ్లు నీకాళ్ళలో దిగబడతాయి జాగ్రత్త" అంటున్నాడు ముసుగుమనిషి ఉత్తమ్‌కుమార్‌తో.

ఇక ఆలస్యం చెయ్య దలుచుకోలేదు సంజయ్. ఊపిరి బిగబట్టి ట్రిగ్గర్ వత్తేశాడు.' 'ఢాం!'' దిక్కులు మారు మ్రోగాయి.

గుండు దూసుకెళ్ళి ముసుగు మనిషి జబ్బలో దిగింది. గావుకేక పెడుతూ పిస్తోలు కింద జారవిడిచాడతను.

సంజయ్ మెరుపులా లేచి నిల్చుని, "జాగ్రత్త ఎవ్వరూ కదలడానికి ప్రయత్నించకండి," అన్నాడు మిగతా వాళ్లను హెచ్చరిస్తూ.

అంతే. ఊహించని విధంగా, ముసుగు మనిషితో బాటు మిగతా నలుగురూ ఛెంగున పొదల్లోకి గెంతిపరుగు తీశారు. క్రమక్రమంగా వాళ్ళ అడుగుల చప్పుడు దూర మవ సాగింది.

"నీ తెలివి తక్కువ వల్లే వాళ్ళలా పారిపోగలిగారు" అంది దీప మొహం చిట్లిస్తూ.

"నా తెలివితక్కువతో కాదు. వాళ్ళదృష్టం బావుంది. అందుకే మెరుపులా పారిపోగలిగారు." అంటూ లారీ దిగాడు సంజయ్.

దీపకూడా దిగి ఉత్తమ్‌కుమార్‌ని సమీపించింది.

"మిమ్మల్ని వాళ్ళంత తేలిగ్గా యెలా లొంగదీసు కున్నారు?" అడిగాడు సంజయ్ అతని చేతికట్లువిప్పుతూ

"నువ్వా ప్రోగ్రాంలో పానకంలో పుడకపాత్ర వహించడానికి కెళ్ళినప్పుడు, నేను బట్లర్ ద్వారా గ్రేప్ జ్యూస్ తెప్పించుకున్నాను. అది తాగిన మరుక్షణం

కళ్ళలో మైకం కమ్ముతున్నట్టు తోచింది'' అన్నాడు ఉత్తమకుమార్.

ఆదే సమయంలో హఠాత్తుగా పాదలమధ్య ప్రేలుడు వినిపించింది. మరుక్షణం గాలిలో ఏదో ఘాటైన వాసన వ్యాపించింది. చూస్తూ చూస్తూండగానే ముగ్గురూ నేల కొరగ సాగారు.

# 10

చిన్నగా మూలుగుతూ కళ్ళు తెరిచింది దీప.

కళ్ళు తెరవగానే పైన వెలుగుతున్న జీరోవాట్లుబల్బు కనిపించింది.

గాభరాగా లేచి కూర్చుని చుట్టూ కలయజూసింది.

డిటెక్టివ్ ఉత్తమకుమార్ కూ, సంజయ్ కూ అంత క్రితమే స్పృహవచ్చినట్టుంది. ఇద్దరూ గోడకి చేరగిలబడి కూర్చునున్నారు.

అదృష్టవశాత్తూ వాళ్ళ కాళ్ళూ, చేతులూ బంధింప బడలేదు. గదిలో ఆ ముగ్గురుతప్ప మరోవస్తువులేదు. అదే క్షణంలో తలుపు కవతలివైపునుంచి యెవ్వరివో మూలు గులు, సన్నగా దగ్గులూ వినిపించాయి వాళ్ళకి.

డిటెక్టివ్ ఉత్తమకుమార్ చటుక్కున లేచి, తలుపు దగ్గరికెళ్ళాడు. కీ హోల్లో కన్నుపెట్టి చూశాడవతలికి. అవతలివైపు మరోగది వున్నట్టుంది. కొద్దిగా మంచం, ఆ మంచంపై కాళ్ళూ కనిపిస్తున్నాయి.

''దీపా, నీ హేర్ పిన్ను ఒకసారిలా ఇవ్వు'' అన్నాడు వెనుదిరిగి.

''హేర్ పిన్నా? ఎందుకూ?''

''ఇక నటించడం కట్టిపెట్టు. నువ్వెవరో, నీ పుట్టు పూర్వోత్తరాలేమిటో నాకు బాగా తెలుసు. నువ్వు మద్రాసు క్రయింబ్రాంచిలో లేడీ ఇన్వెస్టిగేటర్వి కదూ''

రక్తమంతా శరీరపు యితరభాగాలకు పాకినట్టు తెల్లబడింది దీప మొహం.

"ఏమిటీ? ఈమె మద్రాసు క్రయింబ్రాంచి మనిషా?" అన్నాడు సంజయ్ నోరు తెరుస్తూ.

"అవును. ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డితో కలిసి అనేక కేసుల్లో పనిచేసింది. ఈమె పేరు దీప కాదు. షీల. ఇదివరకీమె నన్ను చూడని కారణంగా గుర్తుపట్టలేదు. ఒకటి రెండుసార్లు నేనే ఈమెని క్రయింబ్రాంచి హెడ్ క్వార్టర్సులో చూశాను. వృధా కబుర్లకిది సమయంకాదు. షీలా, వెంటనే నీ హేర్‌పిన్ ఇలా యివ్వు!" అన్నాడు ఉత్తమ్‌కుమార్.

షీల మారుమాటాడకుండా హేర్‌పిన్ తీసి ఇచ్చింది. దాన్ని కీహోల్లో దూర్చి తెరవడానికి బ్రహ్మప్రయత్నం ప్రారంభించాడు ఉత్తమ్‌కుమార్. ఎంతో కష్టపడ్డాక గానీ క్లిక్ మనలేదు లాక్.

పిడితిప్పి మెల్లిగా తలుపు తెరిచాడు.

అవతలి గదిలో లేత నీలిరంగు బల్బు వెలుగుతోంది. ఓ గోడవారగా నులకమంచంమీద పడున్నాడో వృద్ధుడు. అస్తవ్యస్తంగా పెరిగిన గడ్డం, చింపిరి జుత్తు.

తలుపు తెరుచుకున్న చప్పుడు విని మూలగడం ఆపి ఇటు తిరిగాడు.

ఉత్తమ్‌కుమార్‌తోబాటు సంజయ్, షీలాకూడా ఆ గదిలో అడుగుపెట్టారు.

వాళ్ళని చూడగానే ఆ వృద్ధుడు అతికష్టంమీద లేచి కూర్చుని "వామ్మయ్యో! మీరా గదిలోంచి తప్పించుకుని బయటపడగలిగారా. ఆ దుర్మార్గులు ఇంతక్రితమే స్పృహ తప్పివున్న మిమ్మల్ని తీసుకొచ్చి, ఆ గదిలో పడేసి

వెళ్ళారు. మీతోబాటు నన్నూ ఈ నరకంనుంచి విము క్తుణ్ని చెయ్యండి. ఎన్నాళ్ళనుంచో నేనిక్కడ మగ్గి పోతున్నాను.'' అన్నాడు.

''ఎవరు మీరు?'' అడిగాడు ఉత్తమకుమార్.

''నాపేరు పీతాంబరం. డాక్టర్ పీతాంబరం.''

ముగ్గురు డిటెక్టివ్‌లూ ఒకరి మొహాలొకరు చూసు కున్నారు.

''రెండేళ్ళక్రితం ప్రేరిత భాగోగులు చూసిన వ్యక్తి మీరేకదూ?''

''అవును. ప్రేరిత ఎలా తెలుసు మీకు?'' అడిగాడత నాశ్చర్యంగా.

''చెబుతాను. మిమ్మల్ని ఇక్కడ ఎవరు బంధించారు?''

''అనేక కథ. విషాద కథ. ఒక విశ్వాస ఘాతకుడి వల్ల నాకీ దుర్భరస్థితి ప్రాప్తించింది. ప్రొఫెసర్ విఘ్న ధరన్ పేరు విన్నారా మీరు? నేనాయన అసిస్టెం టునే...'' ఆ వృద్ధుడిమాట ఇంకా పూర్తికాలేదు.

అంతలో అవతలినుంచి ఎవ్వరో గది తలుపు తెరుస్తున్న చప్పుడు వినిపించింది. నలుగురూ ఊపిరి బిగబట్టి ఊరు కున్నారు. సడన్‌గా ఉత్తమకుమార్‌కో ఆలోచనతట్టింది. వెంటనే ఆ వృద్ధుడి చెయ్యిపట్టుకొని, ''మీరు నా వెంట రండి. త్వరగా.'' అంటూ అతన్ని దాదాపు ఈడ్చుకుంటూ రెండో గదిలోకిదూరి, తలుపు మూసు కున్నాడు.

అదే సమయంలో ఇవతలిగది తలుపు తెరుచుకుంది. ఆ ముసుగుమనిషీ, అతని అనుచరులూ ప్రవేశించారు గది లోకి. వాళ్ళ చేతుల్లో నల్లగా నిగనిగ మెరుస్తున్నాయి పిస్తోళ్ళు. షీలా, సంజయ్‌లని చూడగానే అంతా ఉలిక్కిపడ్డారు.

"మీరిద్దరూ ఆ గదిలోంచి యెలా బయటపడ్డారు? మిగతా ఇద్దరెక్కడ?" అన్నాడు ముసుగు మనిషి ఆశ్చర్యంగా.

రెండో గదివైపు సైగచేశాడు సంజయ్.

అతను ఒక్క వురుకున వెళ్ళి ఆ తలుపు దగ్గరికెళ్ళి, "ఏయ్, వెంటనే తలుపు తెరువ్! లేదా, నీ అనుచరులిద్దర్నీ కాల్చి పారేస్తాను" అరిచాడు.

లోపల ఉత్తమకుమార్ నవ్వు వినిపించింది. "నీకంటే ముందు నేనీ ముసలాణ్ణి పీకపిసికి చంపేస్తాను. రెండేళ్ళ నుంచీ అతన్నిక్కడ బంధించి వుంచావంటే అతని అవసరం నీకెంతవుందో వేరే చెప్పనవసరంలేదు. ఏ అమ్మాయి కోసం నువ్వింత హడావుడి చేస్తున్నావో ఆ ప్రేరి ఒకచోట నా బందీగావుంది. చెప్పు. ఆమెను పొందడానికి ఎంత డబ్బివ్వగలవు?"

ఆ ముసుగు మనిషికి ఏం జవాబివ్వాలో వెంటనే తట్టలేదు కాబోలు. కాసేపు ఆలోచిస్తూండి పోయాడు. తరువాత తలెత్తి. "ఎంత కావాలి నీకు?" అడిగాడు.

"పాతిక వేలు!"

"అంతివ్వలేను. పదివేలతో సరిపెట్టుకో!"

"పదరదు! ఇంకా బేరానికి దిగావంటే. పాతిక వేలు పోయి ముప్ఫయి వేలవుతాయి."

"సరే ఇస్తాను. తలుపు తెరువ్!"

"అలా కాదు. ముందు మీ పిస్తోళ్ళన్నీ నా అనుచరుల కప్పగించండి. అప్పుడు తెరుస్తాను తలుపు" అన్నాడు ఉత్తమకుమార్.

ముసుగుమనిషి ఇరకాటంలో పడిపోయాడు. వేరే దారి లేదు. పిస్తోళ్ళు సంజయ్ కప్పగించమని తన అనుచరులకు ఆజ్ఞాపించాడు. మరుక్షణం వాళ్ళ పిస్తోళ్ళన్నీ షీలా,

సంజయ్‌ల చేతుల్లోకి వచ్చాయి.

"సార్! ఆయుధాలు మా కప్పగించారు. ఇక బైటికి రండి" అన్నాడు సంజయ్.

తలుపు తెరుచుకుంది. నవ్వుతూ ఇవతలికి వచ్చాడు ఉత్తమ్‌కుమార్.

"త్వరగా చెప్పు. క్యాష్ కావాలా? చెక్కు కావాలా?" అన్నాడు ముసుగుమనిషి.

"క్యాష్ ఏమిటీ? చెక్కేమిటీ?"

"ఇప్పుడేకదా ప్రేరిత విషయంలో బేరం కుదుర్చుకున్నావ్?"

విరగబడి నవ్వాడు ఉత్తమ్‌కుమార్. "అవసరాన్నిబట్టి ఒక్కొక్కసారి ఇటువంటి ఊకదంపుడు బేరాలు కుదుర్చుకోక తప్పదు" అని షీల చెవిలో ఏదో చెప్పి, ఆమె దగ్గరున్న రెండు పిస్తోళ్ళు అందుకున్నాడు ఉత్తమ్‌కుమార్.

మరుక్షణం షీల గదిలోంచి గబగబ బైటికెళ్ళిపోయింది.

"మీరంతా చేతులెత్తి ఆ గోడవైపు తిరిగి నిల్చోండి" అన్నాడు ఉత్తమ్‌కుమార్ గంభీరంగా.

ఒకేసారి నాలుగు పిస్తోళ్ళు తమవైపే గురిపెట్టి వున్నాయి. అతను చెప్పినట్టు చెయ్యక తప్పలేదు వాళ్ళకు. అంతలో షీల రెండుమూడు తాళ్ళతో తిరిగి వచ్చిందక్కడికి.

"సంజయ్! నీ దగ్గరున్న పిస్తోళ్ళు షీలకిచ్చి, ఆ తాళ్ళతో వాళ్ళని బంధించు" అన్నాడు ఉత్తమ్‌కుమార్.

పిస్తోళ్ళు షీల కందించి, తాళ్ళతో ఒక్కొక్కడి చేతులూ వెనక్కి విరిచి కట్టేశాడు సంజయ్.

"ఇక ఆ పెద్దమనిషి బురఖా కాస్త తొలగించు. అతని

మొహం చూడాలని నా కళ్ళు తహతహలాడుతున్నాయి" అన్నాడు ఉత్తమ్‌కుమార్.

సంజయ్ వెంటనే ముసుగుమనిషి మొహంమీంచి ముసుగు లాగేశాడు.

"మధుబాబూ! నువ్వా!!" అన్నాడు ఉత్తమ్‌కుమార్ నివ్వెరబోతూ.

మధుబాబు మొహంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు.

"ఇంతసేపూ నువ్వు కంఠంమార్చి నాతో మాట్లాడా వన్నమాట. అందుకే గుర్తించలేకపోయాను. ప్రొఫెసర్ విష్ణువరన్ గారి అసిస్టెంట్‌ను ఇక్కడెందుకు బంధించావ్? ప్రొఫెసర్ ఎక్కడున్నారు?"

"ఆయన అజ్ఞాతవాసంలో వుంటాడు. ఎవ్వరికీ కనిపించడు."

"అబద్ధం. నాలుగేళ్ళ క్రితం వీడే ఆయనకి విషంఇచ్చి చంపేశాడు" అంటూ పక్కగదిలోంచి బైటికి వచ్చాడా వృద్ధుడు.

"దయచేసి అసలు కథేమిటో కాస్త వివరంగా చెప్పండి" అన్నాడు ఉత్తమ్‌కుమార్ ఆయన్ని చూస్తూ.

"ప్రొఫెసర్ విష్ణువరన్‌కు తన ప్రయోగాలూ, పరిశోధనలూ తప్ప మరో ధ్యాస వుండేదికాదు. కొత్త కొత్త ప్రయోగాలతోనూ, చిత్ర విచిత్ర పరిశోధనలతోనూ ఎల్లప్పుడూ మునిగి తేలుతుండేవాడు. నేనాయనకు సహాయకుడిగా వ్యవహరించేవాణ్ని.

ప్రేరిత ఆయన కూతురే! ఆ అమ్మాయి ఐదేళ్ళ పాపగా వున్నప్పుడే ఆయన భార్య మరణించింది. అప్పుడే

ఆయనకో కొత్త ప్రయోగం స్ఫురించింది. తలిదండ్రులూ, బంధుమిత్రులూ ఎవ్వరూ లేక, తామీలోకంలో ఏకాకుల మన్న భావంతో పెరిగే పిల్లల మానసిక స్థితి ఎలా వుంటుంది. వారి శారీరక, మానసిక ఎదుగుదల ఎలా వుంటుంది?

ఈ విషయాలు క్షుణ్ణంగా పరిశీలించి, మన స్తత్వ శాస్త్రంలో మరో కొత్త అధ్యాయాన్ని పొందుపరచా లనుకున్నారాయన. ఆ ప్రయోగానికి తన కన్నకూతుర్నే బలిపెట్టదలచి, ఆమెనో మూగ దాని ప్రాపకంలో వుంచారు. ఆ ప్రయోగంలో ఓ మగపిల్లవాడుకూడా అవ సరమై ఓ అనాథ శరణాలయం నించి, ఎనిమిదేళ్ళ కుర్రాణ్ని దత్తత స్వీకరించారు. వాడే ఈ మధుబాబు!

ఆయన కోరుకున్న విధంగానే అక్కడ ప్రేరితా, ఇక్కడ మధుబాబూ పెరిగి పెద్దవాసాగారు. ప్రతినెలా ఆయన ఒక డాక్టర్ రూపంలో వాళ్ళను పరీక్షిస్తుండే వారు.

ప్రేరితకు పధ్ధెనిమిదేళ్ళు నిండగానే హఠాత్తుగా ఆ మూగముసలిది మరణించింది. దాంతో, ఆ అమ్మాయి బాగోగులు చూసే బాధ్యత నామీద పడింది. ఆ రోజు ల్లోనే ప్రొఫెసర్‌గారు ఎనర్జిన్ ఔషధం గురించి ప్రయో గాలు జరుపుతున్నారు.

పని వత్తిడివల్ల తన ఆ సిపాసుల పర్యవేక్షణా భారా న్నంతా ఆయన నాపై వదిలారు. నేను తరచూ వెళ్ళి ప్రేరితను చూసి వచ్చేవాణ్ని. ప్రతినెలా ఆమె ఖర్చులకు ఐదువందల చెక్కు పంపేవాణ్ని.

అంతలో ప్రొఫెసర్ ప్రయోగం పూర్తయింది. ఎనర్జిన్ మందు తయారైంది. అప్పుడే ఈ విశ్వాసఘాతకు డిలో దురాశ ప్రవేశించింది. సైనైడ్ విషంతో ప్రొఫెసర్ని

చంపేసి, ఆ ఫర్మ్‌లా స్వంతం చేసుకున్నాడు. బ్యాంకు లావాదేవీలన్నీ నా పేరనే వున్నాయిగనక, నన్నిక్కడ ప్రాణాలతో బంధించి, బలవంతంగా పెద్ద మొత్తాల్లో చెక్కులు రాయించుకునేవాడు.

ప్రేరితకు మైనారిటీ తీరగానే ఆమెను వివాహమాడి, ఆ విధంగా ఆమెకు చెందవలసిన అపార ఆస్తిని కాజేయాలనుకున్నాడు... నా లెఖ్ఖ ప్రకారం గతనెల పదవ తేదీతో ప్రేరితకు మైనారిటీ పూర్తయింది'' అంటూ ముగించాడు డాక్టర్ పీతాంబరం.

బంధించబడున్న మధుబాబువైపు చూశాడు ఉత్తమ్ కుమార్.

''ఇప్పుడర్థమైంది అసలు కథ! ప్రేరితకు మైనారిటీ తీరిందని తెలియగానే ఆమెను బలవంతంగా ఎత్తుకెళ్ళి పెళ్ళి చేసుకోవాలని టూ స్టార్ హోటల్ చేరుకున్నావ్. అక్కడ ఆమె వరదరాజన్ అనే వ్యక్తివెంట వుంటుందని తెలిసి, వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారేమోనని అపోహపడి, వరదరాజన్ని కత్తితో పొడిచి చంపేశావ్.

ఆ నేరం సంజయ్‌మీదికి రావాలని ఆ కత్తిని మా గదిలో పడేశావ్. ప్రొఫెసర్ కనిపెట్టిన ఎనర్జీన్ మందుతో లక్షలు గడించాలనుకున్నావ్. చివరికి నీవు గడించింది ఇనప సంకెళ్ళు, జైలు కటకటాలూ!!'' అన్నాడు పిస్తోలు జేబులో వేసుకుంటూ.

—: ఐపోయింది :—

# అంగారక

శ్యాంబాబు

(చివరి భాగం)

"గుడ్ స్వామినాథన్. యు డిడ్ ఎ వెరీ పాస్ట్ వర్క్."

ఇప్పుడు నా రాడార్ స్క్రీన్ మీద ఏ విధమైన చుక్కలు కనిపించడం లేదు. అంటే ఇక్కడికి నాలుగు వందల మైళ్ళలోపు ఏ వాహనమూ తిరగడం లేదన్న మాట. దటీజ్ గుడ్ వర్క్" అన్నాడు విన్నర్ వుత్సాహంగా రేడియోలో.

మద్రాస్ టవర్‌లో కంట్రోలర్ స్వామినాథన్, జంబోలో సిబ్బంది ఊపిరి బిగబట్టి వింటున్నారు హాడో మాటల్ని.

"నా మైడియర్ ఫ్రెండ్స్! నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. మద్రాస్ టవర్ కాపీడౌన్ మై ఇన్‌స్ట్రక్షన్స్ కేర్‌ఫుల్లీ. ఇప్పుడు టైము రెండూ నలభై అయిదు కావస్తుంది. సరిగ్గా నూటయాభై నిముషాల్లో అంటే అయిదూ పదిహేను నిముషాలకు యాభైకోట్లు విలువచేసే బంగారం

మార్క్ మైవర్స్. యాభైకోట్లు విలువ చేసే బంగారం... మద్రాస్ ఎయిర్‌పోర్ట్ రన్‌వేమీద సిద్ధంగా వుంచాలి."

మద్రాస్ కంట్రోల్ టవర్‌లో కన్‌సోల్స్ దగ్గర నిల బడి సంభాషణ వింటున్న సిబ్బంది ఒక్కక్షణం ఊపిరి పీల్చడం మానేసి గుడ్లప్పగించి వినసాగారు. స్వామి నాథన్ మాత్రం నిశ్చలంగా ఒక్కొక్క మాటా పొల్లు పోకుండా తన కాపీ పాడ్ మీద వ్రాసుకొంటూ పోతు న్నాడు.

"ఈ బంగారం ఎక్కడనుండి తేగలమనే పిచ్చిప్రశ్న నన్నడగకండి. రిజర్వుబాంకు దగ్గిర ప్రజలదగ్గర కొల్ల కొట్టిన బంగారం చాలా మూలుగుతోందని నాకు తెలుసు. యాభైకోట్ల రూపాయల విలువకు సరిపడే బంగారం అంటే ప్రస్తుత మార్కెట్ రేటు కె.జి. ఎనభై వేల చొప్పున లెక్కవేస్తే 6250 కే.జీ.ల బంగారం అవుతుంది. బొంబాయి రిజర్వ్ బ్యాంకు వాల్ట్సులో ఆమాత్రం బంగారం సులభంగా దొరుకుతుంది. దొరక్కపోతే జంబో 201 ఖర్మ."

చకచకా వ్రాసుకొంటున్న స్వామి ఒక్క క్షణం ఆగాడు..."పాడో. ఇంత బంగారం నువ్విచ్చిన టైములో బొంబాయినుండి ఇక్కడకు తేవడం అసంభవం. నీకు కావాలంటే ఆ విలువకు సరిపడే కరెన్సీ రూపాయల్లో గాని, విదేశీ కరెన్సీల్లోగాని మద్రాస్ బాంకుల్లో వుంటాయి" అన్నాడు.

"షటప్. మద్రాస్ టవర్ డోన్ట్ ఆర్గ్యూ. నే చెప్పింది చెప్పినట్లు వ్రాసుకొని ఇమిడియెట్‌గా అధికారులకు తెలియజెయ్యి. నా కంటిన్యూ యువర్ నోట్స్.

6250 కె.జి.ల బంగారం బొంబాయినుండి మద్రాసుకు

నలభై నిముషాల్లో తేవచ్చు. అరుంబావు మెట్రిక్ టన్నుల బంగారం నాలుగు సూపర్ సానిక్ జెట్ బాంబర్స్‌లో తేలిగ్గా బొంబాయినుండి మద్రాసు తేవచ్చు. విమానాల బాంబ్ రేక్స్‌లో ఈ బంగారపు దిమ్మెలు పెట్టి తేలిగ్గా తీసుకురావచ్చు. అన్నట్లు ఈ 6250 కేజీలు, సగం ఒక్క కే.జి దిమ్మలలోను మిగతావి అయిదు కే.జి.ల దిమ్మల లోనూ సప్లై చెయ్యాలి. మద్రాస్ టవర్ యూ మై క్లియర్" విన్నర్ గొంతులో పరిహాసం తొంగిచూస్తోంది.

"యస్ పాడో. యూ ఆర్ లౌడ్ అండ్ క్లియర్" అన్నాడు స్వామినాధన్ గొంతులో వణుకు కప్పిపుచ్చుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తూ.

"వెరీ గుడ్. మరో పావుగంటలో మళ్ళీ పిలుస్తాను. అప్పటికి వర్క్ ఎంత ప్రోగ్రెస్ అయింది తెలియజెయ్యి" అన్నాడు పాడో మైక్ స్విచ్ ఆఫ్ చేస్తూ.

*　　*　　*

ఢిల్లీకి మూడు మైళ్ళ దూరంలోవున్న చిన్న సైనిక విమాన స్థావరంలో ఒక జెట్ విమానం చప్పుడు చేస్తూ దిగింది.

ఒక మెటడర్ వాను, ఒక మెర్సిడిస్ కారు విమానం దగ్గరికి శరవేగంతో పరుగులు తీశాయి. విమానంలోనుండి శవపేటిక నొకదాన్ని చకచకా మెటడర్ వాన్‌లోకి లోడ్ చేశారు. శవపేటికతో పాటు ఇంటలిజెన్స్ మనిషి వాన్‌లో ఎక్కాడు. ముఖర్జీ ఎగిరి మెర్సిడిస్‌లో కూర్చున్నాడు. మరుక్షణం రెండు మోటారుకార్లూ ఢిల్లీలోని ప్రధానమంత్రి నివాసంవైపు పరుగులుతీశాయి.

ప్రధానమంత్రి నివాస భవనం అండర్‌గ్రౌండ్ గారేజిలోకి వెళ్ళేవరకూ ఆ కార్లు రెండూ ఎక్కడా వేగం తగ్గలేదు. గారేజిలో ప్రధానమంత్రి కాచుకొని వున్నాడు.

ముఖర్జీ మాట్లాడకుండా శవపేటిక మూత తెరిచాడు. పేటికలోపలి వ్యక్తికూడా ప్రధానమంత్రి పోలికే. కాని ప్రధానమంత్రి కాదు. అతని డమ్మీ.

"పూర్ ఫెలో. డిడ్ హి సఫర్ మచ్?" అన్నాడు ప్రధాని జాలిగా.

"నో. క్షణంలో ప్రాణం పోయింది" అన్నాడు ముఖర్జీ.

తల వూపి మెట్లమ్మట పైగదిలోకి నడిచారు ప్రధాని. ముఖర్జీ గదిలోకి వచ్చి తలుపు మూశాడు.

"థాంక్స్ ముఖర్జీ! నువ్వా డమ్మీ అయిడియా ఇచ్చుండకపోతే, బహుశా ఆ పేటికలో నేను వుండే వాణ్ణనుకొంటాను" అన్నాడు ప్రధాని.

"జస్ట్ ప్రికాషన్. నాట్ మై క్రెడిట్. అసలు ఈ హత్య పురికొల్పిందెవరన్నదే మనకాక్కవలసింది."

"ఏమైనా తెలిసిందా?"

"బహుశా మరో అరగంటలో తెలియొచ్చు. వాడు వుపయోగించిన రైఫిల్ దొరికింది. ఈలోగా అన్ని ఎయిర్ పోర్ట్లు, పాయింట్సాఫ్ ఎగ్జిట్స్ కవర్ చెయ్యమని ఇన్ స్ట్రక్షన్స్ ఇచ్చాను. ఇక ఈ విషయం బయట ప్రపంచానికి తెలియజెయ్యాలా వద్దా అనేదే మీరు నిర్ణయించాలి."

"తెలియజెయ్యాలి. కాని నా బదులు నా డమ్మీ చనిపోయాడని కాదు. నామీద హత్యా ప్రయత్నం విఫలమయిందని. వెంటనే పి.ఆర్.ఓ.,ని పిలు" అన్నాడు ప్రధాని.

మధ్యాహ్నం రెండు గంటల ఇంగ్లీషు వార్తల్లో ఆ వార్త విన్న ప్రజలు ఆశ్చర్యంలో మునిగిపోయారు. కొంతమంది ప్రజానాయకులు భయభ్రాంతులయ్యారు.

ప్రధానమంత్రి బెంగుళూరు సమీపంలోని విశ్రాంతి తీసుకొంటూండగా హెలీకాప్టర్‌పై ఎగురుతూ వచ్చి కొందరు దుండగులు ఆయనపై హత్యాప్రయత్నం చేశారు. ప్రధానికి మృత్యుగండం వెంట్రుకవాసిలో తప్పింది. దుండగులు తప్పించుకొన్నారు. ప్రధాని వెంటనే ప్రత్యేక విమానంలో ఢిల్లీ తిరిగి వచ్చారు.

ఆఫీసుల్లో పని ఆగిపోయింది. ఫ్యాక్టరీల్లో యంత్రాలు ఆగాయి. రోడ్లమీద జనం గుంపులు గుంపులుగా నిలబడి ఇదే వార్త చెప్పుకొంటున్నారు.

* * *

విన్నర్ ఆక్సిజన్ మాస్క్‌లోని గాలి గట్టిగా పీల్చి టైమ్ చూసుకున్నాడు.

మూడుకు ఇంకా రెండు నిముషాలుంది. కమ్యూనికేషన్స్ సెట్ మీది నాబ్ త్రిప్పి రేడియోను మరో ఫ్రీక్వెన్సీ మీదకు ఆన్ చేశాడు.

సరిగ్గా మూడుకు నిముషముందనగా "ఏడకెళ్తివో నారాజా ... గూడుకింకా చేరలేదేమి" అనే ట్యూన్ ఈలపాట పాడాడు మైక్‌లోకి.

వెంటనే సమాధానంగా "అచ్ఛా జా హమ్ చల్ తే హై" అనే హిందీ ట్యూను ఈలపాట వినిపించింది.

విన్నర్ మనసులోనే నవ్వుకొన్నాడు. "మే ది గుడ్ లార్డ్ సీక్ అండ్ బ్లెస్ యు" అనే జిమ్‌రీవ్స్ ఆంగ్లగీతాన్ని ఈలనుండి ఫ్రీక్వెన్సీ మార్చాడు.

మూడయింది.

"మద్రాస్ టవర్! ఆర్ యు దేర్" అన్నాడు మైక్‌లోకి ఉత్సాహంగా.

"యస్, పాడ్రో, గో ఎహెడ్" అన్నాడు స్వామినాథన్ అవతలినుండి.

"ఎలావుంది ప్రోగ్రెస్, బంగారం మద్రాసుకు తరలించే ఏర్పాటు చేస్తున్నారా?" విన్నర్ కంఠంలో కాస్త కాఠిన్యం కనబడుతోంది.

"ఇంకా ఏ విషయం తెలియలేదు. నీ ఇన్‌స్ట్రక్షన్స్ వెంటనే విమానయాన మంత్రిత్వ శాఖకు తెలియచేశాను. యాభైకోట్ల బంగారం అడిగిన వాళ్ళకు ఇచ్చెయ్యడానికి ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియాకు కూడా అధికారంలేదు. కాసేపట్లో కాబినెట్ అత్యవసర సమావేశం జరుగుతుంది. మెసేజ్ వచ్చిన వెంటనే కాబినెట్ నిర్ణయం నీకు తెలియ చేస్తాను" అన్నాడు స్వామినాథన్.

"సిల్లీ ఫూల్స్. అయిదుంబావుకల్లా బంగారంమద్రాస్ ఏర్‌పోర్ట్ టర్‌మాక్ మీద వుండకపోతే ఎయిర్ ఇండియా జంబో జెట్‌తోపాటు రెండువందల పైచిలుకు పాసింజెర్లు బంగాళాఖాంతంలో కలిసిపోతారని వాళ్ళకు గుర్తులేక పోతే...అది ఈదేశం ఖర్మ."

జంబో జెట్ విమానంలోనుండి ఈ సంభాషణంతా వింటున్న ముగ్గురు చోదకులకు గుండెల్లో రాకెట్లు పరిగెట్టాయి. కెప్టెన్ విజయరాం ముఖంలో కండరాలు బిగుసుకున్నాయి.

"షిట్! యు ఆర బాస్టర్డ్! ఎవరో రాజకీయనాయకులు తీసుకోబోయే నిర్ణయానికి మా అందరి ప్రాణాలు తీసుకోవడం అమానుషం" అరిచాడు విజయరాం కోపంగా.

ఇయర్ ఫోన్స్‌లో విన్నర్ నవ్వు చిత్రంగా వినిపించింది. "మైడియర్ విజయరాం, ఖంగారు పడకు. మీ చావో, బ్రతుకో తేలడానికి ఇంకా రెండుగంటలు పైనే వ్యవధి వుంది."

"డామ్‌యూ. మమ్మల్ని చంపి తప్పించుకు పోగలవా

నువ్వు. ఇలాంటి దారుణం చేశాక ప్రభుత్వం నిన్నో కుక్కలా కాల్చి చంపుతుంది తెలుసా అసలు..." వేణు గట్టిగా నొక్కాడు విజయరాం భుజాన్ని ఆవేశపడవద్దు అన్నట్లు.

"వెరీ అన్ వైజ్ ఆఫ్ యు కెప్టెన్! నా ఒక్కడి ప్రాణాలకోసం మీ అందరి ప్రాణాలు తీస్తుందనుకోను ప్రభుత్వం. ఎనీహౌ! ముందు కార్యక్రమం చూద్దాం... మద్రాస్ టవర్. వింటున్నావా?"

"యస్ షాడో, అయామ్ హియర్."

"గుడ్, కాబినెట్ వాళ్ళు నిర్ణయం తీసుకొనేలోపల మరో ఇన్‌స్ట్రిక్షన్ వ్రాసుకో. జాగ్రత్తగా ఏ మాత్రం తేడా రాకుండా ప్రతి అక్షరం నోట్ చేసుకో. ఓ.కె"

"ఓ.కే. షాడో ప్రొసీడ్" అన్నాడు స్వామినాథన్ చమటలు కక్కుతూ.

"ఇప్పుడు నా వాచీలో మూడుగంటల రెండునిమిషాలయింది. సరిగ్గా మూడుగంటల ఇరవై నిముషాలకు మౌంటురోడ్డు కెన్నడీ బుక్‌స్టాల్ దగ్గరకు క్రిష్టియన్ ఫాదర్ ఒకతను వస్తాడు. సరిగ్గా ఆ సమయానికి మద్రాస్‌పోలీస్ కమీషనర్, మరో పదిమంది సాయుధులయిన పోలీసులతో మంచి రన్నింగ్ కండిషనులోవున్న వ్యానులో సిద్ధంగా వుండాలి.

దయచేసి ఆ మనిషిని అరెస్ట్ జెయ్యడంగాని, పట్టి బంధించడానికిగాని ప్రయత్నం చెయ్యకండి. అతను వేసుకొనే అంగీలోపల నడుముచుట్టూ బెల్టుకు డయినమేటు అమర్చివుంది. అతన్ని ఏమాత్రం బంధించాలని చూసినా క్షణంలో ఆ డయినమేటు ప్రేలేలా చెయ్యగలడతను. ఆ ప్రేలుడుకు చుట్టుప్రక్కల ఇరవై గజాల్లో

ఏమీ మిగలదని గుర్తుంచుకోండి. అతని ఆజ్ఞల్ని కమీషనర్, అతని సాయుధ సిబ్బంది తు. చ. తప్పకుండా పాటించాలి. ఏం చెయ్యాల్సింది అతను చెబుతాడు.

ఆకాశంలో ఎగురుతున్న నావ అతనికి సహకారం చేసిందీ లేనిదీ ఎలా తెలుస్తుందని పిచ్చివూహాలు చేయకండి. సరిగ్గా మూడూ ఇరవై కి అతన్నుండి నావసిగ్నల్ రాకపోతే జంబోవు లోకభాగం కనిపించదని గుర్తుంచుకోండి.

ఓ.కె. నువ్వు వ్రాసుకున్న విషయం ఓసారి చదివి వినిపించు'' పాడో అగాడు.

స్వామినాథన్ శ్రద్ధగా లాంగ్ హాండ్ లో వ్రాసుకున్న విషయమంతా చదివి వినిపించాడు.

''గుడ్, నా గెటాన్ విత్ ది ఇన్‌స్ట్రక్షన్స్. ఐదు నిముషాల్లో ఏం జరుగుతున్నదీ చెప్పు'' అరిచాడు పాడో.

''ష్యూర్ ... ష్యూర్'' అన్నాడు స్వామినాథన్ అప్పటికే టవర్‌లోవచ్చి నిలబడివున్న ఇంటలిజెన్స్ డిపార్ట్‌మెంటు మనుషుల్ని, పోలీసుల్ని రమ్మని సైగ చేస్తూ.

* * *

కాబినెట్ సమావేశం ప్రారంభమయింది.

పన్నెండుమంది కాబినెట్ మంత్రులు టేబుల్‌కు అటు యిటు కూర్చునివున్నారు. టేబుల్ హెడ్ వైపు ప్రధాని కూర్చున్నాడు. సాధారణ ఉపోద్ఘాతం యేమీ లేకుండానే ప్రధాని మాట్లాడ్డం ప్రారంభించాడు.

''ఈ అత్యవసర సమావేశం యెందుకు యేర్పాటు చేశానో మీకింతకు పూర్వం టెలిఫోన్‌లోనే తెలిసి వుంటుంది. మొదటిది నామీద హత్యాప్రయత్నం, రెండ

వది మద్రాసునుండి టోక్యో వెళుతున్న మన జంబోని ఎవరో జెట్ ఫైటర్‌తో వెంబడిస్తూ హైజాక్ చెయ్యడం.

హెలీకాప్టర్ మీద ఎగురుతూవచ్చి నన్ను చంప ప్రయత్నించారంటే, ఇందులో విదేశీ గూఢచారులకుట్ర, వారికి మనదేశంలో అధికారమో, పలుకుబడో వున్న వ్యక్తుల సహకారం వుందనే విషయం నిర్వివాదాంశం.

మన ఇంటిలిజెన్స్ మనుషులూ, స్పెషల్ బ్రాంచి వాళ్లు ప్రస్తుతానికి దేశంలోనుండి పిట్టకూడా బయటకి పోకుండా కాపలా కాస్తున్నారు. బహుశా దీనికి కారణమైన వ్యక్తులగురించిన మొదటి క్లూ మరో కాసేపట్లో తెలుస్తుందని ఇంటలిజెన్స్ వాళ్ళు అన్నారు.'' ప్రధాని ఒక క్షణం ఆగి అందరి ముఖాల్లోకి పరీక్షగా చూశాడు.

''మన ప్రధానిని హత్యచేయ బూనడం ప్రజాస్వామ్యాన్ని హత్యచేయడం లాంటిది. ఈ చర్యను తీవ్రంగా ఖండిస్తూ వెంటనే ఓ తీర్మానం చెయ్యాలి మనం'' అన్నారో మంత్రిగారు.

మంత్రి వర్గమంతా తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది.

''ఇది సి. ఐ. ఏ కుట్ర అనడంలో సందేహంలేదు'' అన్నాడు ఈమధ్యే రష్యా పర్యటించి వచ్చిన మరో మనిషి.

''ఎవరామాట అన్నది. రష్యా కె. జి. బి. వాళ్ళే ఇలాంటి పనులు చెయ్యడంలో సిద్ధహస్తులు'' అన్నారు హోం మంత్రి మండిపడుతూ.

''నాన్‌సెన్స్! అసలు దేశీయ అంతరంగిక భద్రత వెయ్యికళ్ళతో కాపాడవలసింది నువ్వు. ఇలా జరగడానికి కారణం హోం మినిస్ట్రీ అసమర్ధతే. ఈ విద్రోహ చర్యకు బాధ్యత నీదే కనుక నువ్వు వెంటనే రాజీనామా

చెయ్యాలి'' అన్నారు హోంమంత్రి అంటే కిట్టని మరో మంత్రి.

తన సహచరులవైపు తీవ్రంగా చూశాడు ప్రధాన మంత్రి. "ఫ్రెండ్స్! కీచులాటలకు సమయంకాదిది. దేశంలో పోలీసు శాఖలన్నీ ఈ హత్యాప్రయత్నంవెనుక రహస్యాన్ని ఛేదించడానికి కృషిచేస్తున్నయ్. ప్రస్తుతానికి నాకొచ్చిన ప్రమాదం ఏమీ లేదు. తిరిగి ఇలాంటి సంఘటన జరగకుండా మన సెక్యూరిటీ ఛీఫ్ పథకాలు తయారు చేస్తున్నాడు. ఆ తవరకూ తగిన రక్షణలేకుండా ఎవ్వరూ పబ్లిక్ మీటింగ్స్‌కు వెళ్ళడంగాని, మీ ఇళ్ళు వదలి రావడంకాని చెయ్యకండి.''

మంత్రులందరూ ప్రధాని చెప్పే విషయం శ్రద్ధగా వింటున్నారు.

"ఇంకా జంబో హైజాకింగ్ విషయం. గుర్తుతెలియని మనిషొకడు మధ్యాహ్నం రెండు గంటలకు టోక్యో వెళుతున్న జంబోని జెట్ ఫైటర్ ఒకదానిలో వెంటాడి హైజాక్ చేశాడు. సాయంత్రం అయిదుంబావు లోపున యాభైకోట్లు విలువచేసే బంగారం అంటే దాదాపు 6250 కే.జీ.లు మద్రాస్ ఎయిర్‌పోర్ట్‌లోకి చేర్చకపోతే జంబోని తన రాకెట్లతో కూల్చేస్తానని బెదిరిస్తున్నాడు.''

"ఆ జెట్ ఫైటర్ ఎవరిది? మన దేశందేనా? లేక విదేశస్తులెవరయినానా?'' అడిగాడు మంత్రి.

"ఆ జెట్ మన దేశంది మాత్రం కాదని ఖచ్చితంగా తెలుస్తోంది. మనదేశపు ఎయిర్ ఫీల్డ్‌లకు సంబంధించిన ఎయిర్ ఫోర్స్ జెట్స్ అన్నీ ఆయా బేస్‌లలోనే, మార్గమధ్యంలోనే సురక్షితంగానే వున్నాయి. హైజాకింగ్ సంగతి తెలిసిన వెంటనే మన మిలటరీ ఇంటెలిజెన్స్ వాళ్ళు మన ప్లేన్స్‌ను అన్నిటినీ చెక్ చేశారు'' అన్నాడు

డిఫెన్స్ మినిష్టర్ జరిగిన విషయానికి నా బాధ్యతేమీ లేదు, మీ రెవ్వరూ నా రాజీనామా కోరకండి అన్న ధోరణిలో.

"నిజమే. ఆ జెట్ మనది కాకపోవచ్చని ఇంటిలిజెన్స్ వాళ్ళు అంటున్నారు. జంబో టేకాఫ్ చేసిన ఓ నిముషానికి లాండింగ్ చేసిన మరో 'ఎయిర్ ఇరాన్' విమానం పైలట్, జంబో వెనకే పైకి ఎగబ్రాకుతున్న జట్‌ను చూశాడట. ఏదో క్రొత్తరకం విమానంలా వుందని అన్నాడట అతను. మన ఆర్మీ ఇంటెలిజెన్స్ వాళ్ళు ప్రస్తుతం అతన్ని డిబ్రీఫ్ చేస్తున్నారు" అన్నాడు హోం మంత్రి.

"ఓ.క...ఓ.క...దటీజ్ ది న్యూస్. ఇప్పుడు మన ముందున్న ప్రశ్న ఒక్కటే. హైజాకర్ అడిగినట్లుగా బంగారం ఇవ్వడమా? వద్దా? అని" అన్నాడు ప్రధాని.

"బంగారం ఇవ్వకుండా ఆ హైజాకర్‌ని పట్టుకోవడం సాధ్యంకాదా? బహుశా యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్ తోనో, సర్‌ఫేస్ టు ఎయిర్ మిస్సియిల్‌తోనో వాడి విమానాన్ని కూల్చివేయడం కుదరదా?" ఇది ఫైనాన్స్ మంత్రి ప్రశ్న.

"తెలివి తక్కువ ప్రశ్న. అలా చేసే అవకాశం వుంటే ఈ సమావేశం అనవసరం. డైరక్టుగా మిస్సైల్‌తో చివరి క్షణంలో రాకెట్ ప్రేల్చినా జంబో తుత్తునియలౌతుంది. అదీగాక పొరపాటున గురిలో ఒక్క అంగుళం తేడా వచ్చినా మిస్సైల్ జెట్‌కు బదులు జంబోకు తగుల్తుంది" డిఫెన్స్ మినిష్టర్ అన్నాడు.

"మరో విషయం. వాడుఅంత బంగారాన్ని ఏ విధంగా తీసుకెళతాడన్నది ఇంతవరకూ చెప్పలేదు. ఎయిర్‌పోర్ట్‌కు

చేర్చమన్నాడు. అంతే. చేర్చినంత మాత్రాన నష్టమే ముందిక్?''

''మోరోవర్. బంగారం ఇవ్వకుండా ప్రయాణికుల ప్రాణాలు బలిపెట్టినట్లు బయటప్రపంచానికి తెలిస్తే మన నీచత్వాన్ని దుమ్మెత్తిపోస్తారు.''

''దుమ్మెత్తిపొయ్యడం కాదు. అపోజిషన్ వాళ్ళు రివల్యూషన్ తెచ్చి మనల్ని పబ్లిక్ గా ఉరితీస్తారు'' అన్నారు వ్యవసాయ మంత్రి.

ప్రధానమంత్రి ప్రక్క నేవున్న ఫోన్ మ్రోగింది. అందరూ భయంగా ఫోన్ వైపు చూశారు.

ప్రధాని ఫోన్ లో రెండు నిముషాలు విని ''గుడ్ వర్క్! నిముషంకన్నా పట్టదు'' అని ఫోన్ పెట్టేశాడు.

''వెల్ జంటిల్ మన్! నన్ను హత్యచెయ్యాలని ప్రయత్నించిన వాణ్ని పట్టుకోవడంకోసమైనా ఆ జంబోని సురక్షితంగా దింపక తప్పదు.''

''వాట్ డు యు మీన్?'' హోం మినిష్టరు ప్రశ్న.

''ఆ అస్సాసిన్ హైజాక్ చేయబడిన జంబోలో వున్నట్లు నన్ను చంపడానికి వుపయోగించిన రైఫిల్ మీది వేలిముద్రలు బట్టి కనుక్కొన్నారు స్పెషల్ బ్రాంచి. సో! యాభైకోట్ల బంగారం హైజాకర్ కి ఇవ్వడానికి మీ కెవరికీ అభ్యంతరం వుండదనుకొంటాను'' అన్నాడు ప్రధాని.

లేదన్నట్లు తల వూపారు అందరూ.

సరిగ్గా మూడు పదిహేను నిముషాలకు బోంబే ఎయిర్ పోర్ట్ లో నాలుగు సూపర్ జెట్ చాంబర్లలో బంగారపు దిమ్మల లోడింగ్ మొదలయింది.

* * *

మూడుగంటల ఇరవై నిముషాలయింది.

మద్రాస్ పోలీస్ కమీషనర్ పదిమంది సాయుధ పోలీసులతో మౌంట్ రోడ్‌లోని కెన్నడీ బుక్ సెంటర్ వద్ద పోలీస్ వాన్‌లో సిద్ధంగా నిలబడి వున్నాడు. దూరంగా గుర్తు తెలియని కార్లలో కొంతమంది స్పెషల్ బ్రాంచి మనుషులు కాచుకొని వున్నారు.

రివ్వున ఓ టాక్సీ వచ్చి పోలీస్ వాన్ ప్రక్కన ఆగింది. క్రిష్టియన్ మిషనరీలా తెల్లటి పొడుగాటి అంగీ, బవిరి గడ్డం, నెత్తిమీద ఫెల్టు హాటు పెట్టుకొన్న వ్యక్తి ఒకడు టాక్సీలో నుండి పెద్ద మూటతో క్రిందికి దిగాడు.

కమీషనర్ అతన్ని నోరు వెళ్ళబట్టి చూశాడు. కమీషనర్‌ని దగ్గరకు రమ్మన్నట్లుగా సైగ చేశాడా వ్యక్తి... సాయుధ పోలీసులందరూ అతని పొట్టదగ్గర అంగలో నుండి బయటకు కనిపిస్తోన్న ఎలక్ట్రిక్ స్విచ్ లాంటి దాని వైపు మంత్రించబడిన వాళ్ళకు మల్లే చూస్తున్నారు.

కమీష్నర్ దగ్గరకు రాగానే అతనిమీదకు వంగి చెవిలో, "వెంటనే పారిస్ కార్నర్‌కు వెళ్ళాలి. మీవాళ్ళ నందరినీ వాన్‌లో ఎక్కమని చెప్పు. పిచ్చివేషాలు వెయ్యక... ఈ స్విచ్ నొక్కితే నాతోపాటు మీరందరూ పరలోకయాత్ర చెయ్యాల్సి వుంటుంటుంది" అన్నాడు మిషనరీ.

కమీషనర్ తల వూపి ఆజ్ఞలు జారీచేశాడు. తనతో పాటు కమీషనర్‌నికూడా రమ్మని తలవూపి వేన్ వెనక భాగంలో ఎక్కి కూర్చున్నాడు మిషనరీ... కమీష్నర్ తప్పనిసరైనట్లు ముఖంపెట్టి వేన్‌లో ఎక్కాడు. మిషనరీ తన చేతిలోని పాకెట్ సైజు రేడియో ట్రాన్సిస్టర్‌లో ఏదో ఈలపాట వేశాడు.

పోలీస్ వాన్ పది నిముషాల్లో పారిస్ కార్నర్ చేరుకొంది. నేషనల్ గ్రిండ్లే బ్యాంక్ ముందు వాన్ ఆపిం

చాడు మిషనరీ. గబగబా కమీషనర్ చెవిలో చెప్పాడు. కమీషనర్ పదరదన్నట్లు తల ఆడించాడు. మిషనరీ తన పొట్టదగ్గరి స్విచ్ వైపు, చేతిలో రేడియోవైపు చూపించి ఏదో అన్నాడు.

కమీషనర్ చకచకా ఆజ్ఞలు జారీచేశాడు.

మరుక్షణం సాయుధ పోలీసులందరూ బ్యాంకులో జొరబడ్డారు. పోలీసుల వెనక కమీషనర్ రివాల్వర్ బయటికి తీసి మిషనరీతో పాటు లోపలకు నడిచాడు. మిషనరీ తెచ్చిన మూటలోని పెద్దపెద్ద ప్లాస్టిక్ సంచులు ఇద్దరు పోలీసుల చేతుల్లో వున్నాయి.

పోలీసుల్ని చూసి బాంకు గార్డు బిత్తరపోయి నిల బడ్డాడు. బాంకు గార్డును లోపలకులాగి తలుపులువేసి, చకచకా సేఫ్టీ వాల్ట్ వైపు నడిచారు పోలీసులు. అరడజను మంది పోలీసులు తుపాకులతో బెదిరిస్తూ వుంటే, మిగిలిన నలుగురూ చకచకా వాల్ట్‌లోని కరెన్సీ కట్టల్ని నాలుగు ప్లాస్టిక్ సంచుల్లో కుక్కసాగారు.

బాంకు మేనేజరు, సిబ్బంది నోటమాటలేక, కంటి చూపు లేనట్లు నిలబడిపోయారు పోలీసుల ఆధ్వర్యంలో జరుగుతున్న ఈ అఘాయిత్యం చూసి.

నాలుగు బ్యాగ్‌లు నిండగానే 'చాలన్నట్లు' కమీష నర్‌కి సైగచేశాడు మిషనరీ.

తారుమారైన తమ వుద్యోగ బాధ్యతకు గొణుక్కుంటూ పోలీసులు నాలుగు సంచుల్తో వాన్లో ఎక్కారు. పోలీస్ వాన్ తిరిగి మౌంట్ రోడ్ వైపు దూసుకుపోయింది.

"వాటీజ్ దిస్! పోలీసులే ఇలా బ్యాంకు దోపిడీలు చేస్తుంటే ప్రజలకు దిక్కేమిటి?" వ్యాన్ వెళ్ళగానే మద్రాస్ రేంజ్ ఐ.జి. మీద విరుచుకు పడ్డాడు గ్రిండ్లేస్

బ్యాంక్ మానేజరు.

"వెయిలేట్ మినిట్ మిష్టర్...ఎంతపోయింది?" ఐ.జి గొంతులో ఎక్కడో చిన్న నవ్వు.

"ఎంతా? గుండె పగిలిపోతుంది. ముప్పై లక్షలు... హార్డ్ కేష్. నంబర్లు నోట్ చేసుకొనే వ్యవధిగాని, వాటి మీద ఏవైనా గుర్తులు పెట్టే అవకాశంగాని లేకపోయింది. దాదాపు అన్ని యూజ్డ్ నోట్స్. తిరిగి ట్రేస్ చెయ్యగల అవకాశం తక్కువ" బ్యాంక్ మేనేజర్ మొత్తుకుంటు న్నాడు.

"డోన్ట్ వర్రీ...ప్రభుత్వం కాంపెన్ సేషన్ ఇస్తుంది లెండి" అని ఐ.జి. ఫోన్ పెట్టేశాడు.

* * *

జంబో జెట్ లోని ప్రయాణీకుల స్థితి అయోమయంగా వుంది. మద్రాస్ ఎయిర్ పోర్ట్ వదిలి గంట దాటినా ఇంకా తీరంలోనే గుండ్రంగా తిరగడం విమాన యానంలో అనుభవమున్న ప్రయాణికులకు అర్థంకాలేదు. విషయం అందరికీ తెలిసి ఎయిర్ హోస్టెసిస్ను ప్రశ్నలతో చంపు తున్నారు.

జయపాండ్యన్ మనసులో రైళ్ళు పరిగెత్తడం మొదలుపెట్టాయి. ప్రధానిపై హత్యాప్రయత్నంగావించి, టేకాఫ్ చేయబోతున్న విమానంలో అడుగుపెట్టి ఎంతో రిలీఫ్ గా ఫీలయ్యాడు. ఆ రిలీఫ్ కాస్తా మళ్ళీ గంటలోనే చెప్పలేని యాంగ్జయిటీగా మారిపోయింది.

కేప్టెన్ విజయరాం చాలాసేపు దీర్ఘంగా ఆలోచిం చాడు. అయిదుంబావు వరకూ ఎలాగూ ఆకాశంలో నూట ఎనభై డిగ్రీల్లో ప్రదక్షిణ తప్పదు. అంతసేపు ప్రయాణీ కుల్ని కంట్రోలుచేసి వుంచడంఅసాధ్యం. అదీగాక జరుగు తున్న దేమిటో తెలుసుకొనే హక్కు వారికుంది. ఇంటర్

కమ్ మైక్ తీసి స్విచ్ ఆన్ చేశాడు... మళ్ళీ క్షణం ఆలోచించి స్విచ్ ఆఫ్ చేసి కోపైలట్‌ను కంట్రోల్ తీసుకోమని చెప్పి కాబిన్‌లోనుండి మెయిన్ కాబిన్‌లోకి నడిచాడు.

కేప్టెన్‌ను చూడగానే ప్రయాణీకులందరూ క్షణం నిశ్శబ్దమయ్యారు.

"గుడ్ ఈవినింగ్ లేడీస్ అండ్ జంటిల్మన్! అయామ్ యువర్ కెప్టెన్ విజయరాం" అన్నాడు విజయరాం ఉపోద్ఘాతంగా.

"కెప్టెన్! వాట్ ది హెల్ గోయింగాన్!" అరిచాడో ప్రయాణీకుడు.

శాంతించమన్నట్లు చేతులతో సైగ చేశాడు విజయరాం.

"డియర్ పేట్రన్స్! కాస్త ఆందోళన కలిగించే వార్త చెప్పవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను. మన విమానాన్ని గుర్తుతెలియని జెట్ విమానం ఒకటి వెంబడిస్తూ మనల్ని హైజాక్ చేసినట్లు బెదిరిస్తోంది. అయిదుంబావు లోపున యాభైకోట్ల బంగారం ఇవ్వకపోతే రాకెట్లు పేల్చి మన జంబోను కూల్చేస్తానని బెదిరిస్తున్నాడు హైజాకర్. హైజాకర్ అడిగిన మొత్తాన్ని ఇవ్వడానికి ప్రభుత్వం ఒప్పుకొంది. ఆ మొత్తం హైజాకర్ చేతికి రాగానే మనం తిరిగి ప్రయాణం సాగిస్తాం" అన్నాడు విజయరాం ఒక్కొక్క మాటనే స్పష్టంగా పలుకుతూ.

విమానంలో నిశ్శబ్దం ఘనీభవించింది. తను చెప్పినవార్త ప్రయాణీకులనందరినీ షాక్ చేసిందని తెలుసు విజయరాంకు.

"టేకిట్ ఈజీ ఫోక్స్...వుయ్ విల్ బి ఓకె..." అన్నాడు జాలిగా.

వెనక వరుసలో ఎవరో స్త్రీ వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టింది.

* * *

"డిసీజ్ షాడో కాలింగ్. మద్రాస్ టవర్. ఆర్ యు దేర్?" సరిగ్గా మూడుగంటల నలభై అయిదు నిముషాలకు మైక్ ఆన్ చేశాడు విన్నర్.

"యస్ ... షాడో ... అయామ్ హియర్" స్వామి కంఠం.

"టేక్ వన్ మోర్ ఇన్‌స్ట్రక్షన్."

"కారియాన్ ... నేను కాపీ చేసుకొంటున్నాను."

"ఏర్‌ఫోర్స్ యాంఫిబియన్ సీప్లేన్. ఎక్కడిది అని అడగొద్దు...గిండీ బేస్‌లో అలాంటి విమానం ఒకటి వుందని నాకు తెలుసు...టాంక్స్‌నిండా ఫ్యూయిల్ పోసి నాలుగుపది నిముషాలకల్లా మద్రాస్ ఎయిర్‌పోర్ట్‌లో సిద్ధంగా వుంచాలి. అండర్‌స్టాండ్."

"యస్...ఐ రీడ్ యు."

"గుడ్...బొంబాయినుండి సూపర్ సానిక్స్ వచ్చే వేళ ఎప్పుడు?"

"సరిగ్గా అయిదింటికి ఎయిర్‌పోర్ట్‌కి వస్తాయి."

"రైట్...సరిగ్గా నార్త్‌నుండి 240 వి.వో. నుండి ఎయిర్‌పోర్ట్ అప్రోచ్ అవమని చెప్పు...నా రాడార్ స్క్రీన్ మీద వాటి మూమెంట్స్ వాచ్ చేస్తూ వుంటాను. ఏమాత్రం ఈ రెండు విమానాల ప్రాంతాలకు వస్తున్నట్లు తోచినా జంబోని కూల్చిపారేస్తాను. ఓ.కే?"

"ఓ.కే. అర్థమయింది."

"గుడ్..." అన్నాడు విన్నర్ మిషనరీ చేతిలోని రేడియో ఫ్రీక్వెన్సీకి నాబ్ డయిల్ చేస్తూ.

* * *

కల్నల్ కపూర్ నుదిటిమీద చెమట ధారగా కారుతోంది...అతని కెదురుగా కూర్చున్న వ్యక్తి అతన్ని తీక్షణంగా చూస్తున్నాడు.

"ఆపరేషన్ సక్సెస్‌ఫుల్ కాకపోయినా ఆపాండ్యన్ గాడు తప్పించుకుపోయేవాడే బాస్. కాని ఆ హైజాకర్ వల్ల కొంపలంటుకున్నాయి ఇప్పుడు. విమానం మద్రాసుకు తిరిగి రాకపోయినా, కౌలాలంపూర్‌లో వాడు దిగగానే ఎయిర్‌పోర్ట్ పోలీసులు అరెస్ట్ చేస్తారు" అన్నాడు కపూర్ చెమట తుడుచుకొంటూ.

"ఎస్, ఎక్స్‌పర్ట్ షూటర్ అని జైలులోంచి తెచ్చావు వాణ్ని. ఇప్పుడు వాడు దొరికితే, తీగలాగితే డొంకంతా బయటపడుతుంది. నీకూ, నాకూ వురి తప్పదు. ఆ జంబో టోక్యోకి వెళ్ళే ప్రసక్తి లేదు. సాయంకాలం అయిదుం బావు కరకూ ఇక్కడేవుంటే ఫ్యూయల్ చాలదు. తప్పనిసరిగా వెనక్కి తెచ్చి ఫ్యూయల్ నింపి పంపిస్తారు. అంటే పాండ్యన్‌ను మద్రాస్ ఎయిర్‌పోర్ట్‌లోనే అరెస్ట్ చేస్తారు" అన్నాడతను.

"ఆర్ యు ష్యూర్."

"యస్. ఇక నేను నీకు చెప్పవలసిందేమీ లేదనుకుంటాను."

"అర్థమయింది సార్."

"మరొక్క విషయం. ఎయిర్‌పోర్ట్‌లో మొదట జయపాండ్యన్‌ను గుర్తుపట్టి ఆపబోయాడు ఒక ఇంటిలిజెన్స్ మనిషి. చివరి క్షణంలో మనవాడు ఆ ఫ్లయిట్‌లో వెళ్ళేవాళ్ళని ఎవర్నీ అరెస్ట్ చెయ్యొద్దని చెప్పడంతో ఆగిపోయాడు. వాడే జయపాండ్యన్ ఆ విమానంలో వున్నట్లు చెప్పింది. వాణ్ని అధికారులు డిబ్రీఫింగ్‌కు పిలవకముందే మనం కలుసుకోవాలి."

"యస్ సార్ అలాగే సార్ —" అన్నాడు కపూర్ త్వరగా బయటికి నడుస్తూ.

*　　*　　*

పోలీస్ వ్యాన్ మౌంటురోడ్డులోకి రాగానే వ్యానును తిన్నగా బొమ్మిడియార్ జూలర్స్ షాపువైపు నడపమని చెప్పాడు మిషనరీ.

బొమ్మిడియార్స్ జూలెర్స్ సౌతిండియాలో పెద్ద వజ్రాల వ్యాపారులు. వాళ్ళ షోరూం ఒక్కటే రెండు కోట్లరూపాయలకు ఇన్ష్యూరెన్స్ చేశారని చెప్పు కుంటారు.

మిషనరీ పద్ధతి రెండవసారి ప్రత్యేకంగా పోలీసులకు వివరించవలసిన అవసరం లేకపోయింది. కమీషనర్ మాట వింటూనే ఉత్సాహంగా అందరూ షాపులో జొరబడ్డారు. షాపుగుమ్మాన్ని నలుగురు పోలీసులు, లోపల ఇద్దరు పోలీసులు రైఫిల్స్‌తో కాపలా కాస్తూంటే, బిత్తరపోయి చూస్తోన్న కస్టమర్సుని, ప్రొప్రయిటర్ని, సేల్సుమన్ని ఎగతాళిగా చూస్తూ అరల్లోని వజ్రాలు, నగలు, కెంపులు ఇతరములైన రాళ్ళు సంచుల్లోనింపారు పోలీసులు. పావుగంటలో రెండుసంచులు నిండాయి.

ఇక చాలన్నట్లు కమీషనర్కి సైగచేశాడు మిషనరీ. నిమిషంలో అందరూ వాన్‌లో ఎక్కి కూర్చున్నారు.

మరునిముషంలో పోలీస్ వేన్ ఎయిర్‌పోర్ట్ వైపు పరుగులు తీసింది.

*   •   *

"మద్రాస్ టవర్. ఇసీజ్ షాడో కాలింగ్" పిలిచాడు విన్నర్.

"అయామ్ హియర్ షాడో."

"గుడ్. మరో అయిదు నిమిషాల్లో మా మిషనరీ పోలీస్ వ్యాన్లో ఎయిర్‌పోర్ట్‌కు వస్తున్నాడు కమీషనర్‌తో సహా. ఆ వాన్ తిన్నగా టర్‌మార్క్ మీదకు వెళ్ళే ఏర్పాటు చెయ్యి."

"ఆల్ రైట్" అన్నాడు స్వామి ప్రక్కనే మరో కన్సోల్ దగ్గర సంభాషణ వింటున్న ఎయిర్‌పోర్ట్ సెక్యూరిటీ ఛీఫ్‌కు సైగ చేస్తూ.

"మద్రాస్ టవర్. మరో విషయం, ఆ సీ ప్లేన్‌కు ఏ రకమయిన రాడార్ పరికరాలు అమర్చడం మంచిదికాదని చెప్పావా?"

"అఫ్‌కోర్స్! ఇటీజ్ క్లీన్."

"గుడ్, ఇకనుండి ప్రతిక్షణం కన్సోల్ దగ్గరేవుండు. ప్రతి అయిదు నిముషాలకూ ఇన్‌స్ట్రక్షన్స్ యిస్తాను... జంబో...ఆర్ యు దేర్" పిలిచాడు విన్నర్.

"అయాం లిజనింగ్ పాడ్!" అన్నాడు విజయరాం.

"గుడ్...కీప్ లిజనింగ్!"

విన్నర్ గడియారంలో అయిదూ అయిదయింది.

* * *

పోలీస్‌వాన్ తిన్నగా ఎయిర్‌పోర్ట్ టార్మాక్ మీద సిద్ధంగా వున్న యాంఫిబియన్ సీప్లేన్ వద్ద ఆగింది.

యాంఫిబియన్ సీప్లేన్ నీటిమీదా, గాలిలోనూ నడిచే ఆధునిక విమానం. నిజానికి రెండవప్రపంచ యుద్ధంలోనే ఇలాటి విమానాలను జర్మనీ తయారుచేసింది.

మిషనరీ డైరెక్షన్‌తో వాన్‌లో తెచ్చిన ప్లాస్టిక్ సంచులన్నీ, కొన్ని బంగారపు దిమ్మల్ని, సీప్లేన్‌లో లోడ్ చేశారు. హాండ్ ట్రాన్స్మిటర్‌లోకి మళ్ళీ ఈలపాట వేశాడు.

అటునుండి రిప్లై రాగానే కమీషనర్‌ని దగ్గరకు రమ్మని పిలిచాడు.

"నేను మళ్ళీ ఓ అరగంటలో తిరిగివస్తాను. అప్పుడు మిగిలిన బంగారపు దిమ్మల్ని తీసుకెళతాను. మొత్తం ఆరుంబావు టన్నుల బరువు ఈ ప్లేన్ మొయ్యలేదు...

ఎంత లేదన్నా మరో రెండుత్రిప్పులు వెయ్యాలి. సో...
నేను మళ్ళీ వచ్చేవరకూ ఆ బంగారపు దిమ్మల దగ్గరకు
ఎవర్నీ రానీయకండి'' అన్నాడు రహస్యంగా.

కమీషనర్ ఆనందంగా తలవూపాడు.

సీప్లేన్‌లో ఎక్కి ఇంజన్ స్టార్ట్ చేశాడు మిషనరీ.

లైమ్ పావుతక్కువ ఆరుకావస్తోంది. అప్పుడే చీకటి
పడుతోంది. ఎయిర్‌పోర్ట్ అంతా లైట్లు వెలిగాయి.

లైట్ల వెలుగులో తళతళలాడుతూ మిగిలిపోయిన ఐదు
టన్నుల బంగారాన్ని జాలిగా చూసి సీప్లేన్‌ని ముందుకు
పోనిచ్చాడు మిషనరీ.

*　　　*　　　*

''హలో మద్రాస్ టవర్...''

''యస్...అయామ్ హియర్''

''సీప్లేన్ ఇప్పుడు బయలుదేరుతుంది, రాడార్‌పై
దాన్ని ట్రాక్ చేసే ప్రయత్నం చెయ్యకండి.''

''లేదు...అలాంటి ప్రయత్నం చెయ్యడంలేదు.''

''ఓ.కే. జంబో...యుకీప్ సర్కిలింగ్...ఈ బాధ
మరో గంటన్నర మీకు తప్పదు.''

''ఆల్‌రైట్'' అన్నాడు విజయరాం.

ఎదురుగావున్న జంబోనుంచి మెల్లిగా స్పీడ్ కట్ చేసి
అంగారకను క్రిందకు దింపసాగాడు విన్నర్...

ఓ వంద అడుగులు క్రిందకు దిగగానే సడెన్‌గా
జెట్‌ను సముద్ర మట్టానికి ముప్ఫయి అడుగుల యెత్తుకి
సర్రున డ్రయివ్ చేసి ... పాండిచ్చేరివైపు దూసుకుపో
సాగాడు.

రాడార్ స్క్రీన్‌ని తీక్షణంగా చూస్తున్న కంట్రో
లర్ స్వామినాథన్ కనుబొమలు ముడిపడ్డాయి. ఇప్పుడు
స్క్రీన్‌మీద జంబో ఒక్కటే చుక్కలా కనిపిస్తోంది.

అంగారక చుక్క కనిపించడంలేదు.

క్షణంలో పాడ్లో ప్లాన్ అర్థమయింది స్వామినాథన్‌కి.

"మైగాడ్ ...డిసీట్స్ ..." అరిచాడు స్వామినాథన్.

"ఆ బంగారంకోసం తిరిగి వచ్చే ఉద్దేశ్యంలేదు ఆ మిష నరీకి... బంగారం కేవలం ఒక తెరగా వుపయోగించి, ఆ కరెన్సీ, వజ్రాలు పట్టుకుపోయాడు. వాడు అటు సీ ప్లేన్ మీద వెళ్ళిపోగానే, జంబో వెనక జెట్ కూడా కనిపించడంలేదు.కమాన్ మూవ్ ... వెంటనే ఆ బంగారం తెచ్చిన సూపర్ సానిక్స్‌ను ఆ సీ ప్లేన్ వెళ్ళినవైపు పంపండి."

కాని, అప్పటికే అంగారక, సీప్లేన్ ఆ ప్రదేశందాటి పది నిముషాలు దాటిపోయింది.

* * *

మద్రాసుకు వంద మైళ్ళ అవతల సముద్రపు ఒడ్డుకు అయిదు మైళ్ళ దూరంలో పిన్నగా నీటిమీదకు అంగారకను దించాడు విన్నర్.

కాక్‌పిట్‌లో నుంచి మోటారు, రబ్బరుడింగీ బయటకు తీశాడు. పైడోరు తెరిచి నిలబడ్డాడు.

విమానం నీటిమీద ఆగగానే ఇంజన్ ఆఫ్ చేశాడు. సిఓటు షెల్ ఒకటి తెరిచి రబ్బరు డింగీని నింపాడు. దానికి మోటారు అమర్చి దానిపైకి ఎక్కాడు. అప్పటికే విమానం నీటిలో సగం మునిగింది. విన్నర్ బోట్ స్టార్ట్ చేసి పది గజాలు ఇవతలకు రాగానే కాక్‌పిట్‌లో నీళ్ళు ప్రవేశించాయి.

ఆలోగా సీప్లేన్‌ని కరెన్సీ వజ్రాలు వున్న ప్లాస్టిక్ సంచులతో సహా, సముద్రపు ఒడ్డున దాదాపు యాభై అడుగులు లోతున్న రాతిలోయలో ముంచేశాడు మిషనరీ. కరెన్సీ అంతా ప్లాస్టిక్ బాగ్స్‌లో వుండడంవలన తడుస్తుందని భయంలేదు. మెల్లిగా ఈదుకొంటూ ఒడ్డుకు చేరు

కొన్నాడు.

మరో పది నిముషాలకు దూరంగా రబ్బరు డింగీ కని పించింది. టార్చి వెలిగించి సిగ్నల్ ఇచ్చాడు మిషనరీ. ఇప్పుడతను మిషనరీలా లేడు. నిక్కరు స్పోర్ట్సు షర్ట్ వేసు కొన్నాడు.

"ప్రొఫెసర్!" పిలిచాడు విన్సర్ ఒడ్డుకు వస్తూ...

"కంగ్రాట్యులేషన్స్ మైబాయ్!" అన్నాడు ప్రొఫె సర్ రామన్న కెప్టెన్ విన్సర్‌ను కౌగలించుకొంటూ.

* * *

ఎయిరిండియా జంబో మద్రాస్ ఎయిర్‌పోర్ట్ రన్ వే మీద ఆగింది. ఒడ్డునుండి నీటిలో పడిన చేపల్లా ప్రయాణీ కులు విమానంలో నుండి బయటపడ్డారు.

విమానంనుండి జయపాండ్యన్ దిగి ఎయిర్‌పోర్ట్ వైపు అడుగులు వేశాడు.

ఎక్కడో సైలెన్సర్ అమర్చిన టెలిస్కోపిక్ రైఫిల్ పేలింది. జయపాండ్యన్ గుండెల్లో బుల్లెట్ దిగి కుప్పలా కూలిపోయాడు.

అదే సమయంలో—

ఆ రోజు మధ్యాహ్నం ఎయిర్‌పోర్ట్ డ్యూటీలోవున్న ఇంటెలిజెన్స్ శాఖ మనిషి కారు ప్రమాదంలో మరణిం చాడు...

ప్రధాన మంత్రి వర్గసహచరు డొకడు, కల్నల్ కపూర్‌తో ఆనందంగా విస్కీగ్లాస్‌తో చీర్స్ చెపు తున్నాడు.

...మర్నాడు ప్రొఫెసర్ రామన్న, కెప్టెన్ విన్సర్ మారుపేర్లతో, పాస్‌పోర్ట్‌లతో హాంగ్‌కాంగ్ వెళ్ళి పోయారు.

—: అయిపోయింది :—

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 15 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరు కూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 50 పైసలు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చేనెల మాస పత్రికలో చూడండి. ●

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారా గాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 3/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవ సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య ఎంతమాత్రం లేదు.

నెలనెలా వి.పి.తీసుకోవటం వీలుకాని వారు ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలి-వరీ' లో పంపగలము. ●

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్త్రావ్!



## వసుంధర

(రెండవ భాగము)

"మీ అక్కడు నిద్రమాత్ర వేశాను. మనమధ్య ఏం జరిగినా మీ అక్కడు తెలియదు కాబట్టి ఆ భయంలేదు.'

"అక్కడు తెలిసినా తెలియకపోయినా నేను దానికి ద్రోహం చేయలేను. ఇంకెప్పుడూ ఇలా రావు" అంది ఈశ్వరి.

"నా ఇంట్లో వుంటూ నా తిండి తింటూ నా మాట కాదనడానికి వీల్లేదు. నేను చెప్పినట్లు వినాల్సిందే..." అన్నాడు బావ.

"నువ్వంటే నాకిష్టం లేదు. పిచ్చిపిచ్చి వేషాలు వేశావంటే అరుస్తాను."

"అరిచావంటే నిన్ను వీధిలోకి గెంటేస్తాను. అప్పుడు నీ గతి కుక్కలపాలు" అన్నాడు బావ క్రూరంగా ఆమె వంక చూస్తూ.

తనకు వేరే ఆధారం లేదని ఈశ్వరికి తెలుసు. ఆమెలో కోరికలు చచ్చిపోలేను. వీలుపడితే మళ్ళీ పెళ్ళి చేసుకునేటందుకామెకు అభ్యంతరంలేదు. కానీ ఈ విధంగా ఇంకో స్త్రీతో సంసారం పంచుకోవడం ఈశ్వరికి సుతరామూ ఇష్టంలేదు. అందులోనూ అతడు స్వయానా అక్క మొగుడు. అతనితో సంబంధాన్ని తలచుకుంటేనే ఆమెకు కంపరంగా వుంది. అందుకే "ఆ పని చేస్తేనే మంచిది. ఎలాగో అలా నా మానాన బ్రతుకుతాను" అందామె.

"అందంగా వున్నావుకదా — ఇంట్లోంచి బయటకు తోలేస్తే కంపెనీ పెట్టుకు బ్రతుకుదామనుకుంటున్నట్లున్నావు. సరే—ఆ మనసూ తీరుతుందిలే — ఉత్తినేవద్దు డబ్బు ఇస్తాను. నా కోరిక తీర్చు" అన్నాడామె బావ.

ఈశ్వరి అంగీకరించలేదు.

"నిన్నింట్లోంచి గెంటేయడం ఖాయం. అయితేఓసారి అనుభవించేక..." అంటూ ఆమెమీదకు వచ్చాడు బావ. ఈశ్వరి ప్రతిఘటించింది.

పశుబలాన్ని అబల ప్రతిఘటిస్తూంటే బీరువా చాటునుంచి చూస్తున్న గురువులు ముందుకు వచ్చి - "ఒరేయ్- ఒక్క క్షణం ఆగు!" అన్నాడు.

ఈశ్వరి బావ ఉలిక్కిపడి గురువుల్ని చూసి "వీడెవడు? ఓహ్ - అర్థమయింది. నీ రంకు మొగుడా?" అన్నాడు చటుక్కున.

గురువులు ఈశ్వరి బావను సమీపించి నెత్తిమీద బలంగా మోదాడు. మొదలు నరికిన మానులా కూలిపోయాడు ఈశ్వరి బావ.

ఈశ్వరి ఆశ్చర్యంగా గురువులువంక చూస్తూండి పోయింది. కొద్ది క్షణాల అనంతరం ఆమె వా స్తవంలోకి వచ్చి క్రిందపడ్డ బావ పరిస్థితి ఎలాగుందో నని చూడ సాగింది.

"వాడికేమీ కాలేదు. స్పృహరావడానికి ఓ గంట పడుతుంది. అంతే!"

ఈశ్వరి గురువులువంక చూసి "ఎవరున్నువ్వు?" అంది. ఆ ప్రశ్న అడగాలని అప్పటికి తోచిందామెకు.

"నే నెవరినైతేనేం — ఈ ఇల్లు దోచుకుందామని వచ్చాను. వీడివల్ల ఆ పనికి అంతరాయం కలిగింది. డబ్బెక్కడుందో చెబితే ఆ పని పూర్తిచేసుకుని వెళ్ళి పోతాను" అన్నాడు గురువులు.

ఈశ్వరి గురువులువంక అదోలా చూసి—"ఇతడు నా బావ. నన్ను దోచుకోబోతూంటే ఆపి రక్షించావు. నీ మేలు మరవలేను. ఈ ఇల్లు దోచి నా కాశ్రయమిచ్చిన నా అక్కకు అన్యాయం చేయకు. దయుంచి వెళ్ళిపో" అంది.

"వాళ్ళనీ వీళ్ళనీ రక్షించడంకోసం ఎవరింటికీ వెళ్ళను నేను. దోచుకుందుకు వచ్చాను. దోచుకుని పోతాను. నీ మాటలు వినను నేను" అన్నాడు గురువులు.

ఈశ్వరి ఓ క్షణం ఆలోచించి — "నాలో ఏదైనా విలువ కనిపిస్తోందా నీకు" అని అడిగింది. ఆమె ప్రశ్నకు ఆశ్చర్యపడి—"నీ అభిప్రాయం అర్థంకాలేదు నాకు..." అన్నాడు గురువులు.

"నేను నీతో వచ్చేస్తాను. ఈ ఇల్లు వదిలిపెట్టు..." అంది ఈశ్వరి.

"ఏం చేసుకోను నిన్ను..." అన్నాడు గురువులు.

"అది నీ ఇష్టం. నా అందంతో నువ్వు వ్యాపారం చేసినా అభ్యంతరం లేదు" అంది ఈశ్వరి.

"అంత నీతిలేని దానివి నీ బావ అడిగితే ఎందు కొప్పుకోలేదు...?"

"నా బావ కాబట్టి! చిన్నప్పట్నించీ నన్ను ప్రేమగా పెంచి పెద్దచేసిన అక్కకు అన్యాయం చేయలేను కాబట్టి!"

"దేశంలో అందరు మగవాళ్ళూ నీ బావలాంటివాళ్ళు కారా! నీ అక్కకు అన్యాయం జరక్కుండా వుండడం కోసం ఇల్లు వదిలిపెట్టి నీ అక్కలాంటివాళ్ళు వందల మందికి అన్యాయం చేయాలనుకుంటున్నావా?" అనడిగాడు గురువులు.

"నా బావ అందరు మగవాళ్ళలాంటి వాడు కాదు. ఆడదానికోసం బజారుకెళ్ళే పాడు బుద్ధిలేదు. అందుబాటులో వుండేసరికి మరదల్ని కాబట్టి ఆలుసు తీసుకుంటున్నాడు. నేను ఇల్లు వదిలిపెడితే అతనీ పాడుబుద్ధి వదిలిపెడతాడు" అంది ఈశ్వరి.

"సరే_నాతో రా!" అన్నాడు గురువులు. ఆమె స్త్రీ వేషం తనకిబ్బంది కాబట్టి, పురుష దుస్తులు ధరించమని ఆమెను కోరాడు గురువులు. ఈశ్వరి వేషం మార్చుకుని అతన్ననుసరించింది. తన జీవితం ఏమైనా ఫరవాలేదుకానీ తన అక్క జీవితం బాగుంటే చాలునన్న తృప్తి ఆమెకి ధైర్యాన్ని ప్రసాదించింది.

గురువులు ఆమెను తీసుకుని అజంతా లాడ్జికి వెళ్ళాడు. తన గురించి చెప్పాడు. ఆమె అన్నీ వినికూడా చలించలేదు.

"నీలో మానవత్వం వుంది. నువ్వు మంచివాడివి. నిన్ను ప్రేమిస్తున్నాను..." అందామె.

గురువులు తెల్లబోయి "ఒక ఆడది నన్ను ప్రేమించడమా?" అన్నాడు.

ఈశ్వరి నవ్వి-"ప్రతి మనిషిలోనూ, మానవత్వం, దానవత్వం వుంటాయి. అవి ఏ పాళ్ళలో వుంటాయన్నది చెప్పడం కష్టం. నా సాహచర్యంలో నీలోవి దానవుణ్ని చంపేయగలనన్న నమ్మకం నాకుంది. నీలోని మానవుణ్ని నేను ప్రేమిస్తున్నాను" అంది.

"అవసరం నీకు నామీద ప్రేమను పుట్టిస్తోంది" అన్నాడు గురువులు.

"పోనీ అలాగే అనుకో!" అని నవ్వేసింది ఈశ్వరి.

ఈశ్వరి తనవద్దకు వచ్చాక గురువులు ఆలోచనల్లో వాటంతటవే మార్పులు రాసాగాయి. నీడ పట్టున కూర్చుని సుఖజీవనం గడపాలన్న కోర్కెకు ఈశ్వరి పునాదులు వేసింది. అప్పుడే వాడు విశ్వేశ్వర్రావుగారిల్లు దోచాలనుకున్నాడు. అదే ఆఖరి దొంగతనంగా భావించి రంగారావు సాయం చేపట్టాడు.

ఇప్పుడు రైల్వేస్టేషన్లో టికెట్ కొన్నాక వాడు ఈశ్వరి వద్దకువచ్చి, "ఈశ్వరీ! నీకోసం ఓ టికెట్ తీసుకున్నాను సుబ్బారావు పేరుమీద. నువ్వు బొంబాయి ప్రయాణంకావాలి. ఎవ్వరికీ అనుమానం కలగని విధంగా డబ్బు సర్ది ఇస్తాను. అదే ట్రయిన్లో నేనూ వస్తాను— అన్ రిజర్వుడు కంపార్ట్మెంట్లో. నిన్ను వెయ్యికళ్ళతో కనిపెట్టి చూసుకుంటూంటాను. బొంబాయిలో మన కొత్త జీవితం ప్రారంభమవుతుంది" అన్నాడు.

"నీ పథకం ఫలించిందా?" అనడిగింది ఈశ్వరి.

"ఫలించింది. కానీ విశ్వేశ్వర్రావుకు పటిష్టమయిన ఏర్పాట్లున్నాయి. ఓ హత్య చేయక తప్పలేదు" అన్నాడు గురువులు.

"ఎవరిని-రంగారావునా?" అంది ఈశ్వరి కంగారుగా.

"కాదు" అంటూ జరిగినదంతా వివరించాడు గురువులు.

ఈశ్వరి ఆశ్చర్యంగా అంతావిని "ఎన్ని ఘోరాలుచేసినా నువ్వు నాకు నిజం చెబుతావు. అదొక్కటే నాకుతృప్తి. ఈ ఘోరాలన్నీ మానేస్తే నాకింకా తృప్తి అనుకో" అంది.

"మనమూ అందరిలా జీవితం గడిపేరోజులు వచ్చేస్తున్నాయి." అంటూ గురువులు ఆమెను సమీపించి కౌగిలించుకో బోయాడు.

ఈశ్వరి అతన్ని వారించి, "నాకేమని మాటిచ్చావు" అనడిగింది.

"ఒక సంవత్సరంపాటు స్వచ్ఛమైన జీవితం గడిపే వరకూ నీజోలికి రానన్నాను కదూ?" అన్నాడు గురువులు నిరుత్సాహంగా. "ఒకళ్ళ దగ్గర మాట తీసుకోవడమే గాని ఇంకొకళ్ళకి మాట ఇవ్వడం ఈ గురువులుకు అలవాటులేదు. కానీ నన్ను నువ్వు బాగా లొంగదీశావు. అన్నమాట నిలబెట్టుకోకపోతే ఈ బ్రతుకెందుకులే!"

ఈశ్వరి నవ్వి, "రేపట్నుంచి లెక్కపెట్టుకో. సరిగ్గా ఒక్క సంవత్సరం. సరేనా?" అంది.

"ఊఁ" అన్నాడు గురువులు. అతనలాగంటూంటే ఈశ్వరికే ఆశ్చర్యంగా వుంది.

శకుంతల కుమారుడు భరతుడు సింహాలను లొంగదీసి వాటితో ఆడుకున్నాడని తను చదువుకుంది. అందుకు అవసరమయిన శారీరకబలం ఆ కుర్రవాడికి వుంది. కానీ యే బలంతో తను గురువులును లొంగదీసుకుందో ఈశ్వరికి అర్థంకాదు. గురువులును లొంగదీసుకో గలిగినందుకు మాత్రం ఆమెకు చాలా సంతోషంగా వుంది. చెప్పాలంటే రవంత గర్వంగాకూడా వుంది.

గురువులు తమ బొంబాయి జీవితం గురించి ఈశ్వరికి

వివరించి చెబుతున్నాడు. వాడింక ఒక చిన్న నేరంకూడా చేయడట. ఎవరికీ అనుమానంరాకుండా ఉండడంకోసం ఓ చిన్న వ్యాపారం ప్రారంభిస్తాడట. రోజా వాడూ, ఈశ్వరీ నగర విహారం చేస్తారుట. సినిమాల్లో హీరో, హీరోయిన్‌లలా డ్యూయెట్లుట. ఓ ఏడాది తిరక్కుండా వాళ్ళతో పాప!

"అన్నట్లు ఒక ఏడాది కాదు. రెండేళ్ళు తిరగాలి" అన్నాడు గురువులు తన కలను సవరించుకుంటూ. ఈశ్వరి కిసుక్కున నవ్వి, "కలలు కనడం ఆపి నాదో చిన్న కోరిక మన్నిస్తావా?" అంది.

"ఏమిటది?"

"ఈరోజు నువ్వు హత్య చేశావు. అది నాకంత సంతోషంగా లేదు. ప్రతాప్‌ని నువ్వు చంపడానికి కారణం నీగురించి అతడికి తెలిసిపోయిందనేగా. అలాగే నీగురించి తెలిసిన మనిషి నేనుకాక ఇంకొకడున్నాడు"...అంది ఈశ్వరి.

"అవును. రంగారావు."

"రంగారావు పక్రాడు. వాడికి జీవితంమీద చాలా ఆశ వుండివుంటుంది. నువ్వుచేసిన హత్య కళ్ళారాచూసేక వాడికి నువ్వంటే చాలా భయంకలిగి వుంటుంది. కాబట్టి వాడు నీకేమీ అపకారం తలపెట్టడు. ఒకవేళ కర్మకాలి వాడు నీగురుంచి పోలీసులకుగానీ, మరెవరికిగానీ సమాచారం అందిస్తే వాణ్ని క్షమించి వదిలిపెడతావా, చంపేస్తావా?" అంది ఈశ్వరి.

"చంపేస్తాను" అన్నాడు గురువులు.

"చంపవద్దు. క్షమించి వదిలిపెట్టేసేయ్..." అంది ఈశ్వరి.

"అది నా పద్ధతికి విరుద్ధం" అన్నాడు గురువులు.

"నీ పద్ధతికి విరుద్ధంగానే కదా యికమీదట నీవు జీవించబోతున్నావు?" అంది ఈశ్వరి.

ఏం చెప్పాలో గురువులుకు తోచలేదు. తనకు అపకారం తలపెట్టిన వాళ్ళను ప్రాణాలతో వదలడమన్నది ఊహించుకుంటూంటేనే అతనికి కంపరంగావుంది. ఆ విషయమే అతను ఈశ్వరికి చెప్పగా ఆమె నవ్వి, "ఇక మీదట ఒకచిన్న నేరంకూడా చేయనని నువ్వన్నావు. నీ మనస్తత్వానికి అది సరిపడుతుందంటావా?" అంది.

అది ఈశ్వరి తనకు విసిరిన సవాలుగా భావించాడు గురువులు. అయినప్పటికీ వాడు ఆమె ప్రశ్నకు సమాధాన మివ్వకుండా, "అవన్నీ ఇప్పుడెందుకు? ప్రతాప్‌ని చంపినప్పుడే రంగారావును చంపకుండా ఎందుకు వదిలి పెట్టాననుకుంటున్నావ్? వాడిమీద నమ్మకంతోనేగదా-వాడు నాకు అపకారం తలపెట్టడు" అన్నాడు.

"కావాలని తలపెట్టడు. కానీ పరిస్థితులు ప్రోత్సహించి తలపెడితే?"

"క్షమించి వదిలిపెడతానులే" అన్నాడు గురువులు.

సాయంత్రం అయిదు గంటలకు గదిలోంచి బయలు దేరాడు గురువులు. బయల్దేరేముందు ఈశ్వరితో "సరిగ్గా ఆరున్నరకు వచ్చేస్తాను. ఆ క్షణంనుంచే మన బంగారు కలలు ప్రారంభమవుతాయి" అన్నాడు.

"ఆరున్నరకు రాలేకపోతే..."

"ఏడు దాటదు."

"దాటితే?"

"ఈశ్వరీ!" అన్నాడు చిరాగ్గా-"గురువులు సంగతి నీకింకా బాగా తెలియదు. ప్రాణాలుపోతే నా శవమైనా నడిచి వచ్చేస్తుంది కానీ ఏడుదాటదు."

ఈశ్వరి చటుక్కున వాడి నోరుమూసి — "మనది

మామూలు జీవితమయితే బాధలేదు. నీకు తెలుసుగదా నాబాధ! అంతా స్వార్థం! నువ్వు రాకపోతే, రాలేకపోతే నేనేమయిపోతాను?"

"ఎట్టి పరిస్థితుల్లోనూ నీకు కష్టం రానివ్వను" అని బయల్దేరాడు గురువులు. వాడు వెడుతుంటే నిట్టూర్చింది ఈశ్వరి బాధగా, భయంగా.

గురువులు బయల్దేరి వెళ్ళి సరాసరి పోలీసుల ట్రాప్‌లో ఇరుక్కున్నాడు. వాడి చెవిలో ఈశ్వరి మాటలు గింగురుమంటున్నాయి. "నువ్వు రాకపోతే, రాలేకపోతే నేను ఏమైపోతాను?"

గురువులు పైకి ఎత్తిన చేతులను కొద్దిగా కిందకి దింపి పోలీసులకు దణ్ణం పెట్టాడు. "మీరు నన్నిలాగ చుట్టుముట్టారు. నేనిప్పుడు మీనుంచి తప్పించుకోగలనని అనుకుంటున్నారా?"

రఘునాథ్ నవ్వి, "అనుకోవడంలేదు" అన్నాడు.

"అయితే ఈ బ్రీఫ్‌కేసులోని డబ్బు నా జేబులోకి మార్చుకుంటాను. మీమీద మీకు నమ్మకముంటే అంగీకరించండి. మీరు చేతకాని వాళ్ళమనుకుంటే ఒప్పుకోకండి."

ఈ సవాల్ అవమానకరంగా తోచింది రఘునాథ్‌కు. ఆ బ్రీఫ్‌కేసులో ప్రమాదకరమయినవేమీ లేవని తనకు తెలుసు. గురువులు ఏమాలోచిస్తున్నాడు? ఇక్కణ్ణించి ఎలా తప్పించుకుపోగలననుకుంటున్నాడు? ఏదయినా రహస్యాయుధం తీసినా యింతమంది పోలీసులనెలా తప్పించుకోగలడు? ప్రాణాలకు తెగించయినా గురువుల్ని పట్టుకోడానికి పోలీసు సిబ్బంది సిద్ధంగా వుంది.

"పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకుండా డబ్బుతీసి జేబుల్లోకి మార్చుకో. అడెక్కడున్నా ఒక సేవని నీకూ

తెలును, నాకూ తెలుసు'' అన్నాడు రఘునాథ్.

ఈలోగా రెండు కెమెరాలు క్లిక్‌మన్నాయి. పోలీసు సిబ్బందిలో ఇద్దరు గురువులు ఫోటోలు తీసుకున్నారు.

గురువులు నేలమీద చతికిలబడి బ్రీఫ్‌కేసులోని నోట్ల కట్టల్ని పాంటుజేబుల్లోకీ, చొక్కా జేబుల్లోకీ, బనీను క్రిందకు తరలించాడు. తర్వాత జేబులన్నిటికీ బటన్స్ పెట్టేసుకున్నాడు. చెమ్మగిల్లిన కళ్ళతో లేచి నిలబడి చేతులు పైకెత్తాడు.

పోలీసుల్లో కొందరు అతని దగ్గరున్న డబ్బుచూసి ఆశ్చర్యంతో నోరు తెరిచారు. అయితే అందరి తుపాకులూ పొజిషన్‌లోనే వున్నాయి.

"మీకు ఆవూ, పులీకథ తెలుసుగదా!'' అన్నాడు గురువులు.

"కబుర్లు కట్టిపెట్టు—'' అన్నాడు రఘునాథ్.

"నేను ఆ కథలోని ఆవు అంత నమ్మకమైన మనిషిని. నన్ను ఒక్కక్షణం వదిలిపెడితే సరాసరి పోలీస్ స్టేషనుకే వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను — యింకో రెండు గంటల్లో!'' అన్నాడు గురువులు.

"నోరుమూసుకుని, కదలకుండా నిలబడు. పిచ్చిపిచ్చి వేషాలు వేయడానికి ప్రయత్నించకు, నేనువస్తున్నాను'' అన్నాడు రఘునాథ్.

చుట్టూ వలయాకారంలో పోలీసులున్నారు. ఆ వలయం లోంచి రఘునాథ్ గురువులువైపు వస్తున్నాడు. ఎంతో మంది సాధించలేకపోయిన ఘనకార్యం తన చేతుల మీదుగా జరగబోతున్నదన్న ఆనందం, గర్వం అతను అడుగులు వేసే పద్ధతిలో కనబడుతున్నాయి.

గురువులు, రఘునాథ్ చేతులవంక చూశాడు. ఆ చేతిలో సంకెళ్ళు వున్నాయి అతని కోసం.

గురువులు వున్నట్లుండి గాలిలోకి ఎగిరాడు. ఎవ్వరూ ఊహించని సంఘటన అది. ఆ ఎగరడంలో వాడు సరిగ్గా వలయానికి అవతలవున్న రెండెడ్ల బండిమీద పడ్డాడు. ఏదో పక్షి ఒకచోటనుంచి ఇంకోచోటికి ఎగిరి వాలినంత సులభంగా వాడాపని చేశాడు. బండిమీద పడిన గురువులు మరో ఊపులో బండికవతలవున్న జీపులోపడ్డాడు. మరు నిముషంలోనే వాడు జీపును స్టార్ట్ చేశాడు.

ఇన్‌స్పెక్టర్ రఘునాథ్ నిశ్చేష్టుడై పోయాడు. ఇలా జరిగే అవకాశమున్నదని అతడికి స్ఫురించనయినా లేదు. గురువులు పరిసరాలను చూసుకుని ఏంచేయాలో ఆలోచించుకుని తనకు కావలసిన డబ్బు తీసుకుని పోలీసుజీపులో పారిపోయాడు. అందుకు అవసరమయిన అవకాశమూ, వ్యవధీ తనే స్వయంగా గురువులుకు కలుగజేశాడు. తన వల్ల జరిగిన ఈ పొరపాటును తన డిపార్టుమెంటయినా క్షమించవచ్చు కానీ తను క్షమించలేడు.

సిబ్బంది యావత్తూ పరుగులెట్టింది కానీ గురువుల్ని ఆపలేకపోయింది.

* * *

గురువులు జీపును రోడ్డుకు పక్కగా ఆపి అలా వస్తున్న ఓ రూట్ బస్ ఎక్కి ఊళ్ళోకి వెళ్ళాడు. అజంతా లాడ్జికి వెళ్ళి ఈశ్వరికి డబ్బు ఇచ్చి "అన్న ప్రకారం వచ్చేనా?" అన్నాడు.

"ప్రమాదమేమీ జరగలేదుకదా!" అంది ఈశ్వరి.

"అంతా ప్రమాదమే" అంటూ జరిగింది వివరించాడు గురువులు. ఈశ్వరి కంగారుగా అంతా విని—"అయితే ఇప్పుడేం చేయాలి?" అంది.

"పోలీసులు నా ఫోటోలు తీశారు. అవి ఇంకో గంటలో ఊరంతా పెంచిపెడతారనుకుంటాను. మనని పక్కల్ని

వేటాడినట్లు వేటాడుతారు. ఈ అజంతా లాడ్జిలో మనం చాలా కాలంగా వుంటున్నాం. నా కారణంగా నువ్వూ దొరికిపోతావు. ఇప్పుడున్న వేషంలో అయితే లాడ్జివాళ్లు గుర్తిస్తారు. ఆడవేషంలో అయితే నీ బావ గుర్తిస్తాడు. గడ్డం మీసాలు పెట్టుకుని కొత్తవేషం వేస్తేతప్ప దారి లేదు. ముందీ లాడ్జినుంచి బయటపడాలి'' అన్నాడు గురువులు.

ఇద్దరూ తమ సామానుతో లాడ్జి ఖాళీచేసి బయట పడ్డారు. గురువులు ఓ రిక్షాలో తమ సామాను పెట్టించాడు. ఆ రిక్షాలోనే తమ వేషధారణ మార్పుచేశాడు. అద్దంలో తన ముఖం చూసుకుని గురువులుకా విద్యలో వున్న నేర్పు చూసి ఆశ్చర్యపడింది ఈశ్వరి.

''ఇలాంటి విద్య లెన్ని లేకపోతే ఇన్నాళ్ళూగా బ్రతుక గలుగుతున్నాను?'' అన్నాడు గురువులు గర్వంగా.

రిక్షా దిగే సమయానికి రిక్షావాడికి అనుమానం రాకుండా తమ ముఖాలు కనబడకుండా జాగ్రత్తపడ్డాడు గురువులు. ఇద్దరూ రైల్వేస్టేషన్ వద్ద దిగారు. అక్కడ ఈశ్వరికి సామాను అప్పగించి — ''నువ్వు బొంబాయి వెళ్ళిపో'' అన్నాడు గురువులు.

''మరి నువ్వు?'' అంది ఈశ్వరి.

''నీతోనే వస్తాను గానీ...'' అని ఆగిపోయాడు గురువులు.

''ఏం? ఆగిపోయావు...'' అంది ఈశ్వరి.

''నేను అక్కడ సామాను పాతిపెట్టినట్లు పోలీసులకు తెలిసిందిగదా — కాబట్టి మన బొంబాయి ప్రయాణం సంగతికూడా తెలిసి వుండొచ్చు.''

''ఎలా తెలుస్తుంది?''

''ఒక్కటే అవకాశం ... ఆ రంగారావుగాడు

నన్నను సరించి వుండాలి'' అంటూండగానే ఆవేశంతో అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

''నువ్వు ఆవేశపడుతున్నావు...రంగారావు నిన్నను సరిస్తే అనుసరించాడులే కానీ ముందు కర్తవ్యం చూడు. మన ప్రయాణం మార్చేద్దాం'' అంది ఈశ్వరి.

గురువులు కౌంటర్లో ప్రయత్నించాడు. భువనేశ్వర్ వెళ్ళడానికి ఓ రెండు బెర్తులు ఖాళీ వున్నాయి. బండి రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో వుంది. గురువులు ఒక్క టికెట్ మాత్రమే తీసుకున్నాడు.

''సామాను జాగ్రత్త. ప్రయాణం నువ్వొక్కదానివే చేస్తావు. నాకీ ఊళ్ళో చిన్నపని వుంది. అది పూర్తి చేసుకుని రేపు బయల్దేరి వస్తాను. ప్రస్తుత పరిస్థితుల్లో ఇద్దరూ విడివిడిగా ప్రయాణం చేయడం శ్రేయస్కరం. నువ్వు ఊళ్ళో దిగి ఏదైనా లాడ్జిలో ప్రవేశించు. పేరు కృష్ణమూర్తి అని చెప్పు. నేనక్కడకు వచ్చి నిన్ను కనుక్కుంటాను...'' అన్నాడు గురువులు.

ఈశ్వరికి అంతా భయంగా వుంది—''నీకీ ఊళ్ళో వున్న పనేమిటి?'' అంది.

''ఆ విషయాలు నన్నడగొద్దు. చెప్పినట్లు చేయి...''

''అలాగే చేస్తాను కానీ నువ్వు భువనేశ్వర్ రాకపోతే ఏం చేయను?''

''గంగలో దూకు'' అన్నాడు గురువులు చిరాగ్గా.

''భువనేశ్వర్లో గంగానది వుండదనుకుంటాను'' అంది ఈశ్వరి.

''ప్లీజ్—వేళాకోళాలాడకు. నేను వెడుతున్నాను.'' అన్నాడు గురువులు.

''సరే—కానీ నా దొక చిన్న విన్నపం. నువ్వుమాత్రం రంగారావు జోలికి వెళ్ళకు...'' అంది ఈశ్వరి.

"అలా గేలే!" అని అక్రోశించి కదిలాడు గురువులు.

ఆమె వద్దని అంటున్నప్పటికీ అతడి మనసు రంగారావు మీద పగతో కతకత వుడికిపోతున్నది. పోలీసులకు తన గురించిన సమాచారం అందజేశాడు. అలా చేసినందుకు తగిన రీతిని వాడిని శిక్షిస్తే తప్ప తన మనసు శాంతించదు.

గురువులుకు చాలా ఆవేశంగా వుంది. ఆ ఆవేశంలో వాడు పరిసరాలను సరిగ్గా గమనించడంలేదు. రోడ్డు దాటబోతూ ఓ కారుకింద పడ్డాడు.

కారు సడెన్ బ్రేకుతో ఆగింది. గురువులుకు తలమీద గాయం కావడంతో హాస్పిటల్ కు తరలించాల్సి వచ్చింది.

* * *

"మిస్టర్ గురువులూ!" అన్నాడు ఇన్ స్పెక్టర్ రఘునాథ్. "పాపం, నిన్ను దురదృష్టం వెంట తరిమింది. యాక్సిడెంట్ జరిగివుండకపోతే నిన్ను జన్మకు పట్టుకో గలిగి వుండేవాళ్ళంకాదు. నీకు అపారమయిన తెలివితేటలూ, ఆత్మవిశ్వాసమూ ఉన్నాయి. కానీ దైవబలం లేదు. తప్పులు చేసేవాడిని దేవుడెన్నడూ క్షమించడు."

గురువులు మౌనంగా ఊరుకున్నాడు.

నిజంగానే తను దేవుడిచేత వంచింపబడ్డాడు. కాదు కాదు...కోరి తనే ఆపదలో ఇరుక్కున్నాడు. ఈశ్వరికిచ్చిన మాట తప్పడంవల్లనే ... ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా రంగారావుపై పగతీర్చుకోడానికి బయలేరడం వల్లనే తనకీ దుర్గతి కలిగింది. ఆవేశం తనకు ఆక్సిడెంట్ కలిగించింది. హాస్పిటల్లో తన మారువేషం బయటపడింది. తను జైలు పాలయ్యాడు.

ఈశ్వరి భువనేశ్వర్ చేరుకొని వుంటుంది. తనకోసం ఎదురుచూస్తూంటుంది. తను జైలుపాలయిన విషయం

ఆమెకు తెలిసిందో, లేదో!

"మిస్టర్ గురువులూ! నీమీద చాలా అభియోగాలున్నాయి. అన్నీ ఒప్పేసుకుంటే ఏ బాధాలేదు. కానీ."

"రఘునాథ్ గారూ!" అన్నాడు గురువులు—"నామీద ఏ అభియోగాలున్నయో లేవో తెలియదుగానీ యెలాంటి అభియోగాలున్నవో ఊహించుకోగలను. నావల్లచచ్చిన వాళ్ళు చాలావరకూ చాలామంది నావంటి వాళ్ళే! సమాజం చెప్పిన నీతులు పాటించలేదని మీరు నన్ను చంపాలను కొంటున్నారు. ఏకారణం వల్లనయితేనేం నేనూ ఆ పనేచేశాను. నావల్ల చనిపోయినవాళ్ళు మీకు దొరికివుంటే—మీరూ వాళ్ళకు ఏ ఉరిశిక్షో విధించి వుందురు. దానిగురించి నేను చెప్పాకోవలసిందీ చెప్పాకో దలచిందీ లేదు.

ఎటొచ్చీ జీవితంమీద నాకింకా ఆశవుంది. అదిచావలేదు. ఆ ఆశ నన్నీ జైలుగోడలు దాటించినా ఆశ్చర్యపోను. ప్రస్తుతానికి జీవితం నాకు శూన్యంగా తోస్తోంది. కొంతకాలంపాటు ఆనందంగా గడపడానికి ఒక్కటే మార్గం తోస్తోంది నాకు."

"ఏమిటది?" అన్నాడు రఘునాథ్.

"నన్ను పట్టుకున్నాక నా గురించిన వార్తలు ఏయే పేపర్లలో పడ్డాయో ఆ కటింగ్సు అన్నీ ఇప్పిస్తే—అవి చదువుకుని నా ప్రతాపానికి గర్వపడుతూ రోజులు గడిపేస్తాను..."

రఘునాథ్ గురువులు కోరికకు ఆశ్చర్యపడ్డాడు. అయితే అందులో ఏమీ మోసం లేదుగాదా అని అనుమానపడ్డాడు. కానీ న్యూస్ పేపరు కటింగ్సుతో గురువులు చేయగల మోసమేముంటుందో అతడికి స్ఫురించలేదు. అయినప్పటికీ

మానవత్వం గల మనిషిగా గురువులుకోరిక తీర్చాలని రఘునాథ్ అనుకున్నాడు.

ఇంగ్లీషు, తెలుగు పేపర్లలోని కటింగ్సు తెచ్చి అందులోని వివరాలు తనే చదివి వినిపించాడు. గురువులు అవి ఏయే పేపర్లో, ఏయేప్రాంతాలలో సర్క్యులేషన్‌లో వున్నాయో తెలుసుకున్నాడు.

ఇనస్పెక్టర్ చెప్పిందాన్నిబట్టి కొన్ని తెలుగు దినపత్రికలుకూడా భువనేశ్వర్ వెడతాయని అతను గ్రహించాడు. తన గురించిన వివరాలు ఫోటోలతోసహా ప్రముఖ వారపత్రికలలో ప్రచురించబడ్డాయి. ఈశ్వరి తప్పకుండా ఈ వివరాలన్నీ చదివి వుంటుంది. తన దీనస్థితి గురించి ఆమెకు తెలిసి వుంటుంది. తెలిసేక ఆమె ఏం చేయగలదు?

ఆమె తనకోసం ఏమి చేయగలదన్న దానికంటె, ఆమె ఇప్పుడేం చేస్తున్నదన్నది ముఖ్యంగా ఆలోచించాల్సిన విషయం. ఈశ్వరి దగ్గర డబ్బయితే వుందికానీ ఆమె ఒంటరి ఆడది.

రఘునాథ్ గురువుల్ని చాలా ప్రశ్నలడిగాడు. గురువులు తీసుకువెళ్ళిన డబ్బు ఏం చేశాడో చెప్పలేదు. గురువులు చాలాకాలం అజంతా లాడ్జిలో వున్నట్లూ అతడికో ప్రాణస్నేహితుడున్నట్లూ పోలీసులకు అర్థమయింది కానీ ఆ స్నేహితుడి వివరాలు వారికి లభించలేదు.

ఈశ్వరి బావ గురువుల్ని గుర్తుపట్టాడు. అతడు ఒకపర్యాయం గురువులు తన ఇంటికి వచ్చి తనను గాయపర్చి తన మరదలి నెత్తుకుపోయాడని పోలీసులకు చెప్పాడు. గురువులతడి కథ విని, నవ్వి ఊరుకున్నాడు.

"ఆమెనేం చేశావ్ — చంపేశావా?" అనడిగాడు రఘునాథ్.

"అవును..." అన్నాడు ముక్తసరిగా గురువులు.

ఒకరోజు రఘునాథ్, గురువులు దగ్గరకు వచ్చి—"నీ ప్రాణ స్నేహితుడు నీకు ఉత్తరం రాశాడు. చదువుకుంటావా?" అనడిగాడు.

గురువులు ఆత్రుతగా ఆ ఉత్తరం చూశాడు. అది ఒక కార్డు. గురువులు కేరాఫ్ ఇన్‌స్పెక్టర్ రఘునాథ్-అన్న అడ్రసుతో వుత్తరం వ్రాయబడింది.

"నా గురించి కంగారుపడకు. నేను క్షేమంగా వున్నాను. నీకూ మంచిరోజులు రాగలవని ఆశిస్తాను...నీ ప్రాణస్నేహితుడు."

ఆ ఉత్తరం రాసినది ఈశ్వరి అని ఊహించుకోగలిగాడు గురువులు. ఉత్తరం భువనేశ్వర్ నుండి పోస్టయింది. ఈశ్వరి ఇప్పుడు భువనేశ్వర్లో వుండివుండదు. అందుకే తెలివిగా భువనేశ్వర్ నించి పోస్టుచేసింది.

"ఈశ్వరీ-నిన్ను కలుసుకుని నీతో జీవితం గడపాలని వుంది. అది సాధ్యపడుతుందా ఈ జన్మకి!" అంటూ నిట్టూర్చాడు గురువులు.

* * *

తనను కలుసుకోవడానికి ఎవరో అపరిచిత వ్యక్తివచ్చేడని వినగానే గురువులు కంగారుపడ్డాడు. ఆమె పురుష వేషంలోని ఈశ్వరి అయుండాలని అతడికి అనిపించింది.

ఈశ్వరి ఇంత తెలివితక్కువగా ఎందుకు ప్రవర్తిస్తోంది? అసలామె ఉత్తరం వ్రాయడమే తెలివితక్కువ. అందువల్ల ఆమె కొంతకాలం భువనేశ్వర్లో వున్నట్లు వారు గ్రహించగలిగారు. ఆమె దస్తూరీని గుర్తించారు. ఇప్పుడామెనే గుర్తించగలుగుతారు.

అయితే గురువులూహించినట్లుగా ఆ వ్యక్తి ఈశ్వరి

కాదు. అతడినెప్పుడూ తను చూడలేదు. మనిషి బాగా పొడగరి. రంగు నలుపే అయినా ముఖం చాలా కళగా వుంది.

"నువ్వు నాకు తెలుసుగానీ—నేను నీకు తెలియదు" అన్నాడతను వస్తూనే. ఆ నవ్వు సమ్మోహనంగా వుంది.

"ఎవరున్నువ్వు?"

ఆ మనిషి గురువులును సమీపించి—"నేను శ్రీకృష్ణ పరమాత్మను" అన్నాడు.

"అది నీ పేరా?" అన్నాడు గురువులు. ఇటువంటి పేరును అతను వినలేదు. విచిత్రమైద పేరు, విచిత్రమైన మనిషి-అని మనసులో అనుకున్నాడు గురువులు.

"ఎలా అనుకున్నా సరే-నాకేమీ నష్టంలేదు. నాకు నీతో చాలా పెద్దపని వుంది. ఆ పని నీవల్ల తప్ప ఎవ్వరి వల్లా కాదు..." అన్నాడు శ్రీ కృష్ణపరమాత్మ.

"నావల్ల ఏమవుతుంది? జైల్లో వున్నాను నిస్సహాయంగా" అన్నాడు గురువులు.

"సింహం ప్రతాపం బోనులో వున్నప్పుడు కాదనీ... బోనులో పడడం సింహానికి అవమానం కాదనీ నాకు తెలుసు" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"అంటే?"

"నిన్ను జైలునుంచి తప్పిస్తాను" అన్నాడతను స్వరం తగ్గించి.

"ఎలా?" అన్నాడు గురువులు. అతడిలో హఠాత్తుగా ఆశ తొంగి చూసింది.

"ఘటనాఘటన సమర్థుణ్ని. శ్రీకృష్ణపరమాత్మను. నిన్ను జైలునించి తప్పించలేనా?"

"ఎలా?" అన్నాడు గురువులు మళ్ళీ.

"నా చేతిఉన్న ఈ వాచీ చూడు. ఒక చిన్న మాట

నొక్కితే దీనినుండి ఒకరకం కిరణాలు ప్రసరిస్తాయి. అవి సోకిన రెండు గంటలకు మనిషిలో రియాక్షన్ ప్రారంభం అవుతుంది. ముందు రంగు నల్లగా మారిపోతుంది. పోలీసులు కంగారుపడి హాస్పిటల్ కు పంపిస్తారు. ఒకసారి ఇక్కణ్నుంచి బయటపడితే ఆ తర్వాత అన్నీ నేను చూసుకుంటాను..." అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"నీమీద ఎవ్వరికీ అనుమానంరాదా?"

"ఎందుకొస్తుంది? పెద్ద మనుషులకు పెద్ద మనిషిని. దేవాది దేవుణ్ని. శ్రీకృష్ణ పరమాత్మను..." అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"నువ్వు శ్రీకృష్ణపరమాత్మవైతే ఈ దొంగచాటు వ్యవహారాలెందుకు? నీ పనికి నామీద ఆధారపడడ మెందుకు?" అన్నాడు గురువులు నిరసనగా.

"శ్రీకృష్ణపరమాత్మను కాబట్టే దొంగచాటు వ్యవహారాలు. తనకు తానై కృష్ణుడు ఏం చేశాడు? దుష్ట శిక్షణ కోసం అర్జునుడి నెన్నుకుని గీతాబోధనచేసి తన పన్లు చేయించుకున్నాడు. కొన్ని జన్మలక్రితం నువ్వు అర్జునుడి వని ఈరోజే నాకు స్ఫురణకు వచ్చింది..."

"ఏమిటి నీ పని!"

"ఆ వివరాలు తర్వాత తెలుస్తాయి" అంటూ అతను తన వాచీలోని ఓ మీట నొక్కాడు. గురువులు శ్రీకృష్ణ పరమాత్మనే ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అతను మరో నిముషంలో వాచీలోనిమీటను మళ్ళీనొక్కి అక్కణ్ణించి తిన్నగా వెళ్ళి రఘునాథ్ ని కలుసుకొన్నాడు.

"చెప్పాడా?" అన్నాడు రఘునాథ్.

"చెప్పలేదు, మహా మొండిఘటంలా వున్నాడు—" అన్నాడు పరమాత్మ.

(సశేషం)*



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును. —ఎడిటర్]

## దొంగ దొరికాడు

ఈ సారైనా 'అపన'లో పడేటంత జోకు రాయాలని పేపరు తీసుకుని పెన్సల్ కోసం వెతికింది లలిత. కనబడ లేదు.

వీధి పిల్లలందరు తనగదిలోనే వున్నారు. ఎవరు తీసుం టారు? వారిదగ్గరికి పోయి "పిల్లలూ ఒక మంచి పొడుపు కథ చెప్తాను. జవాబు చెప్పేవారికి బహుమానం" అంది.

అందరూ 'రెడీ' అన్నారు.

"పోతూ పోతూ ఆగిపోతుంది. తల నరికితే మళ్ళీ పోతుంది. ఏమిటది?"

ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. తెలీలేదు. 'క్లూ' ఇవ్వమన్నారు.

కాసేపాగి "ఈ రోజే అది నేను పోగొట్టుకున్నాను" అని నిట్టూర్చింది.

"నాకు తెలుసు. పెన్సల్" అరిచాడు సోము.

"నా పెన్సల్ పోయిందని నే నెవరితో యింకా చెప్ప లేదు. నీకేలా తెలిసింది" అడిగింది లలిత వెంటనే.

పాపం! తలవంచుకున్నాడు సోము.

—దామెర్ల కృష్ణమూర్తి, నెల్లూరు.

## "తగువు"

ఒక సినిమా హాల్లో పక్కపక్క కుర్చీల్లో కూర్చున్న ఒక యువకుడు, యువతి ఇలా వాదించుకొంటున్నారు.

"మీకు సంస్కారమనేది వుండివుంటే, ఇలా ఒక అమ్మాయిని వళ్ళంతా కళ్ళుచేసుకుని చూడరు"

"ఆ సంస్కారమే మీకు వుండివుంటే ఇలా పరాయి మగాడితో తగువుపెట్టుకుని వుండరు."

"మీరు నిజంగా మర్యాదస్థులే అయితే ఇలా నాకు సంస్కారం నేర్పే ప్రయత్నం చెయ్యరు?"

"ఆ మర్యాదే మీకు వుంటే సినిమా చూడకుండా ఇలా నన్ను అల్లరి పెట్టరు!"

"మీరే నా భర్తయితే యింత విషంపెట్టి చంపేద్దును!"

"మీరే నా భార్యఅయితే యింత విషంమింగి చద్దును!"

—పి. లక్ష్మి, కొత్తూరు.

## అసహజం?

బాక్సాఫీసు హిట్ పిక్చర్ ఆ థియేటర్‌లో ప్రదర్శింపబడుతున్నది.

హీరోయిన్‌కు నలుగురు డాక్టర్లు కలిపి ఆపరేషన్ చేస్తారు గాని ఆమె చనిపోయింది. రాంబాబు ప్రక్క సీట్లో ఉన్న బట్టతల ఆసామీ రుసరుసలాడుతూ బయటకు వెళ్ళిపోయి పదిహేను నిముషాల తరువాత మళ్ళీ వచ్చాడు.

"ఏం సార్! అంత ఆసక్తికరంగా ఉంటే మధ్యలో వెళ్ళిపోయారు" అడిగాడు రాంబాబు.

"హీరోయిన్‌ను చంపడానికి నలుగురు డాక్టర్లకు పదిహేను నిముషాలు పట్టాలా? చాలా అసహజం!" అన్నాడు ఆ బట్టతల డాక్టరు. —డాక్టర్ ప్రభాకర్, తిరుచ్చి-14.

